# విషయసూచిక



మన ఇతిహాసాలు

**ఉపవాచకాలు**



✿ సంస్కృతం కాంపోజిట్ కోర్సుగా చదివేవారు 'భిక్ష, మాణిక్యవీణ, జానపదునిజాబు, ధన్యుడు' పాఠాలను చదువవలసిన అవసరంలేదు.



# 1. వెన్నెల

– ఎఱ్ఱన

## ఉన్ముఖీకరణ

ఈ కవిత చదవండి

కొండకోనల్లో
నవ్వుతూ, తుళ్ళుతూ పరుగెడుతున్న
సెలయేరు
కాలుజారిలోయలో పడిపోయింది.
అదిచూసి
ఆకులు చాటుచేసుకొని,
మొగ్గలు బుగ్గలు నొక్కుకున్నాయి.
ఇదంతా చూస్తున్న సూరీడు
పొట్ట చెక్కలయ్యేలా నవ్వుతూ
పడమటి కొండల వెనక్కి
పడిపోయాడు.

**ప్రశ్నలు:**

1. ఈ కవిత దేన్ని వర్ణిస్తున్నది?
2. సూరీడు పడమటి కొండల వెనక్కి పడిపోవడమంటే ఏమిటి?
3. సెలయేరు కొండకోనల మీద నవ్వుతూ తుళ్ళుతూ పరుగెత్తడం మీకేమని అర్థమయ్యింది?
4. వర్ణనాత్మకమైన కవిత్వం చదవడంవల్ల కలిగే ప్రయోజనాలేవి?

## పాఠ్యాంశ ఉద్దేశం / నేపథ్యం

ఎఱ్ఱన వర్ణనలకు ఆద్యుడు. అతని కావ్యాలలోని వర్ణనల ననుసరించే సాహితీలోకం 'ప్రబంధపరమేశ్వరు'డని గౌరవించింది. హిరణ్యకశిపుడు వనవిహారం చేయడం, ఆ సందర్భంగా వసంత ఋతువును, సాయం సమయాన్ని, చంద్రోదయాన్ని, వెన్నెలను, ప్రాతఃకాలాన్నీ వర్ణించాడు కవి. రోజంతా తీవ్రమైన ఎండను ప్రసరింపజేసిన సూర్యుడు, ఇంకా ఉష్ణతాపాన్ని పెంచితే అసురనాయకుడైన హిరణ్యకశిపుడు సహింపడేమో అన్నట్లు నెమ్మదిగా పక్కకు తొలగి పోయాడు. తదనంతరం ప్రకృతిలో వచ్చిన మార్పులను రమణీయంగా వర్ణించాడు కవి. ఆ వర్ణనలే ఈ పాఠ్యభాగం.



## పాఠ్యభాగ వివరాలు

ఈ పాఠ్యం కావ్య ప్రక్రియకు చెందింది. కావ్యం వర్ణన ప్రధానంగా సాగుతుంది. ప్రస్తుత పాఠ్యాంశం ఎఱ్ఱన నృసింహపురాణం తృతీయాశ్వాసం లోనిది.

## విద్యార్థులకు సూచనలు

- పాఠం ప్రారంభంలోని పేరా చదవండి. పాఠంలోని విషయాన్ని ఊహించండి.
- పాఠం చదవండి. అర్థంకాని పదాలకు కింద గీతగీయండి.
- వాటి అర్థాలను పుస్తకం చివర ఉన్న 'పదాలు - అర్థాలు' పట్టికలో చూసి లేదా నిఘంటువులో చూసి తెల్సుకోండి.

## కవి పరిచయం



8, 9 తరగతులలో నన్నయ, తిక్కన గురించి తెలుసుకున్నారు కదా! కవిత్రయంలో మూడవ వాడైన ఎఱ్ఱన గురించి ఇప్పుడు తెలుసుకుందాం. 14వ శతాబ్దపు ప్రథమార్థంలో జీవించిన ఎఱ్ఱన తల్లిదండ్రులు పోతమాంబికా, సూరనార్యులు. అరణ్యపర్వశేషము, నృసింహపురాణము, రామాయణము, హరివంశము మొ॥ గ్రంథాలను ఎఱ్ఱన రచించాడు. వీటిలో రామాయణం అలభ్యం. రెడ్డి రాజ్య స్థాపకుడైన ప్రోలయ వేమారెడ్డి ఆస్థానంలో ఉండేవాడు. తన రామాయణ, హరివంశాలను వేమారెడ్డికి అంకితం చేసిన ఎఱ్ఱన భారతాన్ని రాజరాజనరేంద్రునికి, నృసింహపురాణాన్ని అహోబిల నృసింహస్వామికి అంకితమివ్వడం గమనార్హం. ఎఱ్ఱన రచనలో వర్ణనలు అధికంగా ఉంటాయి. తదనంతర కాలంలో వర్ణనాత్మకమైన కావ్యాలు రావడానికి ఎఱ్ఱన వర్ణనలే ప్రేరణ. ప్రబంధాల్లోని అష్టాదశ వర్ణనల్లో కొంచెమించుమించుగా అన్ని వర్ణనలూ నృసింహపురాణంలోనూ కనిపిస్తాయి. అందుకే ఎఱ్ఱనను 'ప్రబంధ పరమేశ్వరు' డన్నారు. ఇతడు శివభక్తి ప్రతీతిననుసరించి 'శంభుదాసు'డని పేరు గాంచాడు. 'శంకరస్వామి సంయమీశ్వర చరణోరు హధ్యానంద సౌందర్యధర్యుడ'నని స్వయంగా ప్రకటించుకున్న ఈ కవి గురువు శంకరస్వామి అని తెలుస్తున్నది. ఎఱ్ఱన నృసింహపురాణం ప్రభావం పోతన మీద విశేషంగా ఉన్నదని, పోతన భాగవతం సప్తమ స్కంధంలోని ప్రహ్లాద చరిత్రలో అక్కడక్కడా ఇది కనిపిస్తుందని విమర్శకులు తమ పరిశోధనల ద్వారా నిరూపించారు.







ఆబాలగోపాలానికి ఆత్మీయ బంధువు చందమామ. చందమామ అందించే అమృతం వెన్నెల. అందమైన చందమామను చూపిస్తూ 'చందమామ రావే! జాబిల్లి రావే!' అంటూ కమ్మని పాటను వినిపిస్తూ అమ్మ గోరు ముద్దలు తినిపిస్తుంది.

చిన్న పిల్లలకు వెన్నెల అంటే ఎంతో ఇష్టం. శ్రీరామచంద్రుని అంతటివాడే చందమామ కావాలని పోరుపెట్టాడంటే, అదెంత అపురూపమైందో తెలుస్తున్నది. అటువంటి చందమామ వెలుగు - వెన్నెలను మనకవులు కావ్యాల్లో ఎంతో అద్భుతంగా వర్ణించారు, ఇప్పటికీ వర్ణిస్తూనే ఉన్నారు. అమృత కిరణుడు ఆ అమూల్య సంపదను ఎంతో రమణీయంగా వర్ణించారు నృసింహ పురాణంలో ఎఱ్ఱన. అదేమిటో ఈ పాఠంలో గమనిద్దాం - ఆస్వాదిద్దాం.

## I

చ. ఇను నసమానతేజు దివసేంద్రుఁ గనుంగొనుమాడ్కిc జూడcగాc
జన దొరు నల్పతేజు నను చాడ్పునc జంచలభృంగతారకా
ఘనవనజాతలోచనము గ్రక్కున మీలన మొందc జేసెc బ
ద్మిని పతిభక్తి సత్త్వమునమేలిమికిం గుఱి దానపొమ్మనన్. ॥ 1 ॥

*చ. సురుచిరతారకాకుసుమశోభినభోంగణభూమిc గాలమ
స్గరువపుసూత్రధారి జతనంబున దిక్పతికోటిముందటన్
సరసముగా నటింపcగ నిశాసతి కెత్తిన క్రొత్తతోcపుcబెం
దెర యన నొప్పె సాంధ్యనవదీధితి పశ్చిమదిక్తటంబునన్. ॥ 2 ॥

తే. పొదలి యొండొండ దివియును భువియు దిశలుc
బొదివికొనియుండు చీcకటిప్రోవు వలన
మిక్కుటంబుగc గాటుక గ్రుక్కినట్టి
కరవటంబన జగదండఖండ మమరె. ॥ 3 ॥

### *ఆలోచించండి-చెప్పండి*

- *సూర్యుడు, కమలాలకు మధ్య ఉన్న అనుబంధాన్ని భార్యాభర్తల బంధంతో పోల్చాడుకదా! ఇదే విధంగా ప్రకృతిలోని ఇంకా వేటిని ఈ విధంగా పోల్చవచ్చు?*
- *రెండవ పద్యంలో కవి దేనిని దేనితో పోల్చాడు? ఎందుకు?*
- *"పూర్వదశసతి" అని కవి ఎందుకు వాడాడు?*
- *ఆకాశాన్ని కవి ఏమని వర్ణించాడు? రాత్రి చుక్కలతో కూడిని ఆకాశాన్ని చూస్తే మీకెలా అన్పిస్తుంది?*



## II

సీ. తిమిరభూతమునోకు తెరల జాగ్రత్రయీ
లలనదాల్చినర క్తతిలక మనఁగ
సఖ్యంబునకు నిశాసతి యొసంగినఁ బ్రాచి
ప్రాపించు గురివిందబంతియనఁగఁ
దోయధి వెడఁగ్రుంకి తోఁచుపురందర
కుంభి సిందూరితకుంభమనఁగఁ
గులిశాయుధుని పెద్దకొలువుననె త్తిన
దీపించుమాణిక్యదీపమనఁగఁ

గీ. గుముదినీరాగరసబద్ధగుళికయనఁగఁ
గామినీరంజనౌషధకబళమనఁగఁ
బొడవు పెంపున బింబంబు పొలుపు మిగులఁ
జంద్రుఁ డుదయించెఁ గాంతిని స్తంద్రుఁ డగుచు. ॥ 5 ॥

వ. ఇట్లుదయించి ॥ 6 ॥

*చ. దెసలను కొమ్మ లొయ్య నతిదీర్ఘములైన కరంబులన్ బ్రియం
బెసఁగఁగ నూఁదినిక్కి రజ నీశ్వరుఁడున్నతలీలఁ బేర్చు నా
కసమను పేరి భూరుహము కాంతనిరంతర తారకా లస
త్కుసుమ చయంబు గోయుట కొకోయనఁ బ్రాఁకె సముత్సుకాకృతిన్. ॥ 7 ॥

ఉ. వెన్నెల వెల్లిపాల్కడలి వ్రేఁకదనంబునఁ బేర్చి దిక్కులున్
మిన్నును ముంప రజనీకర బింబము కుండలీభవ
త్పన్నగతల్ప కల్పనముభంగిఁ దనర్చెఁ దదంతరంబునన్
వెన్నునిభంగిఁ జూడ్కులకు వేడ్కమొనర్చెఁ గలంకమత్తఱిన్. ॥ 8 ॥

### ఆలోచించండి - చెప్పండి

- *"చంద్రోదయాన్ని" చూస్తున్నప్పుడు ఎలా అనిపిస్తుంది?*
- *చంద్రబింబాన్ని చూస్తుంటే మీలోకలిగే అనుభవాలు ఏమిటి?*
- *నిండు పున్నమినాడు చంద్రబింబాన్ని చూస్తే ఏమేమి ఉన్నట్లుగా అనుభూతిచెందుతాము?*
- *పౌర్ణమినాటి కలువలను చూస్తుంటే కలిగే ఆనందం ఎలా ఉంటుంది?*
- *'రజనీకర బింబం" అని కవి దేని గురించి అన్నాడు?*





## III

*చ. వడిగొనితేకు లుప్పతిల వాలిక కేసరముల్ దలిర్పఁ బు
ప్పొడి దలమెక్కి తేనియలు పొంగి తరంగలుఁగాఁ జెలంగి పైఁ
బడునెల దేఁటి దాఁటులకుఁ బండువులై నవసౌరభంబు లు
గ్గడువుగ నుల్ల సిల్లె ఘనకైరవషండము నిండువెన్నెలన్. ॥ 9 ॥

సీ. కరఁగెడు నవచంద్రకాంతోపలంబుల
తఱచుసోనలఁ గడు దలముకొనుచుఁ
జటులచకోరసంచయముల యెఱకల
గర్వంపుదాఁటులఁ గడలుకొనుచు
విరియుకైరవముల విపుల రంధ్రములపైఁ
దీవ్రంబుగాఁ గ్రమ్మితిప్పుకొనుచుఁ
గామినీజనముల కమనీయవిభ్రమ
స్మితకాంతిలహరుల మెందుకొనుచుఁ

ఆ॥వె॥ బొదలిపొదలి చదలఁ బొంగారిపొంగారి
మించిమించి దిశలుముంచిముంచి
యభిను తేందు చంద్రికాంభోధియఖిలంబు
నీట నిట్టలముగ నిట్టవొడిచె. ॥ 10 ॥

వ. ఇట్లతిమనోహరగంభీరధీరంబైన సుధాకరకాంతిపూరంబు రాత్రి యను 2వ లైను తలంపు దోఁపనీక తమంబను నామంబును విననీక యవ్యక్తయను శంక 3వ లైను నంకురింపనీక లోచనంబులకు నమృతసేచనంబును, శరీరంబునకుఁ జందనా 4వ పాదం సారంబును, నంతరంగంబునకు నానందతరంగంబును నగుచు విజృంభించిన సమయంబున ॥ 11 ॥

**భావాలు :**

1) అసమానమైన కాంతితో ప్రకాశించే సూర్యుణ్ణి చూసినట్లు తక్కువ కాంతి గల ఇతరులను చూడడానికి ఇష్టపడనన్నట్లు మిణుకు మిణుకు మంటున్న చుక్కలను చూడక గబుక్కున కళ్ళుమూసుకున్నది పద్మము. (అంటే సూర్యాస్తమయం కాగానే పద్మము ముడుచుకున్నది అని అర్థం) పతిభక్తికి తానే ఆదర్శమన్నట్లున్నది ఈ క్రియ.

సూర్యుని కిరణాలతో పద్మాలు విచ్చుకుంటాయి. సూర్యుణ్ణి కమల ప్రియుడు, కమలబాంధవుడు అని అంటారు. కమలాలకు, సూర్యునికి మధ్య గల సంబంధాన్ని భార్యాభర్తల అనుబంధంగా ఎఱ్ఱన చిత్రించాడు.

2) ప్రకాశమానమైన / అందమైన చుక్కల పూలతో అలంకరింపబడిన ఆకాశమనే రంగస్థలం మీద, కాలమనే సూత్రధారి ప్రయత్నం వల్ల దిక్పాలక సమూహం ముందు, నిశాసతి (రాత్రి అనెడి స్త్రీ) సరసంగా నటిస్తూన్నది. ఆ సమయంలో పశ్చిమదిశా తీరంలోని కొత్తకాంతి ఆమెకు అడ్డుగా ఎత్తిన ఒక విధమైన ఎర్రని తెరలాగా అలరారుతున్నది. (పూర్వం నాటక ప్రదర్శనల్లో ముందు సూత్రధారి ప్రవేశించేవాడు. తర్వాత తెరచాటునుండి నటి ప్రవేశించేది. ఆ సంప్రదాయాన్ని కవి ఇక్కడ చక్కగా ఆవిష్కరించాడు.)



3) అధికమైన చీకటి కారణంగా దిక్కులు, ఆకాశము, భూమి ఒక దానిలో ఒకటి కలిసిపోయి, బాగా కాటుక నింపిన బరిణెలాగా విశ్వమంతా నల్లగా కనిపించింది.

4) అంతలో

*5) చీకటి అనే భూతం ఆవహించగా, ముజ్జగాల లలన ధరించిన నెత్తుటి బొట్టులాగా;

స్నేహం కోసం రాత్రి అనెడి స్త్రీ సమర్పించిన తూర్పు దిక్కున గురివింద బంతి లాగా;

సముద్రంలో నుండి వస్తున్న దేవతాస్త్రీ ఎర్రని కుంకుమ కుంభం లాగా;

ఇంద్రుని సభలో వెలిగే మాణిక్య దీపంలాగా; తెల్ల కలువల ప్రేమకు లోబడిన రసమణిలాగా, స్త్రీలకు ఆనందాన్నిచ్చే ఔషధపు ముద్దలాగా, కాంతిమయమైన చంద్రబింబం పెద్దగా మొలిచింది (ఆవిష్కృతం అయ్యింది) (కవి చంద్రోదయాన్ని రసమణితో, ఔషధపు ముద్దలతో పోల్చాడు.)

6) ఈ విధంగా ఉదయించి.....

7) దిక్కులనే కొమ్మలతో, వెలుగులీనే చుక్కలనే పూవులతో పెద్ద చెట్టులాగా కనిపిస్తున్నది ఆకాశం. తన పొడవైన చేతులతో ఆ పూవులను అందుకునేందు కొరకా అన్నట్లు చంద్రుడు విజృంభించాడు.

(చంద్రుని కాంతి ఆకాశమంతా వ్యాపించింది అని అర్థం.)

8) పాలకడలి గర్భం నుండి ఉద్భవించిన వెన్నెల ఉప్పెనలా విజృంభించి దిక్కులన్నీ ముంచెత్తింది. అప్పుడు చంద్రబింబం ఆదిశేషుని పానుపులాగా కనిపిస్తున్నది. అందులోని మచ్చ కన్నులకు విష్ణువులాగా కనిపిస్తూ అలరిస్తున్నది. (కవి భావనా విస్తృతి ఎంత గొప్పగా ఉన్నదో ఈ పద్యం తెలియజేస్తున్నది.)

9) ఆ నిండు వెన్నెలలో కలువపూల సమూహపు రేకులు వేగంగా విచ్చుకున్నాయి. వాడిపోయిన కేసరాలు చిగురించాయి. పుప్పొడి అధికమైంది, తేనెలు పొంగి తరంగాల్లా విజృంభించి, తమపైకి వస్తున్న తుమ్మెదల బృందానికి పండుగ చేశాయి. ఆ నిండు వెన్నెలలో కొత్త పరిమళాలతో పరిసరాలను సంతోషభరితం చేశాయి – కలువలు.

10) ప్రశంసమానుడైన చంద్రుడు తన వెన్నెల వర్షంతో మెత్తని చంద్రకాంత శిలలను కరిగిస్తూ; విహరిస్తున్న చకోర పక్షుల రెక్కలను స్పృశిస్తూ (దాటుతూ); విచ్చుకుంటున్న కలువపూల రంధ్రాలను నిండి, తనవైపు తిప్పుకుంటూ; అందమైన స్త్రీల అద్భుతమైన చిరునవ్వుల తెల్లని కాంతులను అధికం చేస్తూ; అంతకంతకూ అధికమై, పొంగి, పొంగి, దిశలన్నీ ముందచెత్తుతూ, సమస్తాన్నీ ఆ వెన్నెల నీటితో నింపుతూ నిండుగా ఆవిర్భవించాడు.

11) ఈ విధంగా చాలా అందంగా, గంభీరంగా, సమున్నతంగా విస్తరించింది వెన్నెల. అది రాత్రి అనే ఆలోచన రానీయక, చీకటి పేరును విననీయక, కనిపించనిది (అప్పుడప్పుడు వెన్నెల ఉండదు) అనే అనుమానాన్ని తలెత్తనీయక, కళ్ళకు అమృతపు జల్లులా, శరీరానికి మంచిగంధంలా, మనసుకు ఆనంద తరంగంలా విజృంభించింది.

## *ఆలోచించండి–చెప్పండి*

- *వెన్నెలను చూసిన కలువలు ఎలా ప్రతిస్పందించాయి?*
- *చంద్రుడు తన వెన్నెలతో ప్రపంచానికి ఆహ్లాదాన్ని ఎలా కలిగించాడు?*
- *"బాదలిపొదలి చదలఁ బొంగారి పొంగారి మించి మించి దిశలు ముంచి ముంచి" అనే పద్య పాదంలోని పద సౌందర్యం గురించి చెప్పండి.*
- *'మనోహరగంభీర ధీరంబైన సుధాకర కాంతి పూరంబు" దీని భావం ఏమిటి?*





# ఇవి చేయండి

## I. అవగాహన - ప్రతిస్పందన

**1. పాఠంలో వెన్నెలను వర్ణించడం గమనించారు కదా! ప్రకృతిలోని వివిధ సందర్భాలను వర్ణించడం వల్ల మీకు కలిగే అనుభూతులను మిత్రులతో పంచుకోండి. తరగతిలో చర్చించండి.**

**2. మీకు నచ్చిన ఒక సందర్భాన్ని వర్ణించండి.**

**3. ఎఱ్ఱన రాసిన కింది పద్యం చదవండి...**

సీ॥ కలఁడు మేదిని యందుఁ గలఁడుదకంబు లఁ
గలఁడు వాయువునందుఁ గలఁడు వహ్నిఁ
గలఁడు భానుని యందుఁ గలఁడు సోముని యందుఁ
గలఁడంబరంబునఁ గలఁడు దిశలఁ
గలఁడు చరంబులఁ గలఁ డచరంబులఁ
గలఁడు బాహ్యంబున గలఁడులోన
గలఁడు సారంబులఁ గలఁడు కాలంబులఁ
గలఁడు ధర్మంబులఁ గలడు క్రియలఁ

తే॥గీ॥ గలఁడు కలవాని యందును గలడు లేని
వాని యందును గలఁడెల్లవాని యందు
నింక వేయును నేల సర్వేశ్వరుండు
కలఁడు నీయందు నాయందుఁ గలఁడు కలఁడు

(నృసింహపురాణం - పంచమాశ్వాసం - 78)

అ) పై పద్యంలో చాలా సార్లు పునరుక్తమైన పదమేది?

ఆ) అది పలుకుతున్నప్పుడు, వింటున్నప్పుడు మీకు కల్గిన అనుభూతిని చెప్పండి.

ఇ) గీత గీచిన మాటల అర్థాలు తెలుసుకోండి.

**ఇప్పుడు పోతన రాసిన కింది పద్యం చదవండి...**

మ॥ కల'డంబోధిఁ గలండు గాలిఁ గల'డాకాశంబునన్ కుంభినిన్
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలం బ్రద్యోత చంద్రాత్మలన్
గలఁడోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటన్
గలఁడీశుండు గలండు తండ్రి! వెదకంగా నేల నియ్యాయెడన్.

(శ్రీమదాంధ్ర మహాభాగవతం - సప్తమాశ్వాసం - 78)



అ) ఎఱ్ఱన పద్యంలో మీరు గుర్తించిన పదాలకు ఈ పద్యంలో ఉన్న సమానార్థకాలేవి?

ఆ) రెండు పద్యాలను పోల్చి చూడండి.

ఇ) ఎఱ్ఱనను పోతన కొన్ని చోట్ల అనుకరించాడనటాన్ని సమర్థిస్తారా? ఎందుకు?

**4. పువ్వు గుర్తుగల పద్యాలను కంఠస్థం చేయండి. భావస్ఫోరకంగా పద్యాలు పాడండి. (చదవండి / ప్రకటించండి)**

**5. 2వ పద్యానికి ప్రతిపదార్థం ఈ కింద ఉన్నది. ఇదే విధంగా 8, 10 సంఖ్యగల పద్యాలకు ప్రతిపదార్థాలు రాయండి.**

| | | |
|---|---|---|
| సురుచిర | = | అందమైన |
| తారకా | = | చుక్కల |
| కుసుమ | = | పూల (చే) |
| శోభి | = | అలంకరింపబడిన |
| నభః+ | = | ఆకాశమనెడి |
| అంగణభూమిన్ | = | రంగస్థలం (వేదిక) పై |
| కాలము + అన్ | = | కాలం అనే |
| గురువపు | = | శ్రేష్ఠుడైన |
| సూత్రధారి | = | సూత్రధారి (దర్శకుడు) |
| జతనంబున | = | ప్రయత్నపూర్వకంగా |
| దిక్పతికోటి | = | దిక్పాలకుల సమూహం |
| ముందటన్ | = | ముందు (ఎదుట) |
| సరసముగా | = | చక్కగా (యుక్తంగా) |
| నటింపగ | = | నాట్యం చేయడానికి సిద్ధపడిన |
| నిశాసతికి | = | రాత్రి అనెడి స్త్రీకి (అడ్డంగా) |
| ఎత్తిన | = | నిలిపిన (పట్టిన) |
| కొత్త | = | కొత్తదైన |
| తోఁపున్ | = | ఎఱ్ఱని |
| పెన్ + తెర | = | పెద్ద తెర |
| అనన్ | = | అన్నట్లుగా |
| పశ్చిమ దిక్ + తటంబునన్ | = | పడమటి తీరంలోని (పడమటి దిక్కున) |
| సాంధ్య | = | సంధ్య యొక్క |
| నవ దీధితి | = | కొత్త వెలుగు |
| ఒప్పెన్ | = | ప్రకాశించింది |



## II. వ్యక్తీకరణ - సృజనాత్మకత

### 1. లఘు సమాధాన ప్రశ్నలు

అ) "కాటుక గ్రుక్కినట్టి కరవటంబన జగదండఖండమమరె' ఈ మాటలు కవి ఏ సందర్భంలో పేర్కొన్నాడో వివరించండి.

ఆ) ఈ పాఠంలో కవి వెన్నెలను వర్ణించడానికి ఏయే అంశాల నెన్నుకున్నాడో తెల్పండి.

ఇ) పాఠం ఆధారంగా ఆకాశంలోని రంగులు ఏ ఏ సమయంలో ఎట్లా మార్పు చెందాయో తెల్పండి.

### 2. వ్యాసరూప సమాధాన ప్రశ్నలు.

అ) పద్య భావాలను ఆధారంగా చేసుకొని పాఠ్యభాగ సారాంశాన్ని ఇరవై వాక్యాలకు కుదించి రాయండి.

### 3. కింది అంశాల గురించి సృజనాత్మకంగా / ప్రశంసాత్మకంగా రాయండి.

అ) ఈ పాఠంలోని వర్ణనల్లాగే ఏ మీకు నచ్చిన ఒక ప్రకృతి దృశ్యాన్నిగాని, సన్నివేశాన్నిగాని, సమయాన్నిగానీ వర్ణిస్తూ రాయండి. ఉదా: సూర్యోదయం / సూర్యాస్తమయం.

ఆ) పాఠం ఆధారంగా ఎఱ్ఱన రచనాశైలి గురించి 10 వాక్యాలు రాయండి.

## III. భాషాంశాలు

### పదజాలం

### 1. కింది వాక్యాల్లో గీతగీచిన మాటల అర్థాన్ని గ్రహించి, వాటిని అర్థవంతంగా సొంతవాక్యాల్లో ఉపయోగించండి.

అ) చిత్రంలోని భరతమాత మంద<u>స్మితకాంతి</u> అందరినీ ఆకట్టుకున్నది.

ఆ) <u>దివి</u> నుండి భువికి మేఘం రాల్చిన చినుకుపూలే ఈ వర్షం.

ఇ) కష్టాలు <u>మిక్కుటమై</u> రైతులు ప్రభుత్వ సహాయం కోసం ఎదురు చూస్తున్నారు.

ఈ) <u>రజనీకరబింబం</u> రాత్రిని పగలుగా మారుస్తున్నది.

### 2. నిఘంటువు సాయంతో కింది పదాలకు నానార్థాలు వెతికి రాయండి.

అ) కదురు : ____________ ____________ ____________

ఆ) వెల్లి : ____________ ____________ ____________

ఇ) కుండలి : ____________ ____________ ____________

ఈ) నిట్టవొడుచు : ____________ ____________ ____________

ఉ) గడ : ____________ ____________ ____________

### 3. పర్యాయపదాలు రాయండి.

అ) చాడ్పు : ____________ ____________ ____________

ఆ) వెల్లి : ____________ ____________ ____________



ఇ) కైరవం : ____________ ____________ ____________

ఈ) కౌముది : ____________ ____________ ____________

ఉ) చంద్రుడు : ____________ ____________ ____________

ఊ) తమస్సు / తమం : ____________ ____________ ____________

## భాషాంశాలు

**4. ప్రకృతి పదాలకు వికృతి పదాలు రాయండి.**

అ) సంధ్య : ____________ ____________ ____________

ఆ) పశ్చిమం : ____________ ____________ ____________

ఇ) దిశ : ____________ ____________ ____________

ఈ) ధర్మము : ____________ ____________ ____________

ఉ) రాత్రి : ____________ ____________ ____________

ఊ) నిశా : ____________ ____________ ____________

ఋ) బాధ : ____________ ____________ ____________

**5. వికృతి పదాలకు ప్రకృతి పదాలు రాయండి.**

అ) గురువము : ____________ ____________ ____________

ఆ) జతనము : ____________ ____________ ____________

ఇ) దెస : ____________ ____________ ____________

ఈ) తలము : ____________ ____________ ____________

ఉ) చందురుడు : ____________ ____________ ____________

## IV. భాషా కార్యకలాపాలు

♦ నృసింహపురాణం అంటే 'నరసింహ స్వామి కథ'. ఈ నేపథ్యంతో వచ్చిన గ్రంథాలు, వివరాలను ఈ కింది పట్టికలో రాయండి.

| క్ర.సం | గ్రంథం పేరు | ప్రక్రియ | కవి | కాలం |
|---|---|---|---|---|
| | | | | |



## V. వ్యాకరణాంశాలు

### పునశ్చరణ

**1. కింది సంధులకు సంబంధించిన పదాలు ఈ పాఠంలో ఏవి ఉన్నాయో గుర్తించి, వాటిని విడదీసి, లక్షణంతో సమన్వయం చేయండి.**

అ) సవర్ణదీర్ఘ సంధి ______________________

ఆ) గుణ సంధి ______________________

ఇ) ఉత్వ సంధి ______________________

**2. కింది పదాలు విడదీసి, సంధులను గుర్తించి సూత్రాలు రాయండి.**

అ) అత్యంత ______________________

ఆ) వంటాముదము ______________________

ఇ) ఏమనిరి ______________________

ఈ) అవ్విధంబున ______________________

**3. కింది పదాలకు విగ్రహవాక్యాలు రాసి, అవి ఏ సమాసాలో గుర్తించండి. లక్షణాలు పోల్చిచూడండి.**

అ) నలుదెసలు

ఆ) సూర్యచంద్రులు

**4. కింది సందర్భాల్లోని అలంకారాలను గుర్తించండి. కారణాలు రాయండి.**

అ) కుముదినీరాగ రసబద్ధ గుళికయనగఁ...
జంద్రుఁడుదయించెఁ గాంతి నిస్తంద్రుఁడగుచు.

ఆ) పదపడి పూర్వదిశాసతి
వదనంబునఁ దెల్పుమిగిలె వనజాహితు చూ
లుదరంబున ధరియించినఁ
గదిరిన పాండుర కపోత కాంతి విధమునన్.

**5. పాఠంలోని తేటగీతి పద్యం లక్షణాలతో సమన్వయం చేసి చూడండి.**

### పరిచయం

తేటగీతి లక్షణాలు అర్థంచేసుకున్నారు గదా! ఇప్పుడు ఆటవెలది పద్యం గురించి తెలుసుకుందాం.

ఆటవెలదిలోనూ ప్రతిపాదానికి ఐదు గణాలుంటాయి. కాని,

1వ పాదంలో 5 గణాలు (3 సూర్య + 2 ఇంద్ర) }
2వ పాదంలో 5 గణాలు (5 సూర్య) } వేర్వేరుగా ఉంటాయి.



| | న | న | న | త | త |
|---|---|---|---|---|---|
| | I II | I II | I I I | U U I | U U I |
| 1. | పొదలి | పొదలి | చదలఁ | బొంగారి | పొంగారి |

| | హ | హ | న | హ | హ |
|---|---|---|---|---|---|
| | U I | U I | I I I | U I | U I |
| 2. | మించి | మించి | దిశలు | ముంచి | ముంచి |

(* 'హ' గణాన్నే 'గలం' అనడం వాడుకలో ఉన్నది; 'వ' గణాన్ని 'లగం' అన్నట్లు.)

♦ మిగతా యతి, ప్రాస నియమాలు తేటగీతికి సంబంధించినవే దీనికి వర్తిస్తాయి. పరిశీలించండి.

1. ఇది ఉపజాతి పద్యం. దీనికి 4 పాదాలుంటాయి.
2. 1, 3 పాదాల్లో వరుసగా మూడు సూర్యగణాలు, రెండు ఇంద్రగణాల చొప్పున ఉంటాయి.
3. 2, 4 పాదాల్లో ఐదూ సూర్యగణాలే ఉంటాయి.
4. ప్రతిపాదంలో 4వ గణంలోని మొదటి అక్షరం యతి. యతిలేని చోటు ప్రాసయతి చెల్లుతుంది.
5. ప్రాస నియమం పాటించనవసరం లేదు.

* పై పద్యం మిగతా రెండు పాదాలు పరిశీలించి లక్షణ సమన్వయం చేయండి. (వేమన శతకంలోని పద్యాలన్నీ ఆటవెలదులు)











# 2. ధన్యుడు

- పరవస్తు చిన్నయసూరి

## చదవండి - ఆలోచించి చెప్పండి.

*లఘుపతనకుడు మంథరునితో ఇట్లనియె. చెలికాడ! ఈ మూషిక రాజును నీవు మిక్కిలి సమ్మానింపుము. ఇతడు పుణ్యకర్ములలోపల ధురీణుడు, గుణరత్నాకరుడు, హిరణ్యకుడనువాడు. ఈతని గుణములు శేషుడు సహితము వర్ణింపజాలడు. నే నేపాటివాడను - అని పలికి మొదటి నుండి హిరణ్యకుని వృత్తాంతము సర్వము వినిపించెను. అంతట మంథరుడు 'హిరణ్యకుని మిక్కిలి సమ్మానించి యిట్లనియె. "హిరణ్యకా! నీవు నిర్జన వనమునందు వాసము చేయుటకు నిమిత్తమేమి? చెప్పుము" అని యడిగెను.*

*హిరణ్యకుడిట్లనియె.*

**ప్రశ్నలు:**

1. ఇలాంటి భాషతో ఉన్న పాఠాలను చదివారా? లేదా? (ఈ శైలితో ఉన్న మీకు తెలిసిన పుస్తకాల పేర్లు చెప్పండి.)
2. మంథరుడు ఎవరి వృత్తాంతాన్ని వినిపించాడు?
3. హిరణ్యకుని నివాసమెక్కడ?
4. హిరణ్యకుడు తన నివాసం గురించి ఏం చెప్పి ఉంటాడు?

## ఉద్దేశం

మంచిమిత్రుల కలయిక మన జీవితాన్ని ఓ మలుపు తిప్పుతుంది. అందుకే ఎప్పుడూ సన్మిత్రులను పొందాలని పెద్దవాళ్ళు చెబుతుంటారు. మంచి మిత్రుల సాంగత్యం మనకు మేలు చేస్తుందని, సజ్జన సాంగత్యం ఎప్పటికీ మంచిదని చెప్పడమే ఈ పాఠం ఉద్దేశం.

ప్రస్తుతం పాఠ్యాంశం నీతి చంద్రికలోని 'మిత్రలాభం' నుండి స్వీకరించబడినది.



## పాఠ్యభాగ వివరాలు

ఈ పాఠ్యాంశం వచన రచనకు సంబంధించి కథా ప్రక్రియకు చెందింది.

సంస్కృతంలోని విష్ణుశర్మ పంచతంత్రం ఆధారంగా చిన్నయసూరి నీతిచంద్రికను రచించాడు. ఇది గ్రాంథిక వచనంలో సాగుతుంది. పశుపక్ష్యాదులే పాత్రలుగా లోకరీతిని నీతిని ప్రబోధిస్తూ కథనాలు సాగుతాయి.

ప్రస్తుత పాఠ్యాంశం మిత్రలాభం లోనిది.

## విద్యార్థులకు సూచనలు

- పాఠంలోని అర్థంగాని పదాలను పదపట్టిక / నిఘంటువు ద్వారా తెలుసుకోండి.
- పాఠం ప్రారంభించడానికి ముందున్న పేరాను చదవండి. దాని ద్వారా పాఠంలో ఏముందో ఊహించండి.

## కవి పరిచయం



పరవస్తు చిన్నయసూరి 1809లో తమిళనాడులోని చెంగల్‌పట్టు జిల్లాలోని పెరంబూరులో జన్మించారు. మద్రాసులోని పచ్చాయప్పకళాశాలలో తెలుగు పండితులుగా పనిచేసారు.

పద్యానికి నన్నయ, గద్యానికి చిన్నయ అని లోకోక్తి. 'సూరి' అనేది వీరి బిరుదు. సూరి అనగా పండితుడు అని అర్థము.

అక్షరగుచ్ఛము, ఆంధ్ర కాదంబరి, పద్యాంధ్ర వ్యాకరణం, బాలవ్యాకరణం, నీతిచంద్రిక మొదలైన గ్రంథాలు రాశారు. ఈయన రచనాశైలి పాఠకుడిని ఆకట్టుకొనేలా ఉంటుంది. ఈయన రాసిన బాలవ్యాకరణం నేటికీ ప్రామాణిక గ్రంథముగా ఉంది. నీతిచంద్రిక – బాలవ్యాకరణాలు లక్ష్య – లక్షణ గ్రంథాలుగా ప్రసిద్ధి పొందాయి. తెలుగు, తమిళం, సంస్కృతం, ఆంగ్లము భాషలలో సూరి మంచి పండితుడు.







మానవ జీవితంలో నీతి అనేది చాలా ముఖ్యమైన విషయం. ప్రతి మనిషికి సంపాదన ఎంత ముఖ్యమో పరోపకారం కూడా అంతే ముఖ్యం. లాభము అనేది ఉండకూడదు. లోభత్వం వల్ల తనకు కాని, ఇతరులకు కాని ప్రయోజనం ఉండదు. 'పిల్లికి బిచ్చం పెట్టనివాడు' అనే సామెత లోభిని దృష్టిలో వచ్చినదే. మనం మన మిత్రులకు సహాయం లాభం లేకుండా చేయాలి. దీనికి సంబంధించిన కథను చదువుదాం.

## I. హిరణ్యకుని పూర్వ వృత్తాంతము

చంపకవతి యను పట్టణము గలదు. అందు సన్న్యాసులు పెక్కండ్రు వాసము చేయుచుండుదురు. అందుఁ జూడా కర్ణుండను పరివ్రాజకుడు గలడు. అతఁడు తానుభోజనము చేసి మిగిలిన వంటకము భిక్షాపాత్రలోఁబెట్టి చిలుక కొయ్య మీఁదనుంచి నిద్రపోవును. నేను సద్దుచేయక దానిమీదికెగిరి ప్రతిదినమావంటకము భక్షించి పోవుచుండుదును. ఒకనాఁడు చూడాకర్ణుడు తన స్నేహితుఁడు వీణాకర్ణుఁడను సన్న్యాసితో మాటలాడుచుండి మాటిమాటికి మీఁదివంక చూచి తన గిలుకకఱ్ఱతో నేలమీద గొట్టి నన్ను వెఱపించుచు వచ్చెను. అప్పుడు వీణాకర్ణుడు "చూడాకర్ణుఁడా! యేమది మీఁదు చూచి నేల కఱ్ఱతోఁ దట్టుచున్నాఁడ"వని యడుగఁగాఁ జూడాకర్ణుఁడిట్లనియె; "ఒక ఎలుక ప్రతిదినము చిలుకకొయ్య మీది పాత్రమునందున్నయన్నము భక్షించిపోవుచున్నది. నాకు దీని యుపద్రవము పెద్దదిగా నున్న"దియని చెప్పెను. ఆమాటలు వీణాకర్ణుఁడు విని "యెక్కడి యెలుకని యెక్కడి చిలుకకొయ్య? యింత యల్ప జంతువున కింత పొడవున కెగురు బల మెక్కడి నుండి వచ్చెను? దీని కేమయినను నిమిత్తము లేకమానదు."

**ఆలోచించండి - చెప్పండి**

- *ఎక్కడి ఎలుక? ఎక్కడి చిలుకకొయ్య? అనడంలో అంతరార్థం ఏమై ఉంటుంది?*

## II. హిరణ్యకుని దీనస్థితి

అని వీణాకర్ణుఁడు చెప్పఁగా విని చూడాకర్ణుఁడు "తడవులఁబట్టి యీ యెలుక యిక్కడ నొక లాఁగ తావు చేసికొని విడువక వాసము చేయుచున్నది. ఇట్లు వసించుటకు నిమిత్తము తెలిసినది కాదు. త్రవ్వి చూచెదఁగాక" యని చెప్పి యొక గుద్దలితో నేను వసించు వివరము త్రవ్వి చిరకాలోపార్జితమైన నాధనము సర్వము గ్రహించెను. తర్వాత సత్త్వోత్సాహములు లేక నానాఁడాహారము సహితము సంపాదించుకొనఁజాలక దిగులుపడి కృశించి, మెల్ల మెల్లఁగ సంచరించుచుండఁగాఁ జూచి చూడాకర్ణుఁ డిట్లనియె : "ధనము గల వాఁడె బలవంతుడు. ధనముగలవాఁడె పండితుడు. ధనము సర్వ శ్రేయములకు నిదానము, ధనములేనివాని జీవనమేల? ఈ మూషికము తన ధనము కోలుపోయి కదా తొంటి జవసత్త్వములుడిగి స్వజాతి సామ్యమును బొందెను. అర్థపరిహీనునకు నిరంతరము ఖేదము సంభవించును. నిరంతర ఖేదము వలన బుద్ధిహీనత్వము ప్రాప్తించును. బుద్ధిహీనతవలన సమస్తకార్యములు నిదాఘనదీపూరములట్లు వినాశమునొందును, ధనవంతునకే పౌరుషమును, మేధాసంపత్తియు, బంధుమిత్రులును కలుగుదురు.

**ఆలోచించండి - చెప్పండి**

- *ధనము సర్వశ్రేయములకు నిదానము - ఎందుకు?*



పుత్రమిత్రవిరహితుని గృహమును, మూర్ఖుని చిత్తమును శూన్యములు, దారిద్ర్యము సర్వశూన్యము దారిద్ర్యము కంటె మరణము మేలు. మరణ మాపాతయాతనావహము. దారిద్ర్యము యావజ్జీవము తీవ్ర వేదనాకరము. ఇంద్రియముల నామమున బుద్ధిని వచోధోరణిని బురుషుఁడు తొంటివాఁడయ్యు ధనమును బాసిన క్షణముననే లాఁతివాఁడగును. ఇది మహాచిత్రము" అని యాపరివ్రాజకుఁడు చెప్పఁగావిని మిక్కిలి ఖిన్నుఁడనయి యిట్లు చింతించితిని.

ఇఁక నా కిక్కడ వసింపఁదగదు. ఇప్పుడు నా వృత్తాంతము పరులతోఁ జెప్పికోలును యుక్తముగాదు. అర్థనాశము, మనస్తాపము గృహమందలి దుశ్చరితము, వంచనము, పరాభవమును ప్రకాశింపఁ జేయఁదగదని పెద్దలు చెప్పుదురు. దైవానుకూల్యము లేక పౌరుషము చెడినప్పుడు మానవంతునికి వనవాసము కంటె సుఖము లేదు. కుసుమ స్తబకమువలె మానవంతుఁడు సర్వజనుల మూర్ధము మీఁదనయిన నుండవలె. లేదా వనమందు సమసిపోవలె. ఇక్కడనే వాసము చేసుకొని యాచనతో జీవించెదనంటినా దానికంటె గర్హితములేదు. ఒక ముక్కడిని యాచించుకంటె నిప్పులోఁబడి శరీరము తొఱఁగుటమేలు. అనృతమాడుటకంటె మౌనముమేలు. పరధనాపహరణముకంటెఁ దిరియుట మంచిది. వివేకహీనుఁడయిన ప్రభువును సేవించుటకంటె వనవాసముత్తమము. యాచించుకొని బ్రతుకుటకంటె మరణము శ్రేయము, సేవావృత్తి మానమునువలె, యాచనావృత్తి సమస్త గౌరవమును హరించును. ఒకరి యిల్లుకాచి, వారిపెట్టువోఁతలకు దోసిలియొగ్గి యునికియు మిక్కిలి నింద్యము" అని నానావిధముల విచారించియు లోభముత్రిప్పులకు లోనయి మరల నర్థసంగ్రహము చేయవలె నని తలఁచి యచ్చోటనే నిలిచితిని. లోభము మోహమును బుట్టించును. మోహము దుఃఖము నుత్పాదించును, దుఃఖము జ్వలనమువలె స్వాశ్రయమునకు నాశము పుట్టించును కాఁబట్టి లోభమునకు బుద్ధిమంతుఁడు లోపడఁడు. తరువాత నేనక్కడ వదలకుంట చూచి చూడాకర్ణుఁడు నన్నుఁగఱ్ఱతో విసరివ్రేసెను. ఆ వ్రేటు దైవవశము వలనఁ దప్పిపోయినది, తగిలియుండెనా యింతకు యమలోకములో బాఁతకాఁపనయి యుండనా? అనంతర మిట్లు చింతించితిని, ఆహా! ధనలోభము సర్వాపదలకు మూలము గదా! తద్వర్జనముకంటె లోకమందు సుఖమేదియు లేదు. ఆశ దిగనాడినవాఁడే సత్పురుషుడు. వాఁడే సర్వశాస్త్రములు చదివినవాఁడు. వాఁడే సర్వధర్మము లాచరించినవాఁడు. ఉదరముకయి పరులగోఁజక ప్రాప్తలాభమునకు సంతోషించువాఁడొక్కడు లోకమందు ధన్యుఁడు. వాఁడే సుఖి. తత్తత్కర్మానురూపముగా దేహికి దుఃఖములట్లు సుఖములు కోరకయే ప్రాప్తించుచున్నవి. అందులకయి ప్రయాసపాటు నిరర్థకము.

ఈ త్రావు తాతముత్తాతలు సంపాదించిన కాణాచిగాదు. భూమండలములో నింకఁ ద్రావు దొరకదా! ఇక్కడ నుండనేల? ఈ చెడగరపుబోడ కఱ్ఱమోఁదులువడి ప్రాణములు కోలుపోనేల? ఇంక నెక్కడనైన నొక్క విజన ప్రదేశము చేరి కాలముపుచ్చుట మంచిది. శిలాంతరాళమందలి కప్పను భరించు దయామయుఁడయిన యీశ్వరుఁడు నన్నుఁ గాపాడకుండునా? అని చింతించి, మనసు గట్టిపఱచుకొని, యచ్చోటు విడిచి యానిర్జనవనము చేరితిని. వనములోఁ గాయగసురులు భక్షించి పడియనీరు త్రాగి, యొక చెట్టు నీడలో వసించి కాలము పుచ్చుట మంచిదిగాని, ధనహీనుఁడనయి నలుగురిలో నుండరాదు. అనంతరము నాపుణ్యము వలన నా కీమిత్రుఁడు లభించెను. నా మహాభాగ్యము వలననే యిపుడు నీయాశ్రయమను స్వర్గము దొరికినది. సత్సంగతికంటె లోకమందు మేలేదియులేదు. సంసార విష వృక్షమునకు రెండు ఫలము లమృత తుల్యములు; కావ్యామృతరసపాన మొక్కటి సజ్జనసంగతి యొకటి."

**ఆలోచించండి-చెప్పండి**

- *ఆశ దిగనాడినవాడే సత్పురుషుడు. ఎట్లు?*
- *ధనహీనుడై నలుగురిలో నుండరాదు. ఎందుకు?*



# ఇవి చేయండి

## I. అవగాహన - ప్రతిస్పందన

1. చూడాకర్ణుని మాటలను బట్టి మీకర్థమైన విషయమేమి? దానిపై మీ అభిప్రాయమేమిటో చెప్పండి.
2. ఆహా! ధనలోభము సర్వాపదలకు మూలము కదా! ఈ విషయాన్ని సమర్థిస్తూ, వ్యతిరేకిస్తూ చెప్పండి.
3. ఈ పాఠానికి ఉన్న శీర్షిక గురించి విశ్లేషిస్తూ చెప్పండి.
4. కింది వాక్యాలు ఎవరు, ఎవరితో అన్నారో గుర్తించి రాయండి.

   అ) అనృతమాడుట కంటె మౌనము మేలు.

   ఆ) దీనికేమైనను నిమిత్తము లేకమానదు.

   ఇ) సత్సంగతి కంటె లోకమందు మేలేదియు లేదు.

5. కింది పద్యాన్ని చదివి సూచనల ఆధారంగా భావాన్ని రాయండి.

   ఒక్కడె చాలు నిశ్చల బలోన్నతుడెంతటి కార్యమైన దాఁ<br>
   జక్కనొనర్పఁ గౌరవు లసంఖ్యులు పట్టిన ధేనుకోటులం<br>
   జిక్కగ నీక తత్ప్రబలసేన ననేక శిలీముఖంబులన్<br>
   మొక్కవడంగ జేసి తుదముట్టడె యొక్క కిరీటి భాస్కరా!

   **సూచనలు**

   ........................... ఎంతటి పని ఐనా ..................................................... ........................................... ఆవులమందను .................................... తన బాణాలతో ఆ బలమైన .................................................... అర్జునుడే కదా!

6. చూడా కర్ణునికి వీణాకర్ణునికి మధ్య జరిగిన సంభాషణను రాయండి.

## II. వ్యక్తీకరణ - సృజనాత్మకత

1. సంసార విషవృక్షమునకు రెండు ఫలము లమృతతుల్యములు; పాఠాన్ని ఆధారంగా చేసుకొని దీని గురించి వివరించండి.
2. అర్థనాశం, మనస్తాపం, గృహమందలి దుశ్చరితం వంచనం, పరాభవం - ఈ పదాల గురించి మీరేరకంగా అర్థం చేసుకున్నారో సోదాహరణంగా రాయండి.
3. వివేకహీనుడైన ప్రభువును సేవించుట కంటె వనవాసముత్తమం - దీని ఔచిత్యాన్ని గురించి చర్చించండి.



4. ఈ పాఠంలోని కథన విధానాన్ని, రచయిత రచనా విధానాన్ని ప్రశంసిస్తూ ఓ వ్యాసం రాయండి.

5. ఈ కథను ఓ చిన్న నాటికగా మలచండి.

## III. భాషాంశాలు

1. కింది వాక్యములకర్థాన్ని మీ సొంత పదాల్లో రాయండి

   అ) బుద్ధిహీనత వలన సమస్తకార్యములు నిదాఘనదీపూరములట్లు వినాశమునొందును.

   ఆ) ధనమును బాసినక్షణముననే లాతివాడగును.

   ఇ) పరధనాపహరణము కంటె దిరియుట మంచిది.

   ఈ) ఉదరముకయి పరుల గోజక ప్రాప్త లాభమునకు సంతోషించు వాడొక్కడు లోకమందు ధన్యుడు.

2. కింది పదాలకు ప్రకృతి – వికృతులను పాఠం నుండి వెతికి ఆ వాక్యాలను రాయండి.

| | | | |
|---|---|---|---|
| అ) బోనం | ఆ) శబ్దం | ఇ) కర్జం | ఈ) గీము |
| ఉ) గారవం | ఊ) చట్టం | ఋ) దమ్మము | ౠ) సంతసం |

3. కింది వాక్యాలకు వాడే పదాలేవో తెల్పండి? వ్యుత్పత్త్యర్థాలకు తగిన పదాలు రాయండి.

   అ) పున్నామ నరకము నుండి రక్షించువాడు. ______________

   ఆ) దేహాన్ని ధరించినవాడు. ______________

   ఇ) ఐశ్వర్యం కల్గినవాడు. ______________

## IV. భాషా కార్యకలాపాలు

♦ --

## V. వ్యాకరణాంశాలు

### పునశ్చరణ

1. కింది వాక్యాలు చదివి, వాటిలోని సంధి పదాలను గుర్తించి, వాటిని విడదీయండి. అవి ఏ సంధులో సూత్రయుక్తంగా తెల్పండి.

   అ) అందుఁ జూడాకర్ణుడను పరివ్రాజకుడు గలడు.

   ఆ) తడవులఁ బట్టి ఈ ఎలుక విడువక వాసము చేయుచున్నది.

   పై వాక్యాలల్లో <u>సరళాదేశ</u>, <u>గసడదవాదేశ</u>, <u>ఉత్వ</u> సంధులు, <u>యడాగమము</u> ఉండటాన్ని గమనించారు కదా! ఈ పాఠంలో సరళాదేశ, గసడదవాదేశ సంధిపదాలు ఇంకా ఏమేమున్నాయో గుర్తించి, లక్షణాలు సరిచూసుకోండి.





**2. కింది పదాలకు విగ్రహవాక్యాలురాసి, సమాసాలను పేర్కొనండి.**

అ) చంపకవతి పట్టణము

ఆ) మహాభాగ్యము

ఇ) సేవావృత్తి

ఈ) పదాబ్జములు

ఉ) కలువకన్నులు

ఊ) మామిడిగున్న

ఎ) మృదుమధురము

(ఉదా॥ అ) చంపకవతి పట్టణము – చంపకవతి అనే పేరు గల పట్టణం.
సంభావన పూర్వపద కర్మధారయ సమాసం.)

## పరిచయం

**1. 'పుంప్వాదేశసంధి'**

* కింది పదాలు విడదీయండి. మార్పును గమనించండి.

ఉదా॥ అచ్చపు పూలతోట = అచ్చము × పూలతోట

అ) నీలపు గండ్లు =

ఆ) ముత్తెపు సరులు =

ఇ) సరసపుమాట =

* పైన పేర్కొన్న వాటిలో రెండు మార్పులను గమనించవచ్చు.

అ) మొదటిపదాల్లో 'ము' వర్ణం లోపించింది.

ఆ) ప్రతి సంధిలోనూ మొదటిపదం విశేషణాన్ని తెల్పుతుంది.

* మొదటిపదం విశేషణం అయితే ఆ సమాసాలను 'విశేషణ పూర్వపద కర్మధారయ సమాసం' అంటారని మీకు తెలుసు. అంటే ఈ సంధి కర్మధారయ సమాసాల్లో ఏర్పడుతుందని తెలుస్తుంది. అంటే...

* కర్మధారయ సమాసాల్లో మువర్ణానికి బదులు పుంపులు వస్తే దాన్ని పుంప్వాదేశసంధి అంటారు. ('ము' వర్ణం స్థానాన్ని 'పు' వర్ణం ఆక్రమిస్తుంది. దీన్నే వ్యాకరణ దృష్టిలో 'ఆదేశం' అంటారు.)

♦ కింది పదాలను విడదీసి సంధిసూత్రాన్ని సరిచూడండి.

అ) సింగపుకొదమ

ఆ) ముత్యపుచిప్ప

ఇ) కొంచెపునరుడు



## 2. వచనంలో శైలీభేదం

* కింది వాక్యాలు చదవండి. భేదాలు గమనించండి.

అ) అని యా పరివ్రాజకుడు సెప్పగా విని మిక్కిలి ఖిన్నుడనయితిని.

ఆ) అని ఆ సన్యాసి చెప్పగా విని చాలా బాధపడ్డాను.

ఇ) అని ఆ సన్యాసి జెప్పింది యిని శానా దుక్కమొచ్చింది.

* మొదటి వాక్యం ప్రాచీన శైలిని తెలుపుతున్నది.
  రెండవ వాక్యం శిష్టవ్యవహార శైలిని అనుసరించి ఉంది.
  మూడవ వాక్యం మాండలిక పద్ధతికి లోబడి ఉన్నది.

* కాలాన్ననుసరించి, ప్రాంతాన్ననుసరించి, సందర్భాన్ని బట్టి భాషను ఉపయోగించే విధానంలో మార్పు జరుగుతుంది. ఇది భాషలో వైవిధ్యమేగాని, అధికము, అల్పము అనే సంకుచితదృష్టితో చూడకూడదు.

* కింది వాక్యాలను ఆధునిక వ్యవహారశైలిలోకి స్థానిక మాండలిక శైలిలోకి మార్చండి. (ఈ మార్పులు చేసేటప్పుడు 'ము' వర్ణాలు, బిందుపూర్వక 'బు' కారకాలు (ంబు), యడాగమాలు, క్రియారరూపాలు (చేయును, జరుగును, చూడుము... వంటివి) మారడాన్ని గమనించండి.

అ) వివేకహీనుడయిన ప్రభువును సేవించుటకంటె వనవాసముత్తమము.

ఆ) ఎలుక ప్రతిదినము చిలుకకొయ్య మీఁదికెగిరి పాత్రమునందున్న యన్నము భక్షించిపోవుచున్నది.

ఇ) బుద్ధిహీనతవలన సమస్తకార్యములు నిదాఘనదీపూరములట్లు వినాశమునొందును.











# 3. మాతృభావన

*- విద్వాన్ గడియారము వేంకట శేష శాస్త్రి*

## ఉన్ముఖీకరణ

*తే. సర్వతీర్థాంబువులకంటె సమధికంబు*
*పావనంబైన జనయిత్రి పాదజలము*
*వరతనూజున కఖిల దేవతల కంటె*
*జనని యెక్కుడు సన్ను తాచారనిరత*

## ప్రశ్నలు:

1. *"పావనంబైన జనయిత్రి పాదజలము" అంటే ఏమిటి?*
2. *తల్లి పాదజలం దేనికంటే గొప్పదని తెలుసుకొన్నారు? ఎందుకు?*
3. *కుమారునికి అన్నింటికంటే ఏదిమిన్న? ఎందుకు?*
4. *ఈ పద్యం ద్వారా తల్లికిగల స్థానమేమిటని గ్రహించారు?*
5. *"ప్రతి స్త్రీమూర్తి మనకు తల్లితో సమానము" అని ఎందుకంటారు?*

## నేపథ్యం

*మొదటి దండయాత్రలో 'కళ్యాణి' దుర్గం జయించిన తరువాత అప్పాజీసొందేవుడు, భోంసలేశుడు విజయోత్సాహంతో శివాజీ వద్దకు వస్తారు. అప్పుడు సోందేవుడు శివాజీతో "దేవా మీ ఆజ్ఞ ప్రకారం కళ్యాణిని జయించి దాని సర్దారులను పట్టి, బంధించి అతని సర్వస్వాన్నీ, రాణివాసాన్ని బంధీలుగా తెచ్చాను" అని మనవి చేస్తాడు. ఇది విన్న శివాజీ పరస్త్రీలు తల్లులతో సమానం అని చెప్పి, ఆమెకు అగౌరవం కల్గించినందుకు చింతిస్తూ, ఇలా చేయడం తగదని హితవు పలికిన సందర్భంలోనిదీ పాఠ్యాంశం.*



## పాఠ్యభాగ వివరాలు

ఈ పాఠం చారిత్రక కావ్యం ప్రక్రియకు చెందింది. చరిత్ర ఆధారంగా రచించిన కావ్యం చారిత్రకకావ్యం. ఈ పాఠం విద్వాన్ గడియారం వేంకటశేషశాస్త్రి రచించిన 'శ్రీ శివ భారతము' తృతీయాశ్వాసము లోనిది.

## విద్యార్థులకు సూచనలు

- పాఠం ముందున్న పేరా చదవండి. పాఠంలోని విషయాన్ని ఊహించండి.
- పాఠం చదవండి. అర్థంకాని పదాలకింద గీత గీయండి.
- వాటి అర్థాలను పుస్తకం చివర ఉన్న 'పదాలు - అర్థాలు' పట్టికలో చూసి లేదా నిఘంటువులో చూసి తెలుసుకోండి.

## కవి పరిచయం



విద్వాన్ గడియారం వేంకట శేష శాస్త్రి (జననం 1897) (మరణం ) :

కడప మండలం, ప్రొద్దుటూరు మునిసిపల్ హైస్కూలు పండితులు, శతావధాని. రాజశేఖర శతావధానితో కలసి కొన్ని కావ్యనాటకాలు రచించారు. గడియారం వారి పేరు చెప్పగానే "శ్రీ శివభారతము" కావ్యం గుర్తుకు వస్తుంది. పారతంత్ర్యాన్ని నిరసించి స్వాతంత్ర్య కాంక్షను అణువణువునా రగుల్కొల్పినమహాకావ్యం ఇది. 'శ్రీ శివభారతము' తోపాటు గడియారం వారు "మురారి", పుష్పబాణ విలాసము, వాస్తు జంత్రి (అముద్రితాలు), మల్లికామారుతము, శ్రీనాథ కవితా సామ్రాజ్యము, రఘునాథీయము" అనే కావ్యాలు రాసారు. కవితావతంస, కవిసింహ, అవధాని పంచానన అనేవి వీరి బిరుదులు.







జాతి జీవన విధానాన్ని ప్రతిబింబించేది సంస్కృతి. భారతీయ సంస్కృతి స్త్రీలకు గొప్ప స్థానాన్నిచ్చింది. పరస్త్రీలను తల్లులుగా, పరధనాన్ని గడ్డిపరకతో సమానంగా భావించుమని చెప్పింది. అటువంటి ఉదాత్తమైన భావనలను జీవనశైలిగా మలచుకొని పరిపాలన సాగించిన ధీరోదాత్త చక్రవర్తి ఛత్రపతి శివాజీ.

శివాజీ జీవితంలోని ఒక సంఘటన మాతృభావనకు అద్దం పడుతున్నది. దాన్ని గడియారం వేంకటశేషశాస్త్రి కవి తీర్చిదిద్దిన తీరు మరింత ప్రశంసనీయంగా ఉన్నది... సహృదయతకు, మతసామరస్యానికి ప్రతీకగా నిలిచిన ఆ సన్నివేశాన్ని ఈ పాఠంలో చదువుకుందాం...

# I

శా. "ఆ-యేమీ? యొక రాణివాసమును బుణ్యావాసమున్ దెచ్చినా
వా? యేహైందవుఁడైన నీగతి నమర్యాదన్ బ్రవర్తించునే?
మా యాజ్ఞన్ గమనింపవో? జయ మదోన్మాదంబునన్ రేఁగి, నీ
యాయుస్సూత్రము లీవత్రుంచుకొనెదో? యౌద్ధత్య మోర్వన్ జుమీ" ॥ 1 ॥

మ. అనుచున్ జేవురుమోము కన్నుఁగవతో నాస్పంద దోష్ఠంబుతో
ఘన హుంకారముతో నటద్భ్రుకుటితో గర్జిల్లు నా భోన్సలే
శునిఁజూడన్ బయిలోడెఁగొల్వు; శివుఁడీసున్ గుత్తుకన్ మ్రింగి, బో
రన నవ్వారల బంధమూడ్చి గొనితేరన్ బంచె సోన్‌దేవునిన్ ॥ 2 ॥

మ. త్వరితుండైయతఁ డట్టులేసలిపి "దేవా! నన్ను మన్నింపు; మీ
సరదారుల్ గొని తెచ్చుచో సరభసోత్సాహంబు కన్గప్పె; దు
శ్చరితాలోచన లేదు, లేదు భవదాజ్ఞోల్లంఘనోద్వృత్తి; మీ
చరణద్వంద్వములాన" యంచు వినిపించన్, సుంత శాంతించుచున్ ॥ 3 ॥

### ఆలోచించండి-చెప్పండి

- *విజయం గర్వంతో నీవు చేసిన పని సరికాదని అన్న శివాజీ మాటల ద్వారా శివాజీ ఎలాంటివాడని భావిస్తున్నారు?*
- *స్త్రీలపట్ల మర్యాదగా ప్రవర్తించడం అంటే ఏమిటి?*
- *శివాజీ కోపానికి కారణమేమిటి? కోపంలో శివాజీ ఎలా ఉన్నాడు?*
- *"సరభసోత్సాహంబు కన్గప్పె" అంటే మీ కేమర్థమైంది?*



## II

మ. శివరా జంతట మేల్కుసుంగుఁదెరలో – స్నిగ్ధాంబుద చ్ఛాయలో
నవ సౌదామినిఁబోలు నా యవనకాంతా రత్నమున్ భక్తి గౌ
రవముల్ వాఱఁగఁ జూచి పల్కె" వనితారత్నంబు లీ భవ్యహైం
దవభూ జంగమ పుణ్యదేవతలు; మాతా! తప్పు సైరింపుమీ! ॥ 4 ॥

సీ. హరి హర బ్రహ్మలఁ బురిటిబిడ్డలఁ జేసి
జోలఁబాడిన పురంధ్రీలలామ,
యమధర్మరాజుపాశముఁ ద్రుంచి యదలించి
పతిభిక్ష గొన్న పావన చరిత్ర,
ధగధగ ద్దహనమధ్యము పూలరాసిగా
విహరించియున్న సాధ్వీమతల్లి,
పతి నిమిత్తము సూర్యభగవానునుదయంబు
నరికట్టి నిలుపు పుణ్యములపంట,

తే. అట్టి యెందఱో భరతాంబయాఁడుబిడ్డ
లమల పతిదేవతాత్వ భాగ్యములు వోసి
పుట్టినిలు మెట్టినిలుఁ బెంచు పుణ్యసతులు
గలరు, భారతావని భాగ్యకల్పలతలు ॥ 5 ॥

మ. అనలజ్యోతుల నీ పతివ్రతలఁ బాపాచారులై డాయు భూ
జనులెల్లన్ నిజసంపదల్ దొఱఁగి యస్త ధ్వస్తులై పోరె? వి
త్తనమే నిల్చునె? ము న్నెఱుంగమె పులస్త్యబ్రహ్మసంతాన? మో
జననీ! హైందవ భూమి నీపగిది దుశ్చారిత్రముల్ సాగునే? ॥ 6 ॥

***ఆలోచించండి-చెప్పండి***

- *స్త్రీలను ఎవరితో పోల్చారు? ఎందుకు?*
- *స్త్రీల పట్ల సమాజంలో ఎలాంటి అభిప్రాయాలు ఉన్నవి? దీనిపై మీ అభిప్రాయాలు తెల్పండి.*
- *స్త్రీల వల్ల భారత కీర్తి ప్రతిష్ఠలు పెరుగుతాయనడానికి ఉదాహరణలు తెల్పండి.*
- *"అనలజ్యోతుల............ సాగునే?" అనే పద్యం ద్వారా మీకేమర్థమైంది?*



## III

తే. యవన పుణ్యాంగనామణి వగుదుగాక
హైందవులపూజ తల్లియట్లందరాదె?
నీదురూపము నాయందు లేదయైనఁ
గనని తల్లివిగా నిన్ను గారవింతు ॥ 7 ॥

శా. మా సర్దారుఁడు తొందరన్ బడి యసన్మార్గంబునన్ బోయె, నీ
దోసంబున్ గని నొచ్చుకోకు, నినుఁ జేర్తున్ నీగృహం బిప్పుడే,
నా సైన్యంబును దోడుగాఁ బనిచెదన్, నాతల్లిగాఁ దోడుగా
దోసిళ్లన్ నడిపింతు; నీ కనులయందున్ దాల్మి సారింపుమీ!" ॥ 8 ॥

మ. అని కొండాడి, పతివ్రతా హిత సపర్యాధుర్యుఁడాతండు యా
వన కాంతామణి కర్హసత్కృతు లొనర్పన్ జేసి, చేసేతఁ జి
క్కిన సర్దారుని గారవించి హితసూక్తిన్ బల్కి, బీజాపురం
బునకున్ బోవిడె – వారితోఁ దనబలంబుల్ గొన్ని తోడంపుచున్ ॥ 9 ॥

మ. శివరా జంతట సోనదేవుమొగమై "స్త్రీరత్నముల్ పూజ్య, లే
యవమానంబు ఘటింపరా, దిది మదీయాదర్శ మస్మచ్ఛమూ
ధవు లీయాజ్ఞ నవశ్య మోమవలె; నీతాత్పర్యమున్ జూచి, లో
కువ చేకూరమి నెంచి, నీయెడ దొసంగుల్లేమి భావించితిన్ ॥ 10 ॥

**ఆలోచించండి-చెప్పండి**

- *తల్లిగా గౌరవించడం అంటే ఏమిటి? ఆప్రవర్తన ఎలా ఉంటుంది?*
- *సన్మార్గంలో నడవడం అంటే ఏమిటి? విద్యార్థులుగా మీరు చేయాల్సిన కొన్ని పనులను తెల్పండి.*
- *"స్త్రీరత్నముల్ పూజ్య, లేయవమానంబు ఘటింపరా," అంటే ఏమిటి?*
- *"హితసూక్తిన్ బల్కి" అంటే ఏమిటి?*

**సారాంశం :**

1. ఆ..... ఏమిటి? పుణ్యానికి నిలయమైన ఒక రాణివాసాన్ని బంధీగా పట్టి తెచ్చావా? ఏ హైందవుడైనా ఈ విధంగా మర్యాద తప్పి ప్రవర్తిస్తాడా? నా ఆజ్ఞను నీవు గమనించలేదా? విజయం పొందిన గర్వం మత్తులో చెలరేగి నీ ప్రాణానికి నీవే ఆపద తెచ్చుకొంటావా? నీవు చేసిన ఈ పనిని నేను సహించను.

2. అంటూ ఎర్రబడిన కన్నులతో, అదిరిపడే పై పెదవితో, గొప్ప హుంకారముతో, కదలాడే కనుబొమ్మ ముడితో గర్జిస్తూ బోంసలేశుని చూడగా సభంతా నిశ్చేష్టితమైంది. శివాజీ తన కోపాన్నంతా దిగమ్రింగి "వెళ్ళి వారి బంధనాలు తొలగించి ఇక్కడకు తీసుకురండి" అని సోందేవుని పంపించాడు.

3. సోందేవుడు త్వరపడుతూ శివాజీ ఆజ్ఞాపించినట్టు చేసి "దేవా! నన్ను మన్నించండి. ఈ సర్దారులను పట్టి తెచ్చే ఉత్సాహ తీవ్రత నా కళ్ళను కప్పేసింది. అంతేగాని ఇందులో ఎటువంటి చెడు ఆలోచన నాకు లేదు. మీ ఆజ్ఞను మీరి ప్రవర్తించాలనే ఉద్దేశం కూడా లేదు. మీ పాదముల మీద ఒట్టు" అని మనవి చేయగా, శివాజీ కొంత శాంతిస్తూ



4. అంతలోనే మేలు ముసుగు తెరలో దట్టమైన నీలి మేఘం మాటున ఉన్న మెరుపు తీగ లాంటి యవన స్త్రీని భక్తి గౌరవములతో చూస్తూ ఇలా అన్నాడు "స్త్రీలు శుభప్రదమైన ఈ హైందవభూమిపై సంచరించే పుణ్య దేవతలు. అమ్మా ఈ తప్పును మన్నించు."

5. త్రిమూర్తులను (బ్రహ్మ విష్ణు మహేశ్వరుడు) తన ప్రాతివత్యంతో చంటిబిడ్డలుగా చేసి వారికి జోలపాడిన మహనీయురాలు (అనసూయ). యమధర్మరాజు పాశాన్ని ఎదిరించి తన భర్త ప్రాణాన్ని రక్షించుకున్న పావన చరిత్ర (సావిత్రి). భగభగ మండే అగ్ని గుండంలో కూడా పూలరాసిలో తిరిగినట్టు తిరుగాడి బయటకొచ్చిన పతివ్రత (సీత). భర్తకోసం సూర్యభగవానుని ఉదయించకుండా నిలిపిన పుణ్యస్త్రీ (సుమతి). ఇలా ఎందరో భారతీయ స్త్రీలు తమ పాతివ్రత్యంతో పుట్టినింటికీ మెట్టినింటికీ కీర్తిని పెంచిన వారున్నారు. వీరు భారతదేశానికి అదృష్టకల్పలతలు వంటివారు.

6. ఓ తల్లీ! అగ్ని జ్వాలల వంటి పతివ్రతల పట్ల అపచారం చేసేవారు తమ సంపదలు కోల్పోయి నాశనమై పోరా? అసలు వంశం నిలుస్తుందా? పులస్త్య బ్రహ్మ సంతానమైన రావణాసురుని పతనం గురించి మనకు తెలియదా? భారత భూమిపై ఇటువంటి దుశ్చర్యలు సాగుతాయా? సాగవు.

7. నీవు యవన దేశ పుణ్యస్త్రీవి అయితే అగుదువుగాక! హైందవుల పూజను స్వీకరించు. నీ రూపం నాలో లేకపోయినా నన్ను కనని తల్లివి నీవు. నిన్ను నా తల్లిగానే గౌరవిస్తాను.

8. మా సర్దారు తొందర పాటు వల్ల జరిగిన ఈ దోషానికి బాధపడకు. నిన్ను ఇప్పుడే నీ ఇంటికి చేరుస్తాను. నా సైన్యాన్ని తోడుగా పంపిస్తాను. నా తల్లిగా భావించి నిన్ను పంపిస్తాను.

9. అని స్తుతించి పతివ్రతా స్త్రీల మంచిని కోరుకునే శివాజీ యవన స్త్రీకి తగిన సత్కార్యాలు జరిపించి, తన చేతికి చిక్కిన సర్దార్‌ను గౌరవించి వారితో మంచి మాటలు పలికి బీజాపురానికి పంపించాడు. వారికి తోడుగా తన బలగాలను కొన్నింటిని పంపించాడు.

10. తరువాత శివాజీ సోందేవుని వైపు తిరిగి "స్త్రీలు పూజింప తగినవారు. వారికి ఏ అవమానం చేయకూడదు. ఇది నా ఆదర్శం. నా సైన్యాధిపతులందరూ ఈ ఆజ్ఞను తప్పని సరిగా ఆచరించాలి. నీ ఉద్దేశం చూసి, లోకువ చేయకుండా నీ తప్పేమీ లేదని భావించాను.




## I. అవగాహన - ప్రతిస్పందన

### 1. కింది అంశాల గురించి చర్చించండి.

అ) "ప్రస్తుతం స్త్రీలపై జరిగే దాడులకు కారణాలు - నివారణోపాయాలు"

ఆ) "కుటుంబం - సమాజం అభివృద్ధిలో స్త్రీల పాత్ర"



2. * గుర్తుగల పద్యాలకు ప్రతిపదార్థాలు రాయండి.

ఉదా॥ "ఆ-యేమీ? యొక రాణివాసమును బుణ్యావాసమున్ దెచ్చినా
వా? యే హైందవుఁ డైన నీగతినమర్యాదన్ బ్రవర్తించునే
మా యాజ్ఞన్ గమనింపవో? జయ మదోన్మాదంబునన్ రేఁగి, నీ
యాయుస్సూత్రము నీవ త్రుంచుకొనెదో? యౌద్ధత్య మోర్వన్ జుమీ.

**ప్రతిపదార్థాలు:**

| | | |
|---|---|---|
| ఆ – యేమి | = | (ఆశ్చర్యం, కోపం కలిపి) ఆ ఏమిటి? |
| పుణ్య + ఆవాసమున్ | = | పుణ్యమునకు నిలయమైన |
| ఒక | = | ఒక |
| రాణివాసమును | = | రాణీవాసాన్ని |
| తెచ్చినావా | = | బంధీగా తీసుకొచ్చావా? |
| ఏ హైందవుఁడు + ఐననూ | = | హైందవుడు ఎవడైనా |
| ఈ గతిన్ | = | ఈ విధంగా |
| అమర్యాదన్ | = | మర్యాద తప్పి (మర్యాద లేకుండా) |
| ప్రవర్తించును + ఏ | = | ప్రవర్తిస్తాడా? |
| మా + ఆజ్ఞన్ | = | నా యొక్క ఆజ్ఞను |
| గమనింపవు + ఓ | = | గమనించలేదా? (పట్టించుకోలేదా?) |
| జయ | = | (యుద్ధంలో) విజయం పొందిన |
| మద + ఉన్మాదంబునన్ | = | గర్వం మత్తులో |
| రేఁగి | = | అతిశయించి |
| నీ | = | నీయొక్క |
| ఆయుః + సూత్రములు | = | ప్రాణాలనే నూలుపోగులను |
| ఈవ | = | నీవే |
| త్రుంచుకొనెద + ఓ | = | త్రెంచుకుంటావా? |
| ఔద్ధత్యము | = | ఈ తెగింపును (ఏపు) |
| ఓర్వన్ + సుమీ | = | సహించను సుమా! |

3. కింది కవితా భాగాలను చదవండి. ప్రతి కవితలో మీరు గమనించిన ముఖ్య భావనను ఒక వాక్యంలో రాయండి.

అ) ......... అసలు మా అమ్మే నడుస్తున్న వంట గదిలా ఉంటుంది.
ఈ వంటింటి సామ్రాజ్యానికి మా అమ్మే రాణి
అయినా, చివరకు వంటింటి గిన్నెలన్నింటిపైనా మా నాన్న పేరే **– విమల**

**ముఖ్య భావం :** ____________________



ఆ) పెద్ద చదువు

పింగాణి కల

వంటింటి తాలింపు

వీడని వల — యశశ్రీ రంగనాయకి

**ముఖ్య భావం :** ____________________

ఇ) తల్లినైనప్పుడల్లా

పునర్జన్మించా

వాళ్ళేదిగాక

చాలామార్లు మరణించా — డా.పి.జయప్రద

**ముఖ్య భావం :** ____________________

ఈ) ఈ పాఠం కవి గురించి మీరు తెలుసుకున్న విషయాలేమిటి?

"శ్రీ శివభారతం" ప్రశస్తి ఎట్టిది?

**4. పాఠం ఆధారంగా కింది ప్రశ్నలకు జవాబులు రాయండి.**

అ) శివాజీ కొలువులోని వారంతా నిశ్చేష్టులవడానికి కారణం ఏమిటి?

ఆ) సోందేవుడు శివాజీని ఎలా శాంతపరిచాడు?

ఇ) భారతదేశ భాగ్య కల్పలతలని శివాజీ ఎవరిని ఎలా కీర్తించాడు?

ఈ) శివాజీ యవన కాంత పట్ల చూపిన ఆదరాభిమానాలు ఎటువంటివి?

## II. వ్యక్తీకరణ – సృజనాత్మకత

**1. లఘు సమాధాన ప్రశ్నలు**

అ) సోందేవుని మనస్తత్వాన్ని గూర్చి పాఠం ఆధారంగా సొంతమాటల్లో రాయండి.

ఆ) శివాజీ రాజైయుండీ తన వద్దకు బంధీగా తేబడిన యవన కాంతతో

"మాతా! తప్పు సైరింపుమీ!" అన్నాడు దీనిపై మీ అభిప్రాయాలేమిటి?

ఇ) "శివాజీ ఆదర్శం" లోని గొప్పతనాన్ని సొంతమాటల్లో రాయండి.

ఈ) మీ తోటి బాలికలను మీరెలా గౌరవిస్తారు? ఏమేం చేస్తారు?

**2. వ్యాసరూప సమాధాన ప్రశ్నలు.**

అ) మీ పాఠం ఆధారంగా శివాజీ వ్యక్తిత్వాన్ని విశ్లేషించండి.

ఆ) "స్త్రీరత్నములు పూజ్యులు" అన్న శివాజీ మాటలను మీ సొంత అనుభవాల ఆధారంగా సమర్థించండి.



**3. కింది అంశాల గురించి సృజనాత్మకంగా / ప్రశంసాత్మకంగా రాయండి.**

అ) పాఠ్యాంశాన్ని "ఏకాంకిక" రూపంలో రాసి ప్రదర్శించండి.

ఆ) ఈ పాఠం ఆధారంగా స్త్రీల పట్ల మనం ఎలా ప్రవర్తించాలో, మన బాధ్యతలు ఏమిటో తెలిపేలా నినాదాలు / సూక్తులు రాయండి.

## III. భాషాంశాలు

### పదజాలం

**1. కింది పర్యాయ పదాలకు సంబంధించిన పదాన్ని పాఠంలో గుర్తించి గడిలో రాయండి.**

అ) ( ) - ఆదేశము, ఆన, ఉత్తరువు, నిర్దేశము.

ఆ) ( ) - అక్షి, చక్షువు, నేత్రము, నయనము.

ఇ) ( ) - అగ్ని, నిప్పు, వహ్ని, జ్వలనము.

ఈ) ( ) - మగువ, కొమ్మ, ఇంతి, పడతి.

**2. కింది ఆధారాలను బట్టి గళ్ళను పూరించండి.**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ■ | 3 | ■ | 4 | |
| ■ | ■ | | ■ | 5 | | | ■ | ■ |
| 6 | | | | ■ | | ■ | ■ | 7 |
| | ■ | | ■ | 8 | ■ | 9 | | |
| | ■ | ■ | ■ | | ■ | ■ | ■ | |
| 10 | | 11 | | ■ | 12 | 13 | | |
| ■ | ■ | | ■ | 14 | ■ | | ■ | ■ |

**అడ్డం :**

1. సీతకు అగ్నిగుండం కూడా ఇలా ఉంటుంది (4)
4. 'అంబుదం' దీన్నే ఇలా కూడా అంటారు (2)
5. సావిత్రి చరిత్రా విశేషణం (3)
6. పాపం కాదు పుణ్యానికి నిలయం (4)
9. కుడివైపు నుండి సీతకు మరో పేరు (3)
10. కుడివైపు నుండి శివాజీ కోపించిన సేనాని (4)
12. మన పాఠం కవి ఇంటి పేరు (4)
14. పాఠంలో శివాజీ తొలిపలుకు (1)

**నిలువు :**

2. సోందేవుడు దీనిని బంధించాడనే శివాజీ కోపించింది(4)
3. శివాజీ గౌరవించిన కాంత వంశం (3)
6. రావణుని తాత (4)
7. యవన కాంత స్వస్థలం (4)
8. సోందేవుని మదోన్మాదానికి కారణం (2)
11. శివాజీని సోందేవుడు పిలిచినట్టు మీరూ పిలవండి (2)
13. శీర్షాసనం చేసిన త్వరితం, వేగం (2)



**3. కింది ప్రకృతులకు సరైన వికృతులను జతపరచండి.**

| ప్రకృతి | | వికృతి |
|---|---|---|
| అ) రాజ్ఞీ | (   ) | 1) చాయ |
| ఆ) ఆజ్ఞ | (   ) | 2) రతనము |
| ఇ) ఛాయ | (   ) | 3) బత్తి |
| ఈ) రత్నము | (   ) | 4) గారవము |
| ఉ) భక్తి | (   ) | 5) పున్నెం |
| ఊ) గౌరవము | (   ) | 6) బమ్మ |
| ఋ) పుణ్యము | (   ) | 7) జోతి |
| ౠ) బ్రహ్మ | (   ) | 8) రాసి |
| ఎ) భాగ్యము | (   ) | 9) అంబ |
| ఏ) జ్యోతి | (   ) | 10) గీము |
| ఐ) దోషము | (   ) | 11) రాణి |
| ఒ) గృహము | (   ) | 12) ఆన |
| ఓ) రాశి | (   ) | 13) దోసం |
| ఔ) అమ్మ | (   ) | 14) బాగ్గెము |

## IV. భాషా కార్యకలాపాలు

- స్త్రీల అభ్యున్నతికి కృషి చేసిన సంస్కర్తల వివరాలు సేకరించి ప్రదర్శించండి.

(లేదా)

వివిధ రంగాలలో ప్రసిద్ధిగాంచిన స్త్రీల వివరాలను సేకరించి ప్రదర్శించండి.

**విశేషాంశాలు**

పులస్త్యబ్రహ్మ సంతానం : బ్రహ్మ మానసపుత్రుడు పులస్త్యుడు. పులస్త్యుని కుమారుడైన విశ్రవరునికి కైకసి అనే భార్యవల్ల రావణ, కుంభకర్ణ, విభీషణ, శూర్పణఖలు జన్మించారు.

## V. వ్యాకరణాంశాలు

### పునశ్చరణ

**1. కింది పదాలు పరిశీలించండి. వాటిలో సవర్ణదీర్ఘ, గుణ, వృద్ధి సంధులున్నాయి. విడదీసి గుర్తించి, లక్షణాలకు సమన్వయంచేస్తూ చర్చించండి.**

అ) పుణ్యావాసము    ఆ) మదోన్మాదము    ఇ) స్నిగ్ధాంబుధ

ఈ) సరభసోత్సాహం    ఉ) గుణౌద్ధత్యం    ఊ) రసైక స్థితి





2. కింది పదాల్లో ఉత్వ, త్రిక, రుగాగమ, ఉలనల సంధులున్నాయి. పదాలు విడదీసి, లక్షణాలు చర్చించండి.

అ) బంధమూడ్చి　　ఆ) అవ్వారల　　ఇ) భక్తురాలు

ఈ) బాలెంతరాలు　　ఉ) గుణవంతురాలు　　ఊ) దేశాలలో

ఋ) పుస్తకాలు　　ౠ) సమయాన

3. కింది పద్యపాదాల్లోని అలంకారాన్ని గుర్తించండి. లక్షణాలను సరిచూసుకోండి.

అ) అనుచున్ జేవురుమీఱు కన్నుఁగవతో, నాస్పందనోష్ఠంబుతో ఘన హుంకారముతో నటద్భ్రుకుటితో, గర్జిల్లునా భోన్సరే శుఇన జూడన్ ......

4. కింది పద్యపాదాలకు గురులఘువులను గుర్తించి, గణవిభజనచేసి, అవి ఏ పద్యాలకు సంబంధించినవో నిర్ణయించండి. లక్షణాలను చర్చించండి.

అ) ఆ - యేమీ యొకరాణివాసమును బుణ్యావాసమున్ దెచ్చినా

ఆ) అసలజ్యోతుల నీ పతివ్రతలఁ బాపాచారులైదాయు భూ

## పరిచయం

1. * కింది పదాలను విడదీయండి.

అ) వాఙ్మయం

ఆ) రాణ్మహేంద్రవరం

ఇ) జగన్నాథుడు

వాటి విసంధిరూపాలు కింద పేర్కొన్నట్లే ఉన్నాయా? సరిచూసుకోండి. సంధిజరిగిన తీరు గమనించండి.

అ) వాక్ + మయం = వాఙ్మయం = 'క్' స్థానంలో 'ఙ' వచ్చింది.

ఆ) రాట్ + మహేంద్రవరం = రాణ్మహేంద్రవరం = 'ట్' స్థానంలో 'ణ' వచ్చింది.

ఇ) జగత్ + నాథుడు = జగన్నాథుడు = 'త్' స్థానంలో 'న' వచ్చింది.

- పై మూడు సందర్భాల్లో పూర్వస్వరం స్థానంలో వరుసగా క, ట, త ఉన్నాయి.
- వాటికి 'మ' గాని, 'న' గాని పరమయినాయి - అంటే 'పరస్వరం'గా కలిశాయి.
- అప్పుడు పూర్వస్వరం స్థానంలోని 'క' కారం కవర్గ అనునాసికమైన 'ఙ' (క ఖ గ ఘ 'ఙ') గాను; 'ట' కారం దాని అనునాసికమైన 'ణ' (ట, ఠ, డ, ఢ, 'ణ')గాను; 'త'కారం దాని అనునాసికమైన 'న' (త థ ద ధ 'న') గాను మారాయి. దీన్ననుసరించి-
- వర్గప్రథమాక్షరాలకు (క, ట, త లకు) 'న' గాని, 'మ' గాని పరమైనప్పుడు అనునాసికాలు ఆదేశమవుతాయి. దీన్నే అనునాసిక సంధి అంటారు.

* కింది పదాలను విడదీసి, అనునాసిక సంధి సూత్రంతో అన్వయించి చూడండి.

అ) తన్మయము　　ఆ) రాణ్మణి

ఇ) వాఙ్మయము　　ఈ) మరున్మందనుడు



**2. ఉపజాతిపద్యాల్లో తేటగీతి, ఆటవెలది పద్యాల లక్షణాలను తెలుసుకున్నారు కదా! ఇప్పుడు సీసపద్యలక్షణాలను పరిశీలిద్దాం.**

- సీసపద్యంలో ప్రతిపాదం సుదీర్ఘమైంది. ఇది రెండు భాగాలుగా ఉంటుంది. ప్రతిభాగంలో నాల్గసి గణాల చొప్పున ఒక్కొక్క పాదంలో ఎనిమిది గణాలుంటాయి. ఈ 8 గణాల్లో మొదటి ఆరు ఇంద్రగణాలు. చివరి రెండు సూర్యగణాలు. (పాఠం మొదటి భాగంలో 4 ఇంద్రగణాలు, 2వ భాగంలో వరుసగా రెండు ఇంద్రగణాలు, రెండు సూర్యగణాలుంటాయి.)

| | | | | | |
|---|---|---|---|---|---|
| | నగ | భ | నగ | సల | |
| | I I I I | U I I | I I I U | I I U I | |
| ఉదా॥ | హరిహర | బ్రహ్మలఁ | బురిటి బి | డ్డలఁజేసి | – మొదటిభాగం |
| | ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | |

| | | | | |
|---|---|---|---|---|
| ర | నగ | హ | హ | |
| U I U | II I U | U I | U I | |
| జోలఁ బా | డిన పురం | ధ్రీల | లామ | – రెండవభాగం |
| ఇంద్ర | ఇంద్ర | సూర్య | సూర్య | |

} ఒక పాదం

- యతి ప్రతిభాగంలోనూ 3వగణం మొదటి అక్షరంతో సరిపోతుంది. యతిలేని చోట ప్రాసయతి చెల్లుతుంది. పై పాదంలో ప్రాసయతిని గమనించారు కదా! ఈ కింది పాదంలో యతులతో సహా గణ విభజన చేసి లక్ష్య సమన్వయం చేయండి.
    - ధగధగద్ధహన మధ్యము పూలరాసిగా
      విహరించియున్న సాధ్వీమతల్లి.
- సీసపద్యం నాల్గుపాదాల తర్వాత తేటగీతిగాని, ఆటవెలదిగాని తప్పనిసరిగా ఉంటుంది.
- మీ పాఠంలోని 5వ పద్యం సీసం. ఆ పద్యం లక్షణాలను సరిచూడండి.











# 4. జానపదుని జాబు

– డా॥ బోయి భీమన్న

**చదవండి – ఆలోచించి చెప్పండి.**

*ప్రియసఖా!*

*నీ లేఖ అందింది. పట్నం జీవితం ఎలా ఉంటుందో అందులో వర్ణించావు. పల్లెటూరి జీవితాన్ని చిత్రిస్తూ ఉత్తరం రాయమన్నావు. నీది ఉత్తమమైన వాంఛ. ఒకచోట జీవిత విధానంతో మరొకచోటి జీవిత విధానాన్ని నిత్యమూ తెలిసికొంటూ ఉండాలి. మంచి చెడ్డలు, హెచ్చు తగ్గులు, ఏమైనా ఉంటే సరి చేసుకోవాలి. ఈ వాంఛ నాకు కల్గినందుకు అభినందిస్తున్నాను. నీ పట్న జీవితం – నాపల్లెటూరి జీవితంతో పోలిస్తే పరస్పర విరుద్ధంగా ఉంటుంది. నా జీవిత విధానాన్ని గురించి రాయడమంటే పల్లెటూళ్ళ జీవిత విధానాన్ని గురించి రాయడమన్నమాట. పల్లెటూళ్ళు, అక్కడి వాళ్ళ జీవితాలు ఎలా ఉంటాయో నీకు తెలుసా? విద్యుద్దీపాలు, పంఖాలు ఒప్పారుతూ ఉన్న మేడలలో హాయిగా సుఖించే నీకు ఏమి తెలుస్తుంది. నీకు మా గ్రామ జీవితం అర్థం కావాలంటే మా ఇంటికి ఒకసారి రా! ఈ పూరిగుడిసెలో ఒక్కరోజు ఉండు!*

ఇట్లు
నీ మిత్రుడు

**ప్రశ్నలు:**

1. ఉత్తరాన్ని ఎవరు, ఎవరికి రాసి ఉంటారు?
2. దేని గురించి రాసాడు?
3. పై లేఖను చదివారు కదా? మీరు ఏమి గ్రహించారు?
4. పల్లెటూళ్ళ, పట్టణాల జీవితాలు పరస్పర విరుద్ధంగా ఉంటాయని ఎందుకన్నారు?
5. పల్లెటూర్ల గురించి మీకు తెల్సింది చెప్పండి.

## పాఠ్యాంశ ఉద్దేశం / నేపథ్యం

భారతదేశం వ్యవసాయ ప్రధానమైన దేశం. భారతదేశం గ్రామాల్లో నివసిస్తోంది. "గ్రామంలోని ప్రతి ఇల్లు విద్యా గంధంతో గుభాళించి, అభివృద్ధి చెందితేనే మన దేశం సుసంపన్నంగా, సస్యశ్యామలంగా ఉంటుంది" అని మహాత్మాగాంధీ అన్నారు. ఐతే గ్రామాలు ఎలా ఉన్నాయి? వారి జీవితాలు ఎలా ఉంటాయి? అనే విషయాలను వివరిస్తూ, గ్రామాల్లోని దళితులు, పేదల జీవితాలను చిత్రిస్తూ "పల్లెటూరి లేఖలు" అనే పేరుతో 1932లో 'జనవాణి' పత్రికలోనూ, 1933లో 'జానపదుని జాబులు' అనే పేరుతో 'ప్రజామిత్ర'లోనూ ప్రచురించ బడ్డాయి. చదువుకొని, బీదతనంవల్ల చదువు కొనసాగించలేక తన స్వగ్రామం పోయి పల్లెటూరి పనుల్లో మునిగిపోయిన 'జానపదుడు' పట్నంలోని శ్రమంతుడైన తన మిత్రునికి తన అవస్థలను, గ్రామాల్లోని పరిస్థితులను 'లేఖల' రూపంలో రాస్తాడు. వీటిని డా॥ బోయి భీమన్న గారు రాశారు.



## ప్రక్రియ

ప్రస్తుత పాఠ్యాంశం లేఖా రూపంలో ఉంది. "జానపదుని జాబులు" పేరుతో డా॥ బోయి భీమన్న గారు రాసిన లేఖల సంపుటి నుండి పాఠాన్ని ఎంపికచేశారు. తూర్పుగోదావరి జిల్లా యాసలో ఈ లేఖా రచనలో సాగింది.

## విద్యార్థులకు సూచనలు

- పాఠం ముందున్న పేరా చదవండి. పాఠంలోని విషయాన్ని ఊహించండి.
- పాఠం చదవండి. అర్థంకాని పదాల కింద గీత గీయండి.
- వాటి అర్థాలను పుస్తకం చివర ఉన్న 'పదాలు - అర్థాలు' పట్టికలో చూసి లేదా నిఘంటువులో చూసి తెల్సుకోండి.
- పాఠం మధ్యలో ఉన్న ప్రశ్నల గురించి ఆలోచించండి. మీ తరగతిలో చర్చించండి.

## కవి పరిచయం



"ప్రతిభను తలెత్తనివ్వరు పండితులు
పాండిత్యాన్ని తలెత్తనివ్వరు పామరులు

ఈనాడు సాహిత్యమంటే కులం, మతం, వర్గం, ముఠా" అని ధైర్యంగా తన మనస్సులోని మాటను కలం ద్వారా, గళం ద్వారా వెలిబుచ్చిన మహాకవి బోయి భీమన్న. ఒకవైపు జాషువా, మరోవైపు శ్రీశ్రీ సాహిత్య ప్రపంచంలో చక్రవర్తుల్లా వెలుగుతున్న కాలంలో తనదైన శైలితో, వివిధ రకాలపైన సాహితీ ప్రక్రియలతో బడుగుల జీవితాల గురించి, దళితుల జీవితాల గురించి రచనలు చేపట్టిన చైతన్యశీలి బోయి భీమన్న.

బోయి భీమన్నగారు తూర్పుగోదావరి జిల్లా మామిడికుదురు గ్రామంలో 19 సెప్టెంబర్ 1911లో పేద దళిత కుటుంబంలో జన్మించారు. అస్పృశ్యత రాజ్యమేలుతున్న నాటి కాలంలో ఎన్నో వ్యయప్రయాసలకోర్చి విద్యనభ్యసించాడు. మహాత్మాగాంధీ, డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ బోధనలతో ప్రభావితమై అస్పృశ్యతను తన కలం ద్వారా రూపుమాపాలని తలంచిన మేధావి బోయి భీమన్నగారు. స్వాతంత్రోద్యమ సమయంలో క్విట్ ఇండియా ఉద్యమంలో పాలుపంచుకొన్నారు. కొంతకాలం జర్నలిస్టుగా కూడా పనిచేసారు. 1940-45 మధ్యకాలంలో ఉపాధ్యాయవృత్తిని చేపట్టారు.

బోయిభీమన్నగారు గుడిసెలుకాలిపోతున్నాయ్, పాలేరు (నాటిక) ఉశారులు, జానపదుని జాబులు, రాగవైశాఖి, పిల్లిశతకం, ధర్మంకోసం పోరాటం మొదలగు రచనలు చేపట్టారు. ఈయన తన 11వ ఏట నుండే రచనలు చేశారు. ఈయన రాసిన 'పాలేరు' ఎంతో మంది పేదలు, దళిత కుటుంబాలలో వెలుగులు నింపినది. చాలా మంది తల్లిదండ్రులు తమ పిల్లలను పాలేరుతనం మాన్పించి పాఠశాలల్లో చేర్చారు. 'పాలేరు' నాటకం స్ఫూర్తితో విద్యనభ్యసించి ఉన్నత పదవులు అధిష్ఠించిన పేదలు, దళితులు ఎంతో మంది ఉన్నారు. వీరు సుమారు 70కి పైగా రచనలు చేపట్టారు.



*బోయి భీమన్నగారు రాసిన "గుడిసెలు కాలిపోతున్నాయ్" రచనకు 1975లో సాహిత్య అకాడమి అవార్డు లభించింది. భారత ప్రభుత్వం వీరిని 1973లో పద్మశ్రీతోనూ 2001లో పద్మభూషణ్‌తోను సత్కరించింది. ఆంధ్ర విశ్వ విద్యాలయం బోయి భీమన్న గారిని కళాప్రపూర్ణ అనే బిరుదుతో సత్కరించి గౌరవ డాక్టరేటును ప్రదానం చేసింది. వీరు 1978 నుండి 1984 వరకు రాష్ట్ర శాసన మండలి సభ్యునిగా కూడా ఉన్నారు. 1991లో చెన్నైలోని ప్రముఖ సాహితీ సంస్థగా పేరొందిన రాజలక్ష్మి ఫౌండేషన్‌వారు డా॥ బోయి భీమన్న గారికి రాజలక్ష్మి అవార్డును బహుకరించారు. విద్యావేత్తగా, సాహితీవేత్తగా, జర్నలిస్టుగా వివిధ రంగాల్లో పనిచేసి బహుముఖ ప్రజ్ఞను ప్రదర్శించి సమాజ క్షేమం కోసం పాటుపడిన మహామనిషి డా॥ బోయి భీమన్నను అనారోగ్యంతో డిసెంబర్ 16వ తేదీ 2005 సం॥లో పరమపదించారు.*

పంటను కైలుచేసి, ధాన్యం రాసులు పోసి, తమ కడుపులు కాలుతూవున్నా, కన్నీళ్ళు కారుతూ ఉన్నా, ఇనాందారులకు ఫలితం అంతా అప్పగించి వట్టిచేతులు నలుపుకొంటూ ఇండ్లకు పోయి పస్తులు పడే రైతుల దీనగతి ఎవరికి హృదయం కరిగించదు? ఈ మాటలు చెబుతున్నది ఎవరు? ఏ సందర్భంలో చెబుతున్నాడో తెల్సుకోవడానికి పాఠం చదవండి.

## I

**నెచ్చెలీ!**

క్షమిస్తావనే అనుకొంటున్నాను. లేఖ ఆలస్యమైంది. ఆలస్యానికి కారణం లేకపోలేదు. మీ పట్నాల్లోలాగ కాలం కరకట్టుగా నడవదు మా పల్లెల్లో. ఈవేళ నిరుద్యోగం అయితే రేపు తీరిక లేని పని - మళ్ళీ ఆ మరునాడు పని మందం - ఈ విధంగా ఉంటుంది స్థితి. అందుచేత స్థిరంగా ఈ వేళ ఇది చేయాలి - ఆవేళ అది చేయాలి - అని కార్యక్రమం తయారు చేసికొనడానికి ఏమీ అవకాశం ఉండదు.

గ్రామాల్లో సాధారణంగా ఉండే ఈ అస్థిరభావమే నీకు లేఖ వ్రాయుట ఆలస్యం చేయించింది. కాలం చాలా విలువైంది. గ్రామాలు ఈ విలువ గ్రహించడానికి ఇట్టి అస్థిర స్వభావం తొలగాలి.

మొన్ననే నీకు లేఖ రాయాలని అనుకొన్నాను. కాని, ఆ వేళ అంతా పని. ఒక్క క్షణమైనా తీరుబడి అయింది కాదు. ఆ రాత్రి రాయాలని కలమూ, కాగితమూ పట్టుకొని దీపంబుడ్డి దగ్గిర కూర్చున్నాను.

'కిరసనాయిల పొగ కళ్ళలో పడుతోంది. కళ్ళు జబ్బు చేస్తాయి' అని మాయమ్మ అన్నది.

'ప్రొద్దస్తమానమూ పని చేశావు, పడుకోకూడదా!' అన్నాడు మామయ్య.

'అన్నోయ్! ఈ లెక్క చెప్పి పడుకో' అంటూ పలక తీసికొని వచ్చింది మా చెల్లి.



## పరిచయం

### నుగాగమసంధి

**1. కింద పదాలను విడదీయండి. మార్పును గమనించండి.**

అ) చేయునతడు.

ఆ) వచ్చునప్పుడు.

పై పదాలను విడదీస్తే –

అ) చేయు + అతడు

ఆ) వచ్చు + అప్పుడు

- చేయు, వచ్చు పదాలు ఇవి చివర 'ఉత్తు'ను కల్గిఉంటాయి. అందుకే ఉదంతాలు. ఇవి తద్ధర్మార్థక క్రియలు. అంటే ఏ కాలానికైనా వర్తించే క్రియాపదాలు. వీటికి అచ్చు కలిసింది. ('అ'తడు, 'అ'ప్పుడు). అప్పుడు రెండు పదాల్లోనూ లేని 'న్' అనే హల్లుకొత్తగా వచ్చి చేరి చేయు అతడు అనేది చేయు'న'తడు గాను, వచ్చు అప్పుడు వచ్చు 'న'ప్పుడు గానూ మారిపోయింది. ఈ సందర్భాల్లో 'న్' కొత్తగా వచ్చి చేరింది. 'న్' ఆగమం కాబట్టి ఇట్లా ఏర్పడటాన్ని 'నుగాగమ సంధి' అంటారు.

కింది ఉదాహరణలు విడదీసి, లక్షణాలు సరిచూడండి –

1) పోవునట్లు

2) కలుగునప్పుడు

**2. పై సందర్భంలోనే గాక మరికొన్ని చోట్ల 'నుగాగమం' వస్తుంది. కింది పదాలు విడదీసి, పరిశీలించండి.**

అ) తళుకుంగజ్జెలు

ఆ) సింగపుంగొదమ

విడదీస్తే –

అ) తళుకు + గజ్జెలు – తళుకుం గజ్జెలు (తళుకున్)

ఆ) సింగము + కొదమ – సింగపుం గొదమ (సింగపున్)

- పై సందర్భాల్లో ఉత్తు చివరకల్గిన పదాలు స్త్రీ సమమైనవి అంటే స్త్రీలింగవాచక పదాలకు అన్వయించే క్రియలు వీటికి అన్వయిస్తాయి. అటువంటి పదాలకు పరుషాలుగాని, సరళాలుగానీ కలిస్తే నుగాగమం వస్తుంది. కొన్ని చోట్ల పూర్ణ బిందువు కూడా వస్తుంది.

కింది ఉదాహరణలు పరిశీలించి లక్షణ సమన్వయం చేయండి.

1) చిగురుంగయిదువు –

2) సరసపుఁదనము –



**3. ఇంకా కొన్ని సందర్భాల్లోనూ నుగాగమం వస్తుంది.**

కింది పదాలను విడదీసి, పరిశీలించండి.

అ) విధాతృనానతి – (విధాత యొక్క ఆనతి) = విధాతృ + ఆనతి.

ఆ) రాజునాజ్ఞ – (రాజు యొక్క ఆజ్ఞ) = రాజు + ఆజ్ఞ.

♦ విగ్రహవాక్యాలననుసరించి పై సంధి పదాలు షష్ఠీతత్పురుషానికి సంబంధించినవని తెలుస్తున్నది.

- పూర్వస్వరం స్థానంలో 'ఋ'కారం, ఉత్తు ఉన్నాయి. వీటికి అచ్చుపరమైనప్పుడు నుగాగమం వచ్చింది.

అంటే– షష్ఠీతత్పురుషాల్లో ఉత్తుకు, ఋత్వానికి అచ్చుపరమైనప్పుడు నుగాగమం వస్తుంది.











# 7. నగరగీతం

– అలిశెట్టి ప్రభాకర్

## ఉన్ముఖీకరణ

చాటుమాటుగా అర్ధాంగి చేటలో కన్నీళ్లు చెరుగుతున్నప్పుడు
సంసారం బరువెంతో సమీక్షించగలిగినవాణ్ణి
ఆకుపచ్చని చెట్టు, ఆహ్లాదభరితమైన వాతావరణమేమి లేకుండానే
పగలూరాత్రి యాస్బెస్టాస్ రేకులకిందపడి ఎంత వేడెక్కినా
మాడిపోకుండా ఉండగల్గిన మానవాతీతుణ్ణి
నరకప్రాయమైన నగర నాగరికతను నరనరానా
జీర్ణించుకున్నవాణ్ణి
రోజుకో రెండు కవితా వాక్యాల్ని రాయలేనా...
అది మనకు పెన్నుతో పెట్టిన విద్య... అఫ్‌కోర్సు...
కవిత్వం ఎంత నిత్యనూతనంగా వెలికి వచ్చినా
రాసిన ప్రతిది ఆణిముత్యం కాదని అందరికి తెలుసు

– అలిశెట్టి ప్రభాకర్

## ప్రశ్నలు:

1. "చాటుమాటుగా అర్ధాంగి చేటలో కన్నీళ్ళు చెరుగుతున్నప్పుడు" వాక్యం ద్వారా మీరేమి గ్రహించారు?
2. రచయిత నివాసం ఎలా ఉంది?
3. నగర నాగరికతను నరకప్రాయమని రచయిత ఎందుకని ఉంటాడు? దానిపై మీ అభిప్రాయాలు చెప్పండి.
4. పై కవితాత్మక వాక్యాలు చదివారు కదా! రచయిత గురించి మీ కేమి అర్థమైంది?

## పాఠ్యాంశ ఉద్దేశం / నేపథ్యం

ఆధునిక కాలంలో మనుషులంతా నగరాల్లో జీవించాలని కోరుకుంటున్నారు. దీనికి అనేక కారణాలున్నాయి. ఉన్నత విద్య, ఉత్తమ ఉద్యోగవకాశాలు, కార్పోరేట్ వైద్యం, విభిన్న వ్యాపారాలు చేసుకునే సౌకర్యం, ఆధునిక వినోద, విలాస జీవనశైలుల కేంద్రం నగరం. పేద, మధ్యతరగతి, ధనికవర్గ ప్రజలు వారివారి స్థాయిలో బతకడానికి అనువైన పరిస్థితులు ప్రజలను నగరాలవైపు ఆకర్షితులను చేస్తుంది. మరోవైపు పల్లెలో ఉపాధి అవకాశాలు తగ్గడంతో బతుకుతెరువుకోసం నగరాలకు వలసలు పెరిగిపోయాయి. నగరంలోని అనుకూలాంశాలన్నింటిని వినియోగించుకోవాలనే కోరికతో మనుషులు నగరంలో ఉండడానికి తాపత్రయపడిపోతున్నారు. దీనితో అనేక నగరాలు అత్యధిక జనాభాతో కిక్కిరిసిపోతున్నాయి. పలు సమస్యలు పెరిగిపోయాయి. నీటి ఎద్దడి, అధిక ధరలు, కాలుష్యాలు, కొత్త అనారోగ్యాలు, రోడ్డు ప్రమాదాలు, ట్రాఫిక్ జామ్‌లు, విదేశీ సంస్కృతి వెర్రిపోకడలు, ఉగ్రవాదం, శాంతి భద్రతలు నగరపాలనా వ్యవస్థకు సవాళ్ళు విసురుతున్నాయి. ప్రపంచీకరణ ప్రభావంతో నగరం శరవేగంగా తన రూపం మార్చుకుంటుంది. సామాన్యుడికి అందనంత దూరంగా కదిలిపోతుంది నగరం. మధ్యతరగతికి అంతుచిక్కని ప్రాంతంగా మారిపోయింది నగరం. మనిషి యాంత్రిక స్థితిలోకి మారిపోతున్నాడు. తనకుతానే పరాయీకరణకు గురవుతున్నాడు. ఈ నేపథ్యంలో నగరజీవితంలోని యథార్థదృశ్యాల్ని మన కళ్ళ ముందు నిలుపుతూ, నగరపు మరో పార్శ్వాన్ని చూపుతూ, వాస్తవాల్ని కఠినంగా నిర్వచిస్తున్నాడు కవి.



## పాఠ్యభాగ వివరాలు

ఈ పాఠం మినీ కవిత ప్రక్రియకు చెందింది. ఏదైనా ఒక అంశాన్ని కొసమెరుపుతోనో, వ్యంగ్యంతోనో, చురకతోనో తక్కువ పంక్తుల్లో చెప్పడమే మినీ కవిత 'అలిశెట్టి ప్రభాకర్ కవిత' అనే గ్రంథంలోని 'సిటీలైఫ్' మినీ కవితలను 'నగరగీతం' కవితగా కూర్పు చేయడమైంది.

## విద్యార్థులకు సూచనలు

- పాఠం ముందున్న పేరా చదవండి. పాఠంలోని విషయాన్ని ఊహించండి.
- పాఠం చదవండి. అర్థంకాని పదాలకింద గీత గీయండి.
- వాటి అర్థాలను పుస్తకం చివర ఉన్న 'పదాలు - అర్థాలు' పట్టికలో చూసి లేదా నిఘంటువులో చూసి తెల్సుకోండి.

## కవి పరిచయం



కరీంనగర్ జిల్లా జగిత్యాల జన్మస్థలం. 12-01-1954లో జన్మించాడు. మొదట ఆర్టిస్ట్‌గా ఎదిగాడు. ప్రారంభంలో పత్రికలకు పండగలు, ప్రకృతి, సినీనటుల బొమ్మలు వేసేవాడు. తరువాత జగిత్యాలలో సాహితీ మిత్రదీప్తి సంస్థ పరిచయంతో కవిత్వరంగంలోకి ప్రవేశించాడు. 1974లో ఆంధ్రసచిత్ర వారపత్రికలో వచ్చిన 'పరిష్కారం' అచ్చయిన మొదటి కవిత. జగిత్యాలలో 'స్టూడియో పూర్ణిమ' (1976), కరీంనగర్‌లో 'స్టూడియో శిల్పి' (1979) హైదరాబాద్‌లో 'స్టూడియో చిత్రలేఖ' (1983) ఏర్పాటు చేసుకొని జీవిక కోసం ఫోటోగ్రాఫర్‌గా, జీవిత పోరాటంలో కవిగా ఎదిగాడు. ఏనాడూ సంపాదన కోసం ఆరాటపడలేదు. తన కళ ప్రజల కోసమే అని చివరకంటా నమ్మాడు. ఎర్ర పావురాలు (1978) మొదటి కవితా సంకలనం. మంటల జెండాలు, చురకలు (1979), రక్తరేఖ (1985), ఎన్నికల ఎండమావి (1989), సంక్షోభగీతం (1990), సిటీలైఫ్ (1992) అచ్చయిన కవిత్వ సంకలనాలు. ఆంధ్రజ్యోతి దినపత్రికలో ఆరేళ్ళపాటు సీరియల్‌గా "సిటీలైఫ్" పేరుతో హైదరాబాదు నగరంపై రాసిన సినీ కవితలతో ప్రఖ్యాతిపొందాడు. కవిత్వాన్ని ఆయుధంగా మలచుకొని పాఠకుల్లో ప్రగతిని, ఆలోచనాదృక్పథాన్ని, సామాజిక చైతన్యాన్ని పెంపొందించినకవి అలిశెట్టి ప్రభాకర్. శ్రీశ్రీ తర్వాత అంత ఎక్కువగా కోట్ అయిన కవిత్వం వీరిదే!

తండ్రి స్వర్గీయ అలిశెట్టి చినరాజం, తల్లి లక్ష్మి. సహచరిభాగ్య. కుమారులు సంగ్రామ్, సంకేత్‌లతో హైదరాబాద్‌లో నివాసం. అనారోగ్యంతో 12-01-1993 నాడు మరణించాడు.







దృష్టిని బట్టి సృష్టి గోచరిస్తుంది.

కొందరిని కొన్ని సన్నివేశాలు విశేషంగా ఆకర్షిస్తాయి.

సహృదయుడు ప్రతి కదలిక నుండీ ప్రేరణ పొందుతాడు.

అతనికి భాష ఆయుధమైతే, భావం కవితగా రూపం సంతరించుకుంటుంది.

నగరంలోని మూలలను, మూలాలనూ ఓ కవి హృదయం ఎట్లా దర్శించిందో – 'అలిశెట్టి' మినీ కవిత(లు) మన కళ్ళకు గడుతుంది. మనసు కిటికీ తెరిచి చూస్తే అక్షరాల వెనుక అనంత దృశ్యాలు కనిపిస్తాయి...

## I

నగారా మోగిందా
నయాగరా దుమికిందా
నాలుగురోడ్ల కూడలిలో ఏమది?
అదే, నగరారణ్యహోరు
నరుడి జీవనఘోష

తల్లి ఒడివంటి
పల్లెసీమల్నొదిలి
తరలివచ్చిన పేదరైతులూ
ఇనప్పెట్టెల్లాంటి
ఈ పట్టణాల్లో
ఊపిరాడని మీ బతుకులూ

నగరంలో ప్రతిమనిషి
పఠనీయ గ్రంథమే
మరి నీ బతుకు
పేజీలు తిరగేసేదెవరో!

ఉదయమే
బస్సుల్లో రిక్షాల్లో
పేవ్‌మెంట్లపై విరబూసిన
కాన్వెంటు పువ్వుల సందడి
రాలే చదువుల పుప్పొడి!

### ఆలోచించండి–చెప్పండి

- *పల్లెసీమల్ని కవి తల్లిఒడితో ఎందుకు పోల్చాడు?*
- *పట్టణాలను ఇనప్పెట్టెలు అని అనడం కవి ఉద్దేశం ఏమై ఉంటుంది?*
- *"నగరంలో ప్రతి మనిషి పఠనీయ గ్రంథమే" అనే వాక్యం గురించి మీకేమి అర్థమైంది?*
- *""పేవ్‌మెంట్లపై విరబూసిన కాన్వెంటు పువ్వుల సందడి" అని కవి ఎవరి గురించి అన్నాడు? దీని గురించి మీ అభిప్రాయం తెల్పండి.*



## II.

సిటీ అంటే అన్నీ
బ్యూటీ బిల్డింగ్‌లు కావు
అటు భవంతులూ ఇటు పూరిళ్ళూ
దారిద్ర్యం సౌభాగ్యం సమాంతర రేఖలు!
ఇది వెరైటీ సమస్యల మనుష్యుల
సమ్మేళన కోలాహలం!
ఎంతచేసినా ఎవరికీ
తీరిక దక్కదు కోరిక చిక్కదు
మెర్క్యూరీ నవ్వులు, పాదరసం నడకలు
కొందరికి రెండు కాళ్ళు
రిక్షావాళ్ళకి మూడుకాళ్ళు
ఉన్నవాళ్ళకి నాలుక్కాళ్ళు!
నగరంలో అన్నిపక్కలా
సారించాలి మన చూపులు
మహానగరాల రోడ్లకి
మరణం నాలుగువైపులు!
నగరం మహావృక్షంమ్మీద
ఎవరికి వారే ఏకాకి!
నగరం అర్థంకాని రసాయనశాల!
నగరం చిక్కువీడని పద్మవ్యూహం!!

### ఆలోచించండి - చెప్పండి

- *"సిటీ అంటే అన్ని బ్యూటీ బిల్డింగ్‌లు కావు!" ఇది వాస్తవమేనా? ఎందుకు?*
- *రెండు కాళ్ళు, మూడు కాళ్ళు, నాలుగు కాళ్ళు అని కవి అనడంలో ఉద్దేశం ఏమిటి?*
- *"మహానగరాల రోడ్లకి మరణం నాలుగువైపులు" అంటే ఏమిటి?*
- *నగరాన్ని రసాయనశాల అనీ, పద్మవ్యూహం అని కవి అనడంలో ఉద్దేశం ఏమై ఉంటుంది?*

### సారాంశం :

అనేక వాహనాల శబ్దాలు, మనుషుల మాటలు, చిరువ్యాపారుల అరుపులతో నగరంలోని నాలుగు రోడ్ల కూడలిలో వినిపించే రణగొణ ధ్వనులు గుండెలదిరిపోయేలా మోగిస్తున్న ఢంకానాదంలా, ఉధృతమైన వేగంతో దూకే నయాగారా జలపాతం హోరులా అనిపిస్తుంది. నిజానికది అరణ్యంలాంటి నగరం చేస్తున్న ధ్వనిలా, నగరజీవి బతుకుపోరాటంలోంచి వచ్చిన ఉఋములాంటి శబ్దంలా ఉన్నాయని కవి వర్ణిస్తున్నాడు.



అమ్మ బడిలాంటి పుట్టిన ఊరిని వదిలి ఉపాధికోసం నగరం తరలివచ్చిన వారికి ఇంత పెద్ద పట్నంలో తలదాచుకోవడానికి కాసింత స్థలం కూడా దొరకదు. పేదరైతులు ఇనప్పెట్టెల్లాంటి ఇరుకిరుకు మురికి ప్రదేశంలో ఊపిరాడని స్థితిని అనుభవిస్తూ బతుకుతుంటారు.

నగరంలో ప్రతిమనిషి చదవవలసిన ఒక పుస్తకం లాంటివాడు. అయితే ఎవరూ అతని బతుకు పుస్తకములోని పేజీలు చదివేవారే ఉండరు. నగరంలోని మనిషివెనక అనేక ఆసక్తికరమైన ఆనంద, విషాదగాథలుంటాయి. ఒక్కరైనా అతని బాగోగులు పట్టించుకునేవారే ఉండరనే చేదునిజాన్ని చెపుతున్నాడు కవి.

నగరంలో ఉదయాన్నే సిటీబస్సులో, ఆటోల్లో, పేవ్‌మెంట్లపై విరబూసిన పువ్వుల్లాంటి స్కూల్‌పిల్లలు సందడిచేస్తుంటారు. వారి మాటల్లోంచి చదువుల పుప్పొడి రాలుతుంది.

నగరం నిండా అన్నివైపులా అందమైన ఎత్తైన భవనాలు ఉంటాయనుకోవద్దు. ఒకవైపు ఖరీదైన భవంతుల పక్కనే చిన్న చిన్న పూరిపాకలూ ఉంటాయి. ఇక్కడ ఐశ్వర్యం దారిద్ర్యం పక్కపక్కనే సమాంతర గీతలుగా కనిపిస్తాయి. నగరం వైవిధ్యమైన సమస్యలతో, విభిన్న మనస్తత్వాలతో కలసిపోయి కలకలంతో నిండి ఉంటుంది. ఎంత నిరంతరాయంగా పనిచేసినా నగరంలోని మనిషికి విశ్రాంతి తీసుకోవడానికి అనువైన సమయం దొరకదు. సంపాదించిన ధనంతో కోరికను తీర్చుకునే తీరిక దొరకదు. కృత్రిమమైన వెలుగుల్లాంటి అసహజ నవ్వులతో, స్థిరత్వంలేని హడావుడి నడకలతో వెళ్ళేవారు ఆటోరిక్షాల్లో తిరిగేవాళ్ళు, ధనవంతులు కార్లలో ప్రయాణిస్తూ ఉండేవారు ఉంటారు.

నగరంలో నిరంతరం అప్రమత్తంగా ఉండాలి. నగరంలో అన్నివైపులా ప్రమాదాలు పొంచి ఉంటాయి. నగరంలో నాలుగుదిక్కుల్లోని రోడ్లలో మృత్యువు పొంచి ఉంటుందని కవి హెచ్చరిస్తున్నాడు.

వృక్షాల మీద ఉండే పక్షులు పరస్పరం కలిసిపోయి కలివిడిగా ఉంటాయి. నగరమనే మహావృక్షం మీద నివసించే ఈ మనుషులు సాటిమనిషితో ఎటువంటి ఆత్మీయ పలకరింపులు లేకుండా ఇరుగూపొరుగనే భావన లేకుండా ఎవరికి వారే ఏకాకిగా బతుకుతుంటారు. ఈ యాంత్రిక మానసిక స్థితిని నిరసిస్తున్నాడు కవి.

ప్రయోగశాలలో ఏవేవో రసాయన ద్రవాలు, ఆమ్లాలు ఉంటాయి. వాటి చర్యలు అందరికీ అర్థం కావు. నగరం అంతకంటే అర్థంకాని రసాయనశాలలా ఉంటుంది. నగరంలో బతుకుదామని వచ్చినవారు, ఉపాధి దొరకకపోయినా ఏదో ఒకరోజు దొరుకుతుందని ఆశగా వేచిచూస్తూంటారు. ఇక్కడి సౌకర్యాలు, విలాసాలు, వినోదాలు పైపై మెరుగులు బలంగా ఆకర్షిస్తాయి. మరోవైపు నిరుద్యోగం, జీవనవ్యయం భయపెడుతున్నా నగరం విడిచివెళ్ళబుద్ధికాదు. కాలుష్యం కలవరపెట్టినా, ట్రాఫిక్ జామ్‌లో జీవితం ఇరుక్కుపోయినా నగరం విడిచి ప్రశాంతంగా మన పల్లెలకు వెళ్ళనివ్వని, చిక్కువిడదీయలేని పద్మవ్యూహం లాంటిది నగరం.



# ఇవి చేయండి

## I. అవగాహన - ప్రతిస్పందన

### 1. కింది అంశాల గురించి చర్చించండి.

అ) మీరు ఇప్పటివరకు ఏఏ నగరాలను చూశారు? మీరు చూసిన నగరాల్లో మీకు నచ్చిన, నచ్చని అంశాలు ఏమిటి?

ఆ) మీ ఊరి నుండి ఎవరైనా నగరాలకు వలస వెళ్ళారా? ఎందుకు వెళ్ళవలసి వచ్చింది? వాళ్ళు అక్కడ ఏం చేస్తున్నారు?

### 2. పాఠం ఆధారంగా కింది కవితా పంక్తుల్లో దాగిన అంతరార్థాన్ని గుర్తించి రాయండి.

అ) నగరంలో ప్రతి మనిషి పఠనీయ గ్రంథమే.

ఆ) నగరం మహావృక్షంమ్మీద ఎవరికి వారే ఏకాకి.

ఇ) మహానగరాల రోడ్లకి మరణం నాలుగు వైపులు.

### 3. కింది పేరా చదివి ప్రశ్నలకు జవాబులు రాయండి.

కందుర్తి ఆంజనేయులు రచించిన వచన పద్య ఖండిక 'నగరంలో వాన' కవిత్వంలా మొదలై రాజకీయ శాసనంతో అంతం అవుతుంది. అందరూ వాస్తవికత నుంచి వ్యంగ్యాన్ని పుట్టిస్తే, ఇందులో కవి వ్యంగ్యం నుంచి వాస్తవికతను సృష్టిస్తాడు. ప్రబంధకవి అయ్యలరాజు రామభద్రుడు వర్షధార నుంచి కవితాధారను శ్లేషించాడు. అది కేవలం శబ్దగతమైన శ్లేషమాత్రమే. ఇందులో భావసంఘర్షణ నుంచి వెలువడిన వ్యంగ్యం ఘుమాళిస్తుంది. కవి భావుకత వ్యంగ్యధనువును ఎక్కుపెడితే, సంస్కారం వాస్తవికత భాగాన్ని గుండెలకు గురిపెట్టి కొడుతున్నది. ఆ దెబ్బ తప్పదు. అది ఎంత సున్నితంగా తాకుతుందో అంత గాఢంగా ముద్రవేస్తుంది. వచన పద్యం ఎంత సహజమైన ఛందస్సో, ఈ ఖండికలోని రచన కూడా అంత సహజంగా రూపు దిద్దుకొన్నది. కుందుర్తి వాన కురిసింది నగరంలోనే అయినా, ఆ వానలో తడిసింది మాత్రం సామాన్యుడి జీవనమే! ఇందులో వాన కేవలం కేన్వాసుమాత్రమే. దాని ఆధారం చేసుకుని కవి చిత్రించిన వాస్తవిక దృశ్యాలు మనల్ని నిలబెట్టి ఆలోచింపచేస్తాయి.

అ) కవులు సామాన్యంగా వ్యంగ్యాన్ని ఎలా సృష్టిస్తారు?

ఆ) అయ్యలరాజు రామభద్రుడి కవితాధారను విశ్లేషించండి.

ఇ) కుందుర్తి నగరంలో వాన కవితను ఏ ఛందస్సులో రాశారు?

ఇ) నగరంలో వాన కవితలోని ప్రధానాంశం ఏమిటి?

ఈ) కుందుర్తి వాస్తవికత ఎలాంటిది?



### 4. పాఠం ఆధారంగా కింది ప్రశ్నలకు జవాబులు రాయండి.

అ) అలిశెట్టి ప్రభాకర్ కవితాదృక్పథం ఏమిటి?

ఆ) 'నగరగీతం' రాయడానికి గల నేపథ్యాన్ని వివరించండి.

ఇ) నరుడి జీవనఘోష కవికి ఎలా వినిపించింది?

ఈ) నగరంలో దారిద్ర్యం, సౌభాగ్యం ఏ విధంగా కనిపిస్తాయి?

ఉ) అలిశెట్టి ప్రభాకర్ 'సిటీలైఫ్' కవితల ప్రత్యేకత ఏమిటి?

## II. వ్యక్తీకరణ – సృజనాత్మకత

### 1. లఘు సమాధాన ప్రశ్నలు

అ) నగరం అంటే ఏమిటి? పల్లెకు – నగరానికి గల ప్రధాన వ్యత్యాసం తెలపండి.

ఆ) నగరజీవికి తీరిక దక్కదు కోరిక చిక్కదనే పంక్తుల్లోని వాస్తవాన్ని వివరించండి.

ఇ) ఈ పాఠం ఆధారంగా నగరం ఎలా ఉంటే కవికి నచ్చుతుందో తెలపండి.

ఈ) నగర జీవితంలోని ప్రతికూల అంశాల్ని ఇంత కఠినంగా వర్ణించడంలో కవి ఆంతర్యం ఏమిటి?

ఉ) నగరంలో మనిషి జీవన విధానాన్ని పాఠం ఆధారంగా వివరించండి.

ఊ) అందరూ నగరాల్లో జీవించాలని ఎందుకు అనుకుంటున్నారు?

### 2. వ్యాసరూప సమాధాన ప్రశ్నలు.

అ) 'నగరగీతం' సారాంశాన్ని మీ సొంతమాటల్లో రాయండి.

ఆ) నేడు నగరజీవనం ఎందుకు సంక్లిష్టంగా మారిందో విశ్లేషించండి.

ఇ) నగరాన్ని రసాయనశాలగా, పద్మవ్యూహంగా వర్ణించడంలోని నిజానిజాల గురించి చర్చించండి.

### 3. కింది అంశాల గురించి సృజనాత్మకంగా / ప్రశంసాత్మకంగా రాయండి.

అ) నగరగీతం కవితకు మరో పార్శ్వంగా నగర జీవనంలోని అనుకూల అంశాలపై ఒక వ్యాసం రాయండి.

ఆ) ప్రశాంతతకు, పచ్చదనానికి నిలయమైన పల్లెల గొప్పదనాన్ని వర్ణిస్తూ ఒక వచన కవితను రాయండి.

ఇ) ఈ పాఠం ఆధారంగా నీకు తెలిసిన ఒక నగరంతో పోల్చుతూ 'నగరగీతం'లోని వాస్తవికతతో సమన్వయపరుస్తూ పత్రికకు ఒక సాహిత్య విమర్శావ్యాసం రాయండి.

## III. భాషాంశాలు

### పదజాలం

### 1. కింది పదాలకు అర్థాలను 'పదవిజ్ఞానం'లో వెతికి ఆ అర్థంతో సొంతవాక్యాలు రాయండి.

ఉదా॥ కూడలి = నాలుగు రోడ్లు (దారులు) కలిసే చోటు.

నగర కూడలిలో రోడ్డు దాటునప్పుడు జాగ్రత్తగా ఉండాలి.



అ) నగారా ఆ) హోరు ఇ) ఘోష ఈ) పేవ్‌మెంట్ ఉ) మెర్క్యూరీ

2. **కింది పదాలకు పర్యాయపదాలు రాసి వాటితో వాక్యాలు రాయండి.**

ఉదా॥ పల్లె – గ్రామం, ఊరు

పల్లెలే దేశానికి పట్టుకొమ్మలు అని గ్రామ స్వరాజ్యం కోసం గాంధీజీ కలలు కన్నాడు. ఊరి సంక్షేమమే దేశ సౌభాగ్యంగా తలచారు.

అ) నరుడు ఆ) అరణ్యం ఇ) రైతు ఈ) పువ్వు ఉ) మరణం

ఊ) వాంఛ ఎ) వృక్షం

## IV. భాషా కార్యకలాపాలు

- భారతదేశంలోని ప్రధాననగరాల వివరాలు వాటి ప్రత్యేకతలు, జీవన విధానాల వైవిధ్యాన్ని సేకరించి ఒక పట్టికగా రూపొందించి 'భిన్నత్వంలో ఏకత్వాన్ని' నిరూపించేలా ప్రదర్శించండి.

## V. వ్యాకరణాంశాలు

### పునశ్చరణ

1. **అనుప్రాస అలంకారాల్లో అంత్యానుప్రాస గురించి తెలుసుకున్నారు కదా!**

కింది కవితా భాగాల్లో ఆ అలంకారాన్ని గుర్తించండి.

అ) నగారామోగిందా
నయాగరా దుమికిందా

ఆ) రంగదరాతిభంగ; ఖగరాజతురంగ; విపత్పరంపరో
త్తుంగ తమఃపతంగ; పరితోషితరంగ; దయాంతరంగ; స
త్సంగ; ధరాత్మజా హృదయ సారస భృంగ; నిశాచరాబ్జ మా
తంగ; శుభాంగ! ..............

ఇ) కొందరికి రెండు కాళ్ళు
రిక్షావాళ్ళకి మూడు కాళ్ళు
ఉన్నవాళ్ళకి నాలు క్కాళ్ళు

### పరిచయం

* **శబ్దాలంకారాల్లో వృత్త్యానుప్రాస, అంత్యానుప్రాస లాంటివే మరికొన్ని ఉన్నాయి. వాటిని గురించి తెలుసుకుందాం.**

1. **ముక్తపదగ్రస్తము**

కింది కవితా భాగాలు పరిశీలించండి. ప్రత్యేకతను గుర్తించండి.

అ) జనకుడుండెడి యనుష్ఠాన వేదిక జూచు;
చూచి క్రమ్మరబోయి జూడవచ్చు.



ఆ) అదిగదిగో<u>మేడ</u>;

<u>మేడ</u> పక్కన <u>నీడ</u>;

<u>నీడ</u>లో ఉన్నది <u>దూడ</u>;

<u>దూడ</u> వేసింది పేడ.

* పై రెండు కవితల్లోని ప్రత్యేకతను గమినించారు కదా!

ఒక పద్యపాదంగాని, వాక్యంగానీ ఏ పదంతో పూర్తవుతుందో అదే పదంతో తర్వాత పాదం / వాక్యం మొదలవుతున్నది. దీన్నే ముక్తపదగ్రస్త అలంకారం అంటారు.

## 2. యమకము

కింది వాక్యాలు పరిశీలించండి. ప్రత్యేకతను గుర్తించండి.

అ) మన సైనికని<u>కాయము</u> <u>కాయము</u> మరచి పోరాడుతున్నది.

(నాకాయం = బృందం; కాయం = శరీరం)

ఆ) ఆ<u>తోరణం</u> శత్రువుల<u>తోరణా</u>నికి కారణమైంది.

(తోరణం = ద్వారానికి కట్టే అలంకారం; రణం = యుద్ధం)

* పై రెండు సందర్భాలల్లోనూ ఒకే పదం అర్థభూదంతో ప్రయోగించడాన్ని యమకాలంకారం అంటారు.

## 3. లాటానుప్రాస

కింది కవితా భాగాలను / వాక్యాలను చదవండి. ప్రత్యేకతను గమనించండి.

అ) హరిభజియించు <u>హస్తములు</u> <u>హస్తములు</u>... (చేతులే, నిజమైనచేతులు)

ఆ) దీనమానవులకు జేయు <u>సేవ</u> <u>సేవ</u>. (సేవయే నిజమైన సేవ)

* పై రెండు సందర్భాల్లోనూ ఒకే పదం అర్థంలో తేడా లేకున్నా భావంలో తేడా ఉండేటట్లు ప్రయోగించారు. ఈ విధంగా ఒకే పదాన్ని, అర్థం ఒకటే అయినా తాత్పర్యంలో భేదంతో ప్రయోగించడాన్ని లాటానుప్రాసాలంకారం అంటారు.



# 8. ఆనాడు – ఈనాడు

– డా॥ భానుమతి రామక్రిష్ణ

**చదవండి – ఆలోచించి చెప్పండి.**

*1931లో ప్రారంభమయిన తెలుగు చలనచిత్ర పరిశ్రమ నానాటికీ విస్తరిస్తోంది. ఆ సంవత్సరంలో తెలుగు ప్రేక్షకులకు రెండే రెండు చిత్రాలనందించిన మన పరిశ్రమ ఈనాడు సగటున సాలుకు 20 చిత్రాల్ని అందిస్తోంది. నిర్మాణ దృష్ట్యా అభివృద్ధి తృప్తికరంగానే కనిపిస్తోంది. కానీ మానవ ప్రపంచం మీద ప్రభలంగా పనిచేసే ఈ చలనచిత్రాల మీద రెండు రకాల వాదాలున్నాయి. మొదటిది చలనచిత్ర పరిశ్రమ 'కళ' అనీ, రెండోది 'వ్యాపారమనీ'. కళ అని వాదించే ప్రతివారు గమనించాల్సింది కళకు కూడా వ్యాపారం అవసరమేనని. విదేశాల మాట అటుంచి మన దేశంలో అందులో మన రాష్ట్రంలో చిత్రపరిశ్రమ నూటికి నూరుపాళ్ళు వ్యాపారదృష్ట్యానే సాగుతున్నదని చెప్పడం ఏమాత్రం సాహసం కాదు. బాక్సాఫీసు సూత్రాల్ని మనసులో ఉంచుకొని నిర్మాతలు చిత్ర నిర్మాణాన్ని సాగిస్తున్నారు. అందువల్ల చలన చిత్ర నిర్మాణంలో కళాదృష్టి లోపించింది. కళ ఒక సృజనాత్మకమైన శక్తి. దాన్ని వ్యాపారంతో రంగరించడంవల్ల మేలిమి బంగారానికి రాగి కలిపినట్లవుతుంది.*

*– చిత్తూరు వి. నాగయ్య.*

**ప్రశ్నలు:**

1. పై పేరా దేని గురించి చెపుతున్నది? ఎవరి అభిప్రాయాలవి?
2. పై పేరా ద్వారా మీరు గ్రహించిందేమిటి?
3. చలన చిత్రాల గురించి చిత్తూరు నాగయ్య గారి అభిప్రాయాలెలా ఉన్నాయి?
4. చలన చిత్రాల గురించి మీరేమనుకుంటున్నారు?

## పాఠ్యాంశ ఉద్దేశం / నేపథ్యం

ప్రసార మాధ్యమాలలో చలన చిత్రాలు కూడా ఒకటి. "ఏ ప్రచారానికైనా చలన చిత్రాలు ఉత్తమమైన ఆయుధమని" లెనిన్ అన్నాడు. చలనచిత్రాలు ప్రజలమీద ప్రభావం చూపిస్తాయని అనేవారున్నారు. అట్లే ఇవి కేవలం వినోదానికి, ఉల్లాసానికి మాత్రమే సంబంధించినవి అనేవారు కూడా ఉన్నారు. ఈ నేపథ్యంలో స్వర్గీయ డా॥ భానుమతి రామక్రిష్ణ ఆనాడు – ఈనాడు అనే పేరుతో చలన చిత్రాల గురించి, 1955 కంటె ముందు ఉన్న చలనచిత్రాల గురించి, 1960 దశకంలో ఉన్న చలనచిత్రాలను పోలుస్తూ విమర్శనాత్మక వ్యాసం రాసింది. ఈ పాఠం ద్వారా చలన చిత్రాల నిర్మాణంలో నిర్మాతల అభిరుచులు, ప్రేక్షకుల అభిరుచులు ఇతివృత్తాల్లో చోటుచేసుకున్న మార్పుల గురించి సునిశితంగా విమర్శించడాన్ని తెలుసుకోవచ్చు.



## పాఠ్యభాగ వివరాలు

ఈ పాఠం విమర్శనాత్మక వ్యాసము. సమాజంలో చోటు చేసుకుంటున్న వివిధ అంశాల పట్ల ఆయా రంగాలకు చెందిన నిపుణులు, వాటిల్లో చోటు చేసుకుంటున్న పరిణామాలను మంచి, చెడులను, ఫలితాలను విమర్శిస్తూ వ్యాసాలు రాసి ప్రచురిస్తారు. చలనచిత్రాల గురించి భానుమతి రాసిన విమర్శనాత్మక వ్యాసమే ఈ పాఠ్యాంశం.

## విద్యార్థులకు సూచనలు

- పాఠానికి ముందు పేరాలో రాసి ఉన్న అంశాన్ని చదవండి. ఏం గ్రహించారో చెప్పండి?
- పాఠానికి సంబంధించిన చిత్రాలను చూడండి. పాఠంలోని విషయాలను ఊహించండి.
- పాఠం చదవండి. అర్థంకాని పదాలను గుర్తించండి. వాటికి అర్థాలను పదాలు – అర్థాలు పట్టిక నుండి లేదా నిఘంటువు చూసి తెలుసుకోండి.

## కవి పరిచయం



సినిమాలలో ఆడవాళ్ళు నటించడాన్ని అగౌరవంగా భావించే రోజుల్లో భానుమతి రామక్రిష్ణ గారు సినీరంగంలో ప్రవేశించారు. ఆమె తన అభినయంతో, గాత్రంతో లక్షలాది మంది ప్రేక్షకుల గుండెల్లో నిలిచిపోయింది. ఆమె తండ్రి బొమ్మరాజు వెంకట సుబ్బయ్యగారు సంగీత ప్రియుడు. ఆయన తన కూతురును పాటలు పాడేలా ప్రోత్సహించి పదమూడవ యేటనే ప్రముఖ నిర్మాత, దర్శకుడూ అయిన సి.పుల్లయ్యగారి ద్వారా చలన చిత్ర రంగంలో ప్రవేశించేలా ప్రోత్సహించారు. ఆమె నటించిన మొదటి సినిమా 'వరవిక్రయం'. ఆమె సుమారు 100 సినిమాలకుపైగా భారతీయ భాషలకు చెందిన చలనచిత్రాల్లో నటించారు. ఆమె కేవలం నటనకే పరిమితం కాలేదు. తనగాత్రం, పాటలుపాడడం ద్వారా దక్షిణాది ప్రేక్షకులను అలరించారు. స్వర్గసీమ సినిమాలో ఆమె పాడిన 'ఒహో ఒహో పావురమా" అనే పాట నాటి నుండి నేటి వరకు చిరస్థాయిగా నిలిచిపోయింది. పాటలోని పదాలను భావాత్మకంగా పలకడంలో, అందుకనుగుణంగా భావాలను తన నటన ద్వారా ప్రదర్శించడంలో ఆమెకు ఆమెనేసాటి. ఆమె నటించిన మరో సినిమా 'మల్లీశ్వరి' చలనచిత్రసీమకే కలికితురాయి వంటింది.

భానుమతిగారు పాటలు పాడడం, నటనతోపాటు 'చండీరాణి' అనే సినిమాకు దర్శకత్వం కూడా వహించింది. తన భర్త పి.రామక్రిష్ణతో కలసి భరణి చిత్రనిర్మాణసంస్థ నెలకొల్పి చలనచిత్రాలు నిర్మించింది. ఈ సంస్థ నిర్మించిన భక్తధృవ మార్కేండేయ అనే బాలల చలన చిత్రం అందరి ప్రశంసలనందుకున్నది. భానుమతిగారు 1965 నుండి 1975 వరకు బాలల చలనచిత్ర సంస్థ సభ్యురాలిగా కూడా ఉన్నారు. ఆమె నటించిన రెండు తమిళ చిత్రాలకు, తెలుగులో నటించిన 'పల్నాటి యుద్ధం' సినిమా ద్వారా జాతీయ ఉత్తమ నటి అవార్డులను మూడుసార్లు పొందింది.



భానుమతిని తమిళ అభిమానులు అష్టావధానిగా పిలుచుకుంటారు. 1966వ సం॥లో ఈమెను భారతప్రభుత్వం "పద్మశ్రీ" బిరుదుతోను, 2003లో "పద్మభూషన్"తోనూ గౌరవించింది. ఆంధ్రవిశ్వవిద్యాలయం, శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం ఆమెకు గౌరవ డాక్టరేట్లు ప్రధానం చేసాయి.

భానుమతి గారు చలనచిత్రరంగంతో పాటు సాహిత్య రంగంలో కూడా ప్రముఖమైన స్థానాన్ని సంపాదించించారు. కథా రచయిత్రిగా భానుమతిని తెలుగు పాఠకులు అభిమానిస్తారు. రచయిత్రులలో హాస్యం రాసేవారు లేని కొరతను భానుమతిగారు తీర్చారు. ఆమె రాసిన "అత్తగారి కథలు", "భానుమతి కథలు" అన్నీ హాస్యరసంతో తొణికిసలాడేవే. ఆమె తన ఆత్మకథను "నాలో నేను" అనే పేరుతో రాసి ప్రచురించారు. చలనచిత్రరంగం గురించి రాసిన గ్రంథాలకిచ్చే జాతీయ అవార్డును "నాలోనేను" గెలుచుకుంది. అసాధారణ ప్రతిభావంతురాలిగా తెలుగువారు మరిచిపోలేని మనిషి భానుమతి. ఆమె సెప్టెంబరు 7-1925 ప్రకాశం జిల్లా దొడ్డవరం గ్రామంలో జన్మించింది. ఆమె డిసెంబరు 24-2005 సం॥లో మరణించింది.

సామాజికసేవ : భానుమతిగారు సామాజిక సేవాసంస్థలతో పాటు కలిసి పనిచేసేది. "రెడ్‌క్రాస్ సొసైటీ"లో జీవితకాల సభ్యత్వాన్ని పొంది సేవలందించింది. ఆమె తనపేరుమీద "సాలిగ్రామం" చెన్నైలో పాఠశాలను స్థాపించి పేద విద్యార్థులకు విద్యనందించింది.



ఆనాటి నుండి ఈనాటి దాకా వచ్చిన పౌరాణిక చిత్రాలలో లవకుశలాంటి చక్కని చిత్రమూ రాలేదని నా అభిప్రాయం. ఈనాడు లవకుశ కంటే సాంకేతికంగా ఎన్నో రెట్లు అందమైన చిత్రాలూ, గొప్ప చిత్రాలూ రావచ్చు. కాని అన్నీ ఉండి అల్లుని నోట్లో శని అన్నట్లుగా కథా, కమామిషూ అంటూ వచ్చేసరికి ఈ నాటి చిత్రాలు వెనుకటి చిత్రాల ముందు నిలువలేవనే చెప్పాలి. మరి ఈ మాటలు అంటున్నది ఎవరు? ఆమె సినిమాల గురించి తన అభిప్రాయాలను ఏమని చెప్పిందో, పాఠం చదివి తెలుసుకోండి.



## I

ఆనాడు 'కృష్ణలీలలు' తెలుగు చిత్రం రాబోతోందని తొలిసారి విమానంలో నుంచి కరపత్రాలు విసిరేశారు. కట్టలు కట్టలుగా ప్రతివూళ్ళోనూ - నాకప్పటికి బాగా చిన్నతనం - పెద్దవాళ్ళు చెప్పుకుంటూంటే విన్న జ్ఞాపకంతోబాటు నాకూ కలలాగా గుర్తుంది. ఆడపిల్లల బడిలో. అప్పుడే 'అఆ'లు దిద్దడాన్ని ఆరంభించేసిన నేను ఆటవిడుపు సమయంలో, తక్కిన ఆడపిల్లలందరూ బడిచుట్టూ ఉన్న ఆవరణలో ఆడుకుంటూంటే చూచి ఆనందిస్తూ నిలబడ్డాను. గుర్రుమంటూ పెద్దమోతతో మా బడి మీదుగా పోతున్న విమానాన్ని పిల్లలందరం నోరు తెరచుకొని చూశాం. చాలా కిందుగా పోతున్న ఆ విమానంలో నుంచి తెల్లని కాగితాలు పావురాళ్ళలా ఎగుర్తూవచ్చి కొన్ని మా బడి ఆవరణలోనూ, కొన్ని చుట్టుప్రక్కల వీధుల్లోనూ పడ్డాయి. మొదట్లో ఆ కాగితాలేమిటో ఎవరికీ తెలీక ఖంగారుపడ్డారు. అమ్మలక్కల్లో అలజడి బయలుదేరింది.

"ప్లేగోస్తోందమ్మోయ్, జనాన్ని జాగర్తగా ఉండమని చీటీలురాసి దొరలు విమానంలో నుంచి విసిరేశారట్నే?" అన్నది ఒకావిడ.



“అదేం కాదంటమ్మోయ్... కలరా రాబోతోందని మిషనాసుపత్రి పెద్ద డాక్టరు ఉడ్డుదొరగారు మొన్న మా ఆయనతో అన్నాడంట. ఆ సంగతే కాగితాల్లో అచ్చేసి కిరీష్టువాళ్ళు. విమానంలోనుంచి విసిరేశారు” అన్నది మరొకావిడ.

“అదేం కాదర్రా అంటేనూ... మీరనుకునేదంతా ఒట్టిది. కాలజ్ఞానంలో పోతులూరివీరబ్రహ్మంగారు చెప్పనే చెప్పారుగా! ఆకాశంలో ఎగిరే యంత్రాలు వస్తాయనీ, అవి వచ్చినప్పట్నుంచీ, జననష్టం కలుగుతుందనీ – ఆయంత్రాలేమిటనుకున్నారూ! యీ విమానాలే. ‘అసలు విమానం ఏ వూరు’ మీదుగా వెళితే ఆ వూరుకు ఒక నష్టం కలగబోతోందన్నమాటే! మరో మాటే లేదు” అన్నది ఓ బామ్మగారు నిక్కచ్చిగా.

## ఆలోచించండి-చెప్పండి

- కరపత్రాలు గురించి తెలుసా? ఏ ఏ సందర్భాలలో కరపత్రాలు పంచుతారు? ఎందుకు?
- ఆకాశంలో విమానాన్ని చూసినప్పుడు హెలికాప్టర్‌ను మొదటిసారి చూసినప్పుడు మీకెలా అన్పించింది?
- విమానంలో విసిరేసిన కరపత్రాలను చూసి ఒక్కొక్కరూ ఒక్కొక్క విధంగా ఎందుకు భావించారు?
- గతంలో కరపత్రాల ద్వారా సినిమా ప్రచారాన్ని చేపట్టే వారు కదా! మరి ఇప్పుడు ప్రచారాన్ని ఎలా చేస్తున్నారు?
- గతంలో సినిమాహాళ్ళతో పోలిస్తే ఇప్పటి సినిమాహాళ్ళు ఎలా ఉన్నాయి?

విమానంలో నుండి పడ్డ “కృష్ణలీలలు” సినిమా కాగితాలన్నీ పిల్లలందరం, తలా ఒకటి ఏరుకుని “కృష్ణలీలలు సినిమా వస్తోందట” అంటూ సంతోషంతో గంతులు వేయడం చూసిన బామ్మగారు ఆశ్చర్యపడిపోతూ, “ఓరి మీయింట వానగురవ సిలీమా...! ఇంతకూ ఆ విమానంలోంచి వేసింది సిలీమా కాగితాలా! నిశిరాత్రి నీడలు మాట్లాడతాయని కాలజ్ఞానంలో చెప్పినట్లు, యీ సిలీమావాళ్ళు గుండెలు తీసినబంట్లు లాగున్నారే? ...ఏది పిల్లలూ... ఆ కాగితం ఓటిల్లా యివ్వండి” అని మా చేతిలోవున్న “కృష్ణలీలలు” సినిమా కాగితాన్ని అడిగి తీసుకుని తనచత్వారం కండ్లకుపని చెప్పింది బామ్మగారు...

ఆరోజు నుండి “కృష్ణలీలలు” సినిమా ఎప్పుడొస్తుందా అని వూరంతా ఎదురుచూశారు. అప్పట్లో మా వూర్లో ఎక్కువ రోజులాడిన మొదటి తెలుగు చిత్రం “కృష్ణలీలలే” అంటూండేవాళ్ళు. పల్లెటూళ్ళనుండి జనం గుంపులు గుంపులుగా బండ్లు కట్టుకువచ్చి ఒకే చిత్రాన్ని నాలుగయిదుసార్లు చూట్టానికి ఆరంభంచేసింది, ఆనాటి నుండేనని కూడా అంటూ తర్వాత అంతకంటే ఎక్కువ ప్రజాదరణ పొందింది, ఆబాలగోపాలాన్ని ఆకర్షించింది. ‘లవకుశ’ చిత్రం. ఇప్పటికీ మర్చిపోలేను ‘లవకుశ’ చిత్రాన్ని.

నాన్న ఇచ్చిన నాలుగణాలు భద్రంగా దాచుకుని నలుగురు స్నేహితురాండ్లం కలిసి నడిచి వెళ్ళేవాళ్ళం సినిమా దేరాదాకా. ఒక్కొక్కరు బడి నుండి రావడం ఆలశ్యమయితే ఆటమొదలెట్టేస్తారేమోనన్న ఆతృతకొద్దీ, పరికిణీలు పైకెట్టుకుని పరుగులంకించుకుండేవాళ్ళం. బెంచీటిక్కెట్టు కొని లోపలికెళితే, పల్లెటూరివాళ్ళు బెంచీలనిండా నిండిపోయి వుండేవాళ్ళు ములుకర్రలతో సహా. ఇంక వాళ్ళను లేపడం బ్రహ్మతరమా! మాట్లాడకుండా వెళ్ళి నేలమీదనే ఎట్లాగొట్లా సర్దుకునేవాళ్ళం.

తమలపాకుల తిమ్మలూ, సగం కాల్చేసిన చుట్టలూ, సినిమాలో సీతమ్మకష్టాలు చూశ్నేక చీదేసిన బాపతూ అన్నీ మా పరికిణీలు శుభ్రం చేసేవి. అయితే ఏం! ఎక్కడ కూర్చున్నది మర్చిపోయి తన్మయులమయి చూసేవాళ్ళం. ఆనాడు లవకుశ చిత్రాన్ని చూడడం నాకిప్పటికీ జ్ఞాపకముంది, ఒకటికి పదిసార్లు చూసే బస్తీజనంతో బాటు పల్లెటూళ్ళ నుండి కూడా, లవకుశ చూట్టానికి జనం విపరీతంగా విరగబడుతూంటే – హాల్లో చోటు చాలక, తెరకు వెనకవైపునున్న ఖాళీస్థలంలో కూడా జనాన్ని కూర్చోబెట్టి, తెరకు రెండువైపులా లవకుశ చిత్రాన్ని చూపించారు. ఆనాడు అదొక వింతగా చూశాం. అజ్ఞానంలోనే సుఖం వుందన్నట్టు, ఆనాడు సినిమాలంటే ఏమిటో సినిమా ‘టెక్నిక్’ అంటే ఏమిటో ఎవరికీ తెలీదుగనుక,



సినిమా చూస్తున్నంత సేపూ యేదో పురాణం వింటున్నట్టూ, హరికథాకాలక్షేపం చేసినట్టూ ఎంతో శ్రద్ధాభక్తులతో చూసి ఆనందించేవారు ఆనాటి అమాయక ప్రజలు. అసలు ఆనాటి నుండి ఈనాటి దాకా వచ్చిన పౌరాణిక చిత్రాలలో లవకుశ లాంటి చక్కని చిత్రమూరాలేదనే నా అభిప్రాయం.

ఈనాడు లవకుశ కంటే టెక్నికల్‌గా ఎన్నో రెట్లు అందమయిన చిత్రాలూ, గొప్ప చిత్రాలూ రావచ్చు. కాని అన్నీ ఉండి అల్లునినోట్లో శని అన్నట్లుగా కథా, కమామిషూ అంటూ, వచ్చేసరికి ఈనాటి చిత్రాలు వెనకటి చిత్రాలముందు నిలువలేవనే చెప్పాలి.

**ఒక్క చిత్రానికి ఒక్కటే కథా**

ఆనాడు నిర్మాతలు కేవలం ప్రజలను మోసంచేసే ఉద్దేశ్యముతో చిత్రాలు నిర్మించలేదు. ఒక కథ తీసుకుని, దాన్ని ఏవిధమయిన అపభ్రంశం పట్టించకుండా ప్రజలకు సులభముగా అర్థమయ్యేటట్లు, అరటిపండు వల్చిచేతికందించినట్లు దిద్ది ఒక్కొక్క చిత్రాన్ని ప్రజలకందించారానాటి నిర్మాతలు. ఈనాడు యిరవై కథలు కలిపి ఒక మహాగాథగా తయారుచేస్తున్నారు. అసలు కథ ఏమిటో మానవ మాత్రుడికి అర్థం కాకుండా అందంగా లేని అడవి అధికంగా అలంకారం చేసుకున్నట్లు, కథలేని ఆ గాథను హంగుల హడావిడితో భారీయెత్తున చిత్రంగా నిర్మించి, 'శాటిలైట్'ను వదిలినట్లు తమ చిత్రాల్ని ప్రజలమీద వదలి, ప్రజలను గాభరాపెట్టి, హడలగొట్టి, బెదిరించి, మాయచేసి, మత్తుమందుచల్లి, డబ్బుగుంజుతున్నారా అనిపిస్తోంది. ఈనాడు తయారయ్యే కొన్ని అర్థం లేని చిత్రాలను చూస్తుంటే–

"అసలీ నాడు ఒక కథను చిత్రంగా నిర్మిస్తున్నారంటే కొందరు నవ్వుతున్నారు."

**కీలకం**

"ఒక కథ ఎవరి ముక్కుకు చాల్తుందండి అసలు యీనాడు ప్రజల్ని ఒక కథతో తృప్తిపరచగలమా... ఈ మధ్య ఫలానా ఫలానా చిత్రాలకు డబ్బొచ్చిందంటే ఒక కథతీస్తే వచ్చిందనుకొన్నారా అబ్బే – ఇరవై ముప్పయి కథల్లోని ఘాటైన సన్నివేశాలు తీసుకొని, నవరసాల్లోనూ నానేసి, మంచి హిందీట్యూన్స్ కొన్ని మిళాయించి, హాలీవుడ్, 'ఎఫెక్ట్స్'లో కొన్ని 'డ్రీమ్‌సీన్స్' జోడించితీస్తేనే ప్రజలు కాస్త ఖంగారుపడుతూ చూస్తారు. ఎకో నారాయణా అంటూ ఒక కథతీస్తే, దానిలోవుండే లోపాలు ప్రజలుయిట్టేకనిపెట్టేసి విమర్శిస్తున్నారు. అదే ఇరవై ముప్పయి కథలు కలిపి తీశారనుకోండి! ఏదని విమర్శిస్తారు! చచ్చినట్లు చూస్తారు. ఈ కాలంలో కథా కాకరకాయా ఎవరిక్కావాలండీ! ఈ నా ప్రజలకు కావలసింది 'ఎంటర్‌టెయిన్‌మెంట్' – అంతే... అంటూ, మొన్న ఎవరో ఒక మహానుభావుడు చెపుతున్నాడు.

ఈనాడు యిరవై ఐదువారాలు పోయిన చిత్రాన్ని ఇరవైసార్లు చూసిన పెద్దమనిషిని "ఏం చూశావు నాయనా!" అని అడిగితే "అదేనండీ ఆలోచిస్తున్నాను' అంటున్నాడు. "కథేమిటి" అంటే కథమాత్రం అడక్కండి అంటున్నాడు. ఆనాడు యిట్లా అనే వాళ్ళా! ఎలావుంది సినిమా! అని అడగనివాడు పాపాత్ముడు – చాలా బాగుందయ్యా అంటూ కథంతా చెప్పేవాళ్ళు. అసలీనాటి చిత్రాల్లో కథంటూ ఉంటేగదా చెప్పడానికి. కథ చెప్పడానికి బదులు కత్తియుద్ధాలు బాగున్నాయనీ, ఫలానావాళ్ళ డాన్సులు బాగున్నాయనీ చెప్తున్నారు. పూర్వం, ప్రజలు తెరమీద పాత్రలను చూసి ఆనందించేవారేగాని, పాత్రధారులెవరో ఎరుగరు. అసలు పాత్రధారులెవరో తెలుసుకోవాలన్న ఆసక్తి కూడా ఆనాడు ప్రజల్లో ఎక్కువగా ఉండేదికాదు. వాళ్ళకు కావలసింది మంచికథ, తియ్యటి సంగీతం ఉండే చిత్రం. అలాంటి చిత్రాన్ని ఎన్నిసార్లయినా చూసేవాళ్ళు. ఎంత దూరాన్నుండైనా వచ్చేవాళ్ళు.



ఈనాడు ప్రజలు తెరమీద పాత్రల్ని చూట్టంలేదు. పాత్రధారుల్ని చూస్తున్నారు. తమ అభిమాన పాత్రధారుడు ఏ చిత్రంలో నటించినా, ఏ పాత్ర ధరించినా, ఆ పాత్రధారుడి పిలకపట్టుకుని బయటికిలాగి పాత్రనుంచి వేరుచేసి చూసి ఆనందిస్తున్నారు. అనాడు ప్రజలు రాముణ్ణి, లక్ష్మణుణ్ణి, చూట్టానికి పరుగెత్తితే, ఈనాడు హీరోలను చూట్టానికి పరుగెత్తుతున్నారు.

ఆనాడు ఒక చిత్రంలో ఇద్దరు ముగ్గురు నటీనటులుంటే, ఏది ఎవరిపేరో తెలీకుండానే ఒక్కొక్కళ్ళు ఆ చిత్రాన్ని, పది పదకొండుసార్లు చూసేవాళ్ళు– 'గృహలక్ష్మి'లో కన్నాంబ ఎవరో, కాంచనమాల ఎవరో నిన్న మొన్నటిదాకా చాలా మందికి తెలీదు. ఆనాడు పాత్రధారులెవరో, ఎట్లావుంటారో చూడాలన్న ఆసక్తి పసిపిల్లల్లోనే ఎక్కువగా ఉండేది.

## II

### స్టారు మావూరొచ్చింది

ఒకసారి మావూరుకు ఎవరో సినిమాస్టారు వచ్చిందని పుకారు పుట్టింది. కొందరు కాంచనమాలే వచ్చిందన్నారు. కాదు కాదు కన్నాంబ అన్నారు కొందరు. వీళిద్దరూ కాదు ఎవరో కొత్తస్టారట, అన్నారు మరికొందరు. అసలా సినిమా స్టారెట్లా ఉంటుందో చూడాలని మా స్కూల్లో కొంతమంది పిల్లలం తీర్మానించుకున్నాం. ఆవిడ ఎక్కడ దిగిందో మెల్లిగా కూపీతీశాం. వెతకబోయిన తీగే కాలికి తగిలినట్లు, ఆ సినిమా స్టారు ఎవరో కాదు మా స్కూల్లో చదివేపిల్ల అక్కయ్యేనన్నారు. యింకేం! రొట్టె విరిగి నేతిలో పడ్డట్టు సంతోషించాం. స్కూలు వదిలేయగానే అందరం ఆ పిల్లచుట్టూ మూగాం. వాళ్ళక్కయ్యను చూపించమని ఎట్లా అడగాలో తెలీక కాసేపు తికమకపడి ఒకళ్ళ చెవులు ఒకళ్ళం కొరుకున్నాం. మా నవ్వులూ, గుసగుసలూ చూసి ఆ పిల్లకేదో సందేహం కలిగింది. చివరకు ధైర్యంచేసి "ఏమోయ్ – మరీ – మరీ – మీ అక్కయ్య – సినిమాలో" అని మేం పూర్తి చేయకముందే ఆ పిల్ల తారాజువ్వలా లేచింది మా మీదకి – "అవునూ – మా అక్కయ్య సినిమాస్టారే! అయితే మీకేం! మిమ్మల్నేం చేసిందీ! ... సినిమాలు చూడందే ... ఉండలేరుగాని, సినిమాలో వేషాలేసే వాళ్ళంటే ఎందుకమ్మా అంత ఎగతాళీ!" అంటూ ఆ పిల్ల కరవబోయింది మమ్ముల్ని.

మేం తెల్లబోయాం – సినిమాల్లో వేషాలేసే వాళ్ళంటే నీచంగా చూసే ఆ కాలంలో, వాళ్ళక్కయ్య సినిమా స్టారని మేమంతా ఆ పిల్లను ఎద్దేవా చేస్తున్నామనుకుంది పాపం – అదేం కాదని, కేవలం వాళ్ళక్కయ్య ఎట్లా ఉంటుందో ఒక్కసారి చూస్తే మా జన్మ తరిస్తుందనీ, ఎంతో వినయవిధేయతలతో ప్రాధేయపడ్డాం. ఆ పిల్ల చాలాసేపు బిగువు చేసి, చివరకు ఎట్లాగయితేనేం వాళ్ళక్కయ్యను మాకు చూపించడానికి ఒప్పుకుంది – ఎప్పుడు వెళ్ళి వాళ్ళక్కయ్యను చూడవచ్చునో చెప్పింది. భక్తి శ్రద్ధలతో విన్నాం కాని ఇంట్లో అమ్మా నాన్నా వాళ్ళకు తెలిసినా, స్కూల్లో అయివారమ్మలకు తెలిసినా వీపు చితక్కొడతారు. అదంతా జాగ్రత్తగా ఆలోచించి, ఆ రోజు మధ్యాహ్నం స్కూలుకు నామం వేసి బయల్దేరాం. ఆ సినిమాస్టారు చెల్లెలివెంట – ఆ పిల్ల మమ్మల్ని బయటవాకిట్లోనే ఉంచి తనుమాత్రం లోపలికెళ్ళింది. మారుమూలవున్న వాళ్ళ ఇంటి ముందు కొన్ని గంటలు పడిగాపులు పడ్డాం పిల్లలందరం. చాలా సేపటికి ఆ పిల్ల బయటకొచ్చి మమ్మల్ని లోపలకు రమ్మని సౌంజ్ఞచేసింది. మేమంతా సంతోషంతో ఒక్కసారిగా లోపలికి పరుగెత్తాం. ఆ పిల్ల టక్కున మాకడ్డు నిలబడి 'ఉస్ మెల్లిగా శబ్దం చేస్తే అక్కయ్యకు తలనొప్పి' అన్నది. మేం హడలిపోయి అడుగులో అడుగువేసుకుంటూ లోపలికెళ్ళాం. దేవలోకంనుంచి దిగివచ్చిన రంభలాగా ఆ సినిమాస్టారు మాకు దర్శనం ఇవ్వబోతోందని ఆశించి వేయికండ్లతో ఎదురుచూశాం. ఆవిడ ఏవైపు నుంచి వస్తుందోనని దిక్కులు చూస్తూ నిలబడినాము.



"ఈవిడే మా అక్కయ్య" అంటూ మా ముందే నేలమీద దిండేసుకుని పడుకునివున్న నల్లటి దుక్కలాంటి ఒక ఆడమనిషిని చూపిందాపిల్ల. కండ్లు తిరిగి మైకం వచ్చినంతపనయింది మాకు... మా ఉత్సాహం అంతా ఒక్కసారిగా చల్లబడిపోయింది. సినిమాస్టారంటే ఎంతో అందంగా, తెల్లగా, సినిమాల్లో కనిపించినట్టే కనిపిస్తుందనుకున్నాం. మా కంటికి ఆవిడ పనిమనిషికంటే అన్యాయంగా కనిపించింది. ఒక్కక్షణం అక్కడ నిలబడలేకపోయాం. పిల్లలందరం బయటికొచ్చేస్తుంటే, ఆ సినిమాస్టార్ చెల్లెలు కూడా మా వెనకాలే వాకిటిదాకా వచ్చింది. అదిసరేగాని, ఏమేయ్ మరీ, సినిమాల్లో అందరి ముఖాలూ తెల్లగా కనిపిస్తాయే, అదేమిటీ మీ అక్కయ్య ముఖం అంత నల్లగా ఉంది. "పాతచింతపండులాగా!' అని అడిగిందా పిల్లను మాలో ఒక గడుసుపిల్ల. "సినిమాల్లో మేకప్ వేసుకుంటారట్నోయ్... ఆ మేకప్ వేస్తే నల్లటి వాళ్ళ ముఖాలు, తెల్లటివాళ్ళ ముఖాలూ అన్నీ ఒకటిగానే కనపిస్తాయట సినిమాల్లో." మా అక్కయ్య చెప్పింది. అన్నదాపిల్ల.

"అన్నట్టు మీ అక్కయ్యను మేం ఏ సినిమాల్లోనూ చూళ్ళేదే! ఏం వేషాలేసింది!" అంటూ ఓ చచ్చుప్రశ్న వేసింది మరోపిల్ల.

"మా అక్కయ్య పెద్ద పెద్ద ఎక్స్ట్రావేషాలేస్తుంది. మైరావణలో రాక్షసుడి భార్యగా వేసింది, మాలపిల్లలో ఒక మాలవాడి భార్యగా వేసింది, ఓయబ్బో... ఇంకా, చాలా వేషాలేసింది... అసలు మా అక్కయ్య లేని సినిమాలేదే!" అన్నదాపిల్ల.

అసలు ఎక్స్ట్రావేషాలంటే ఏమిటో ఆనాడు మాకేం తెలుసు. అవేవో చాలా పెద్దవేషాలేగాబోలనుకున్నాం. అదే యీనాటి పిల్లల్ని కదిలిస్తే! ఏది ఎలాంటి వేషమో చెప్పడమే కాకుండా, చాలా పెద్ద పెద్ద విషయాలు మాట్లాడతారు.

**నాపసానిలాటి పాపలు**

మొన్న ఆ మధ్య సినిమాల్లో చేరాలంటూ వచ్చిన ఒక పాపను చూశాను. ఆ పాపవెంట వాళ్ళ అవ్వగారు కూడా వచ్చింది. ఇంక ఆ పాప వయసుకుమించిన మాటలూ, చేష్టలూ చూస్తుంటే, ఆశ్చర్యంతో గుడ్లుతేలేశాను. ఆ పిల్లవయసెంతో తెలుసా అని అడిగింది నా పక్కనున్నావిడ. తెలీదనన్నాను. డెబ్బై ఏండ్ల ముసల్ది ఆ పాప. అన్నదావిడ. నాకు నవ్వొచ్చింది. నిజంగానే ఆ పిల్ల అన్ని విషయాలూ, కాచివడయకట్టిన నాపసానిలాగా చేతులు త్రిప్పుతూ చెబుతోంది కబురు. అదంతా ఈ రోజుచలాకీతనం కింద చలామణీ అయినా, రేపు ఆ పిల్ల భవిష్యత్తుకి ఆ చలాకీతనం హానికలగజేస్తుందనిపించింది.

ముద్దుక్కూడా హద్దుండాలి. పిల్లలు ఏ వయసుకు తగినట్టు ఆ వయసుకుంటేనే వాళ్ళ జీవితాల యొక్క పునాదులు చెక్కు చెదరకుండా ఉంటాయి. ఆనాడు పసిపిల్లల్లో తెలివితేటలుంటే చదువు సంధ్యల్లో ఉండేవి మిగతా విషయాల్లో వయస్సుకు తగినట్టే ఉండేవాళ్ళు ఆనాటి పిల్లలు – ఈనాడు పిల్లలు పుడుతూనే సకలశాస్త్రాలూ చదివి మరీ పుడుతున్నారు. ఇంక వాళ్ళకు సినిమాలకోసం చలాకీతనం అంటూ నేర్పిస్తే అగ్గికి గుగ్గలం తోడయినట్లే.

చలాకీతనం అంటే నాకు, కీ.శే. శ్రీ గూడవల్లి రామ బ్రహ్మంగారు జ్ఞాపకం వస్తారు.

ఒకరోజు కోర్టుపనిమీద చెన్నపట్నం బయలుదేరిన నాన్నవెంట నేనూ పట్నం చూస్తానంటూ బయలుదేరాను. పట్నం అంతా చూసినతర్వాత సినిమాలు తీసేచోటు చూపించమని నాన్నను వేధించడం మొదలుపెట్టాను. నాన్నకు మిత్రులు శ్రీ డా॥గోవిందరాజుల సుబ్బారావుగారు అప్పట్లో మాలపిల్లలో వేషం వేస్తున్నారు. ఆయనద్వారా నాన్న నాకు మాలపిల్ల, ఆమె చెల్లెలు, కథానాయకుడూ, ముగ్గురూ కలిసి పాడుతున్నారు పాట – నా అభిమానతార కాంచమాలను ఆ రోజు కళ్ళారా చూశాను... ఇంక నా సంతోషం చెప్పతరంగాదు. ఊరికి వెళుతూ సాధించిన ఘన విజయాన్ని గురించి నా స్నేహితురాండ్లందరితోనూ చెప్పదలచుకున్నాను. షూటింగ్ అయిపోయింది. నాన్ననూ, రామబ్రహ్మంగారికి పరిచయం చేస్తూ, ఈ పాప చాలా బాగా పాడుతుందండీ అన్నారు డా॥గోవింద రాజుల సుబ్బారావు గారు.



"అల్లాగా! ఏది ఒక పాట పాడమ్మా" అన్నారు రామబ్రహ్మం గారు.

పట్నం చూట్టానికి వచ్చిన నన్ను పాట పాడమంటారని నాకేం తెలుసు! పైగా నా అంతట నేను పాడితే వినాల్సిందేగాని, "ఏది ఓ పాట పాడమ్మా అంటే ఆనాటి నుండి ఈ నాటికి పాడలేని నేను ఆ రోజుకూడా రామబ్రహ్మంగారు పాడమనే సరికి భయంతోనూ, సిగ్గుతోనూ బిగుసుకుపోయాను తల భూమిలోకి దించుకుని హీనస్వరంతో ఏదో పాడాను:

'ఈ పాప మాలపిల్ల చెల్లెలు వేషానికి బాగుండేది కదండీ' అన్నాడు డా॥గోవింద రాజుల సుబ్బారావు గారు.

## ఆలోచించండి-చెప్పండి

- *సినిమా నటులను చూసినప్పుడు మీకేమనిపిస్తుంది? వారితో ఏం మాట్లాడతారు?*
- *గతంలో సినిమాలలో నటించడానికి నామోషీగా భావించేవారు. నేడు దాన్ని గొప్పగా చూస్తున్నారు. ఈ మార్పు ఎందుకు చోటుచేసుకొంది?*
- *పాట పాడమంటే భానుమతి భయంతోనూ, సిగ్గుతోనూ బిగుసుకు పోయింది కదా! మీకెప్పుడైనా ఇలాంటి అనుభవం ఎదురైందా? ఏ ఏ సందర్భాలలో ఎదురైంది?*
- *ముద్దుచేయడానికి కూడా హద్దుండాలని భానుమతి ఎందుకన్నది?*

**'కాళింది' దొరికింది**

'బాగుండేదికాని, ఈ పాపకు చలాకీతనం లేదు. ఇంత సిగ్గు భయాలుంటే యీ అమ్మాయి సినిమాలకు పనికిరాదు' అన్నాడు రామబ్రహ్మంగారు. బ్రతుకు జీవుడా అనుకున్నాను. చలాకీతనం లేకపోవడం వల్ల ఆ రోజు బ్రతికి బయటపడ్డాననుకున్నానేగాని, ఆ తర్వాత 'వరవిక్రయం' అనే కథలో కాళింది అనే పిల్ల నా కోసం కాచుకూర్చొనుందని నాకేం తెలుసు. కాళింది వేషం వేయడానికి ఒకమ్మాయి కావాలంటూ కాలికి బలపం కట్టుకుని వెతుకుతున్నారు శ్రీ సి.పుల్లయ్యగారు. ఆయన కంటికి నేనే కనిపించాలా. "ఏది ఓ పాటపాడు అమ్మడూ" అన్నారు పుల్లయ్యగారు. మళ్ళీ ఎప్పట్లాగే బిగుసుకుపోయాను. ఆయన ఎదురుగా పాడే, ధైర్యంలేక గోడవైపు తిరిగి, గొర్రెలా తలవంచుకుని యిష్టంలేకుండా ఏడుపుముఖంతో ఏదో పాడాను. పుల్లయ్యగారు కూడా "ఈ అమ్మాయి సినిమాలకు పనికిరాదు" అంటారని ఆశించాను. కాని కథ అడ్డం తిరిగింది.

పుల్లయ్యగారు నవ్వుతూ, "అసలీ అమ్మాయేనండీ మా కాళిందీ" అన్నారు నాన్నతో. నాన్నకూడా ఆశ్చర్యపోయాడు. నటించే అవసరంలేకుండా అన్ని విధాలా నన్ను పోలిన కాళిందిలాంటి ...నాకు తొలిచిత్రంలోనే గనక దొరక్కపోయినట్లయితే బహుశా నాలాంటి బెదురుగొడ్డుకు సినిమాల్లో అసలు స్థానం ఉండేది కాదు. దానికి తగినట్లు సినిమాలంటేనూ, సినిమాల్లో వేషాలేసే వాళ్ళంటేనూ నీచంగా భావించే ఆకాలంలో సినిమాల్లో నటించడం అంటే నాకు సుతారమూ ఇష్టం ఉండేదికాదు. సినిమాలు చూడటంవరకేగాని, అనుకరించడం తప్పుగా భావించేవాళ్ళానాడు ఏ యిల్లాలైనా పొరపాటున కాస్త ఎత్తుగా బర్మాముడి వేసుకుని పూలుచుట్టుకుంటే, వెంటనే 'సినిమా ఫ్యాషన్లు చేసుకుందర్రా" అంటూ ఆవిణ్ణి వెలేసినట్లు చూసేవారు.

ఒకసారి మా వీధిలోవున్న పోస్టుమాస్టరుగారి భార్య చుక్కమ్మ... గృహలక్ష్మిలో కన్నాంబగారు వేసుకున్నట్లు ఎత్తుగా బర్మా ముడి వేసుకుని పూలుచుట్టుకుని మా పక్కింటికి పేరంటానికి వచ్చింది. ఆవిడతో అంతకుముందు ఎంతో ఆప్యాయంగా మాట్లాడే అమ్మలక్కలందరూ ఆవిడ బర్మాముడి చూడగానే ఠక్కున మాట్లాడటం మానేశారు. పాపం ఆవిడ చిన్నబుచ్చుకుని



యింటికి వెళ్ళిపోయింది. ఆవిడటువెళ్తూనే, "ఏవమ్మో వదినా! ఇది విన్నావా! చుక్కమ్మ సినిమాల్లో చేరబోతోందట్నే! అంటూ ఆరంభం చేసిందో కలహకంఠి. మరీ తెలీడంలా! ఆ బర్మాముడి, ఆ వాలకం చూస్తుంటే సినిమాస్టారులాగా! అంటూ మూతి విరిచింది ఒకావిడ.

**ఎన్ని మారినా**

ఆనాటికానాడు ప్రజల్లో సినిమామోజు ఎక్కువయ్యేకొద్దీ, ఒకప్పుడు చుక్కమ్మ నన్నవాళ్ళే బర్మాముళ్ళు వేసుకోవడం దగ్గర్నుంచీ చేతుల్లేని జాకెట్లతోసహా వేసుకోవడం మొదలెట్టారు. అప్పట్నుంచీ ఒకళ్లను చూసి ఒకళ్ళు ఫాషన్లలో సినిమాలకంటే అడ్వాన్సుగా వెళ్ళడం మొదలెట్టారు. ఈనాడు సినిమా ఫ్యాషనంటూ ఏమీ మిగల్లేదు. ప్రజలు దగ్గర్నుంచే ఫాషన్లు నేర్చుకుంటున్నారు సినిమావాళ్ళు. రోజులు మారాయి. ఆనాడు ఫలానాపిల్ల సిగ్గులేకుండా సినిమాల్లో డాన్సు చేస్తోందట్నే అన్న అవ్వగార్లే యీనాడు మనవరాళ్ళ భరతనాట్యానికి స్వయంగా తాళం వేస్తున్నారు. పిల్లలు సినిమాలు చూసి చెడిపోతున్నారనీ, పిల్లల్ని సినిమాల్లో చేర్చడంకంటే ఉరిపోసుకుచావడం మేలనీ, ఉపన్యాసాలిచ్చిన పెద్దలే ఈనాడు తమ పిల్లల్ని వెంటబెట్టుకుని మా పెద్దమ్మాయి బాగా పాడుతుంది. మా చిన్నమ్మాయి బాగా డాన్సు చేస్తుంది అంటూ ముందుకొస్తున్నారు. కాలం మారింది. మనుషులు మారారు. సినిమా కథలు మాత్రం మారలేదు.

## III

**మూడడుగులు ముందుకువస్తే**

"ఎక్కడున్నావే గొంగళీ అంటే వేసినచోట్నే" అన్న సామెతగా తయారవుతున్నాయి ఈ నాడు కొన్ని చిత్రాలు. ఆనాటి నుండి ఈనాటి దాకా పరమపద సోపానపటంలో నాలుగుమెట్లు పైకివెళ్ళడం, పాముకరిస్తే కిందికి జారడంలాగా ఉంది చలనచిత్రపరిశ్రమ పరిస్థితి. కొన్ని ఉత్తమచిత్రాలు పరిశ్రమను నాలుగుమెట్లు పైకి తీసుకువెళితే, కొన్ని చెత్త చిత్రాలు పరిశ్రమను పదిమెట్లు కిందికి లాగుతున్నాయి. ఆనాటి పరిశ్రమలో అడుగుపెట్టిన వ్యక్తులందరికీ ఏదో ఒక అడ్రసు ఉండేది. కొంత చదువూ సంస్కారమూ ఉండి, చలనచిత్ర నిర్మాణం ఒక కళగా భావించి, ఇంట్లోనుంచి డబ్బు తీసుకొచ్చి సినిమాల్లో పెట్టి చేతులు కాల్చుకున్నవాళ్ళేగాని యీనాడులాగా కేవలం తాడూ బొంగరంలేని వ్యక్తుల్లా ఆనాడు రాలేదు. ఒకప్పుడు ఒక చిత్రానికి కొంతయినా పెట్టుబడి పెడితేనే ప్రొడ్యూసరు కాస్తో కూస్తో 'టెక్నిక్' తెలిసి, అనుభవం వుంటే డైరెక్టర్ ఈనాడు యిట్లా చూసినవాండ్లు అట్లా ప్రొడ్యూసరూ, డైరెక్టరూ అయిపోతున్నారు. నలుగురైదుగుర్ని చంపందే డాక్టరు కాడన్న సామెతగా నాలుగయిదు చిత్రాలు తీసిందాకా షాటు ఎట్లా తీయాలో తెలియకుండానే డైరెక్టరుగా చెలామణీ అవుతున్నారీనాడు కొందరు అదృష్టవంతులు డిస్ట్రిబ్యూటర్లూ, టెక్నీషియన్లు చల్లగా ఉన్నన్నాళ్ళూ యీనాడు ఎవరైనా ప్రొడ్యూసరు కావచ్చు. ఎవరైనా డైరెక్టరు కావచ్చు.

ఒకప్పుడు ఒకళ్ళు ఒక చక్కని చిత్రాన్ని నిర్మిస్తే, ఆ చిత్రానికన్నా మిన్నగా యింకో చిత్రాన్ని నిర్మించాలనే కళాభిమానంతోనూ, ఉత్సాహంతోనూ కృషిచేశారు. కొందరు ఈనాడు అర్థంలేని చిత్రానికి అనవసరంగా డబ్బొస్తే, డబ్బు రావడానికి ఆ చిత్రంలోగల ప్రత్యేక అవలక్షణాలేమిటో కనుక్కుని, అంతకు మించిన అవలక్షణాలతో మరొక చవకబారు చిత్రాన్ని తయారుచేసి ప్రజలకందిస్తున్నారు కొందరు.



ఒకళ్ళు 'సీతారామ యుద్ధం', అంటే మరొకళ్ళు 'హనుమంతుడి తోక' అంటూ ఆరంభిస్తున్నారు. అసలు సీతకూ, రాముడికి యుద్ధం ఏమిటర్రా మీ పిండాకూడా! అని అడిగే దిక్కులేదు. ఒకవేళ ఎవరికి తెలీకుండా సీత, రాముడితో యుద్ధం చేసింది కాబోలు... అనుకుని మతులుపోయి చూస్తున్నారీనాడు ప్రజలు కూడా. మరి సీతారామ యుద్ధం అంటూ వాళ్ళెవరో తీస్తున్నారు గదా మళ్ళీ హనుమంతుడి తోక అంటూ వేరే చిత్రం తయారుచేయడం ఎందుకు? అని అడిగితే అబ్బే వాళ్ళ హనుమంతుడు వేరు ఇది వేరు. మా కథలో హనుమంతుడి తోకే 'హీరో' అంటున్నారు. ఇంక కోతుల మేకప్ కోసం కొబ్బరిపీచుకు ఎక్కడలేని డిమాండు. ఆనాడు హనుమంతుడితోక నిజమైందా లేక పీచుదా అనే విషయాన్ని ప్రజలకు తెలీకుండా తీయడానికి ప్రయత్నించారు. యీ నాడు యిది ఒట్టి కొబ్బరిపీచుతోక అని నిరూపిస్తున్నారు.

ఇంతకంటే పూర్వం వచ్చిన పౌరాణిక చిత్రాలే వెయ్యి రెట్లునయం అనిపించేటట్లు తీస్తున్నా రీనాడు కొన్ని పౌరాణికాలు.

దక్షిణదేశంలో నేటి చలనచిత్ర పరిశ్రమ, టెక్నికల్‌గా ఎంతో ఉన్నతస్థాయికి వెళ్ళినా, యింకా అందుకోవలసిన శిఖరాలను అందుకోలేకపోతోందనే చెప్పాలి.

హాలీవుడ్ నిర్మాతలు పదిహేను సంవత్సరాల క్రితం టెక్నికలర్ చిత్రాలు తీయడం మొదలుపెట్టారు. మనం యింకా గేవా కలర్‌లోనే ఉన్నాం. వాళ్ళు సినిమా స్కోపులుదాటి పోతున్నారు. మనం యింకా బైస్కోపుల్లోనే వున్నాం. రోజు రోజుకూ తారాస్థాయినందుకుంటున్న హాలీవుడ్ వాళ్ళ చిత్రాలు చూస్తుంటే మనం ఎక్కడున్నామా అనిపిస్తుంది. ఆనాడు మన్నుతిన్న కృష్ణుడినోట్లో యశోదమ్మ ప్రపంచాన్నంతా చూసినట్లు, యీనాడు హాలీవుడ్ వాళ్ళు ప్రపంచాన్నంతా సినిమాస్కోపులో ఇమిడ్చి చూపిస్తున్నారు.

**గంగిగోవుపాలు**

మనం కూడా ఆ విధంగా సినిమాస్కోపు చిత్రాలను తీయగలిగిననాడు, భారతం, రామాయణం, లాంటి గొప్ప పౌరాణిక గాథలను ఖండ ఖండాలుగానూ, పిండ పిండాలుగానూ చేయకుండా యథాతథంగా తీసే అవకాశం ఉంటుంది. ఈనాడు సిసిల్ బిడిమిల్ 'టెన్ కమెండ్‌మెంట్స్' చిత్రం తీశాడంటే హడలిచచ్చేట్లు తీశాడు. కేవలం మానవసృష్టి, అనుకోడానికి వీల్లేనంత అంతస్తుకెళ్ళి తీశాడు. అలాంటి గొప్ప గాథను ఏ విధంగా తీస్తే బాగుంటుందో, ఆ విధంగానే తీయడానికి కృషిచేసి, అదే తన జీవిత లక్ష్యంగా భావించి తీశాడామహనీయుడు. అలాంటి గొప్ప చిత్రాలను నిర్మించాలంటే మనవాళ్ళు ఆర్థికంగా నిలవలేకపోవచ్చు. కాని ఒక మంచిచిత్రాన్ని నిర్మించడానికి నలుగురయిదుగురు నిర్మాతలు కలిసి సమిష్టిగా కృషిచేయవచ్చు. ముఖ్యంగా చిత్ర నిర్మాణం కేవలం సమిష్టి కృషి మీదనే ఎక్కువగా ఆధారపడి ఉంటుంది. ఒక చిత్రం విజయవంతం కావాలంటే దానికి ఎంతో మంది పాటుపడాలి. అలాంటప్పుడు నలుగురు నాలుగు చెత్త చిత్రాలు తీసేబదులు, నలుగురూకలిసి ఒక మంచి చిత్రాన్ని నిర్మించగలిగిననాడు పరిశ్రమ ఎంతయినా బాగుపడుతుంది. 'గంగిగోవుపాలు గంటెడైనను చాలు' అన్నట్టు అలాంటి ఉత్తమ చిత్రాలు కొద్దిగా వచ్చినా చాలు.

ఈనాడు 'నామ్‌నీశానీ' లేని నలుగురు కలిసి కంపెనీ పెట్టి ఒక చిత్రాన్ని ఆరంభించడం ఆ చిత్రం పూర్తయ్యేలోగానే నలుగురూ విడిపోయి నాలుగు కంపెనీలు లేపడం, మళ్ళీ ఆ నాలుగు కంపెనీల్లోనూ ఒక్కొక్క కంపెనీకి నలుగురు భాగస్థులు చేరడం, తీసే చిత్రాలు పూర్తిగాకముందే మళ్ళీ ఆ నాలుగు కంపెనీలలోని భాగస్థులూ విడిపోయి, నాలుగు నాలుగు పదహారు కంపెనీలు లేవదీయడం జరుగుతోంది. ఈనాడు మదరాసులో ఏ వీథిలో చూసినా ఫిలిం కంపెనీలే! పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్నాయి. ఇలాంటి అర్ధాయుష ఫిలిం కంపెనీలు తెలుగు చిత్రపరిశ్రమలో కంటే తమిళ చిత్రపరిశ్రమలోనే ఎక్కువగా కనిపిస్తున్నాయి. కేవలం వ్యాపారదృష్టితో బయలుదేరుతున్న ఇలాంటి కంపెనీలవల్లనే ఈనాడు పరిశ్రమ చెడలుపట్టింది.



భారతదేశంలో హిందీ చలనచిత్రపరిశ్రమ తర్వాత, చెప్పుకోదగ్గ ఉన్నతస్థాయిలో నడిచింది, తెలుగు చిత్రపరిశ్రమ ఒక్కటే. శాంతరాంలాంటి గొప్పవాళ్ళు కొందరు తీసే చిత్రాలు మినహాయించి, ఈమధ్య వచ్చే కొన్ని హిందీ చిత్రాలు చూస్తుంటే చవకబారు ఇంగ్లీషు చిత్రాలను డబ్‌చేశారా అనిపిస్తోంది. ఆ విషయంలో దక్షిణ దేశంలో తయారయ్యే చిత్రాలే ఎన్నోరెట్లు మెరుగనిపిస్తుంది.

మొన్న ఆమధ్య మద్రాసు ఆర్థికమంత్రి శ్రీ సుబ్రహ్మణ్యంగారు కూడా తెలుగు చిత్రాలను ఎక్కువగా ప్రశంసించారు. తెలుగు చిత్రాలు ఎంతో క్లీన్‌గానూ, నీట్‌గానూ ఉంటాయనీ, ఉత్తమ చిత్రాలు తీయడంలో తెలుగువారికే అగ్రతాంబూలం ఇవ్వాలనీ అన్నారు.

ఈ మధ్య తయారవుతున్న కొన్ని చవకబారు చిత్రాలు తప్పితే గత ఇరవై సంవత్సరాల్లోనూ తెలుగు చిత్రపరిశ్రమ చెప్పుకోదగ్గ ఉన్నతస్థాయి నందుకొన్నదనే చెప్పాలి. ఆ స్థాయిని నిలబెట్టుకోవాలంటే పరిశ్రమలో ఉండే కొందరు నిర్మాతలు ఉత్తమచిత్రాలే తీయడానికి కంకణం కట్టుకోవాలి. చక్కని చిత్రాలు తీస్తూ, పరిశ్రమకే గర్వకారణమైన కొన్ని సంస్థలు యీ నాడు డబ్బుకోసం కత్తియుద్ధాలు తీస్తున్నారంటే, కంచె చేను మేసే సామెతగా పరిశ్రమ ఎంత దిగజారిపోతోందో తెలుస్తోంది.

ఇంతటైనా పౌరాణికాలు, జానపదాలూ, మనక్కూడా సినిమాస్కోపులొచ్చేదాకా ఆపి, ప్రజల విజ్ఞాన వికాసాలకు తోడ్పడే ఉత్తమ సాంఘిక చిత్రాలు నిర్మించగలిగితే పరిశ్రమ మరింతగా ఔన్నత్యాన్ని అందుకోగలదని నా అభిప్రాయం.

### ఆలోచించండి-చెప్పండి

- సినీపరిశ్రమ ఉన్నత శిఖరాలు అందుకోవడం అంటే ఏమిటి? వివరించండి.
- "తాడూ - బొంగరం లేని వ్యక్తులని" ఎవరిని అంటారు. ఈ జాతీయాన్ని భానుమతిగారు ఎందుకు ఉపయోగించారు?
- "గతంలోని పౌరాణిక చిత్రాలే నేటి పౌరాణిక చిత్రాలకంటే మేలు" దీనిపై మీ అభిప్రాయం చెప్పండి.
- గంగి గోవుపాలు గంటెడైనను చాలన్నట్లు మంచి చిత్రాలు కొద్దిగా వచ్చినా చాలు అని ఎందుకన్నది?
- చలనచిత్ర పరిశ్రమ దిగజారి పోవడం అంటే మీరేమను కుంటున్నారు?

*("ఆంధ్ర" వార పత్రిక స్వర్ణోత్సవ సంచిక, 14-1-1959)*




## I. అవగాహన - ప్రతిస్పందన

1. **సినిమాల గురించి మీ అభిప్రాయాలను సొంతమాటల్లో చెప్పండి.**
2. **మీకు ఎలాంటి సినిమాలంటే ఇష్టం? ఎందుకు? వివరించండి.**
3. **పాఠం చదవండి. పాఠంలోని జాతీయాలు, సామెతలను పట్టిక రూపంలో రాయండి.**
4. **కింది అంశాలకు సంబంధించిన సమాచారం పాఠంలో ఏ ఏ పేరాల్లో ఉందో గుర్తించండి.**

అ) సినిమా ప్రచారం　　ఆ) సినిమాహాళ్ళ పరిస్థితి

ఇ) సినిమా కథ　　ఈ) చిత్ర నిర్మాణం



**5. కింది పేరా చదవండి. ప్రశ్నలకు జావాబులు రాయండి.**

సినిమా ఉత్తమమైన కళా స్వరూపం. చలన చిత్రాల్లో వివిధ లలిత కళల సమ్మిళితాన్ని చవిచూపించవచ్చు. అనేక మంది కళాకారుల అహోరాత్రుల కృషిని, సృజనాత్మకతశక్తిని చలనచిత్రాల్లో చూస్తున్నాం. ఈ కళా స్రవంతిని నిర్మాతలు వ్యాపార మైదానం వైపు మళ్ళించవలసి వచ్చినప్పుడు అందులో మాలిన్యం కొంత మిళితం కాక తప్పదు. దానివల్ల 'కళ'లోని పరిశుద్ధత కొంత విరిగిపోకా తప్పదు. అలా కాకుండా చూడాలంటే ఆర్థికరీత్యా దెబ్బతినవలసి వస్తుంది. కోట్ల డబ్బులు వెచ్చించే ఏ నిర్మాతా నష్టపడడానికి ఇష్టపడడు. ఐనప్పటికీ ప్రపంచశాంతిని ఆశించే మనం మన సంస్కృతిని, మన కళలను, మన విజ్ఞానాన్ని ప్రతిబింబించే చిత్రాల్ని నిర్మించాలి. మన సంస్కృతికి, విజ్ఞానానికి మూలపురుషులైన మహామహుల జీవిత చిత్రాల్ని తెరకెక్కించి మన పూర్వౌన్నత్యాన్ని జ్ఞప్తికి తేవాలి. అపుడే మనం చలన చిత్రాల్ని సద్వినియోగం చేసుకొన్నట్లవుతుంది.

అ) సినిమాలకు, కళలకు గల సంబంధం ఏమిటి?

ఆ) సినిమాల ద్వారా ఏమి వెల్లడవుతుంది?

ఇ) సినిమాలలో కళా విలువలు లోపించడానికి కారణాలు ఏమిటి?

ఈ) ఎలాంటి సినిమాల నిర్మాణం జరగాలి?

ఉ) సినిమాలను మనం ఎలా సద్వినియోగం చేసుకోవాలి?

**6. పాఠం ఆధారంగా కింది ప్రశ్నలకు 4, 5 వాక్యాలలో జవాబులు రాయండి.**

అ) 'కృష్ణలీలలు' కరపత్రాల పంపిణీ చూసి ఎవరెవరు ఏమనుకొన్నారు?

ఆ) నాటి ప్రేక్షకుల అభిరుచి ఎలా ఉండేది?

ఇ) చిత్రనిర్మాణం గురించి భానుమతిగారిచ్చిన సలహాలు, సూచనలు ఏమిటి?

ఈ) చిత్రనిర్మాణం గురించి భానుమతిగారు ఏమని విమర్శించారు?

ఉ) భానుమతిగారి గొప్పదనం గురించి రాయండి.

## II. వ్యక్తీకరణ – సృజనాత్మకత

**1. కింది ప్రశ్నలకు ఆలోచించి 4, 5, వాక్యాల్లో సమాధానాలు రాయండి.**

అ) కథా విషయానికి వస్తే నాటి సినిమాల ముందు నేటి సినిమాలు నిలువలేవని భానుమతిగారు ఎందుకన్నారు?

ఆ) "ముద్దుకు కూడా హద్దుండాలి" అని భానుమతిగారు ఏ సందర్భంలో అన్నారు? ఎందుకన్నారు?

ఇ) నాటి ప్రేక్షకులతో పోల్చితే, నేటి ప్రేక్షకుల అభిరుచి ఎలా మారింది?

ఈ) నేటి సినిమాల గురించి ప్రచారం చేయడం కోసం ఏమేం చేస్తున్నారు?

**2. కింది ప్రశ్నలకు ఆలోచించి 10, 12 వాక్యాల్లో సమాధానాలు రాయండి.**

అ) భానుమతి గారు 1960 దశకంలోని సినిమాల పరిస్థితిని, ఆ తరువాత ఉన్న పరిస్థితితో పోల్చి వ్యాసం రాసారు కదా! నేటి సినిమాలు ఎలా ఉన్నాయో విమర్శనాత్మకంగా రాయండి.



ఆ) గతంతో పోలిస్తే నేడు పౌరాణిక చిత్రాల నిర్మాణం తగ్గిందికదా! ఇలా ఎందుకు జరిగి ఉండవచ్చు? కారణాలను వివరిస్తూ రాయండి.

**3. కింది అంశాల గురించి సృజనాత్మకంగా / ప్రశంసాత్మకంగా రాయండి.**

అ) నేటి సినిమాల్లో హింస, అశ్లీలతలు అరికట్టబడేలా చర్యలు చేపట్టమని వార్తా పత్రికలకు ఒక లేఖ రాయండి.

ఆ) "చలన చిత్రాలు - ప్రయోజనాలు - నష్టాలు" అనే అంశం గురించి వ్యాసం రాయండి.

## III. భాషాంశాలు

### పదజాలం

**1. కింది అంశాలను వేటితో పోల్చారో పాఠం ఆధారంగా రాయండి.**

అ) కరపత్రాలు (తెల్లని కాగితాలు) : ______________________

ఆ) సినిమావాళ్ళు : ______________________

ఇ) కథాబలం లేని సినిమా : ______________________

ఈ) సినీనటి ముఖం : ______________________

ఉ) ఈ నాటి సినిమాలు : ______________________

**2. కింద తెల్పిన జాతీయాలనుపయోగించి సొంతవాక్యాలు రాయండి.**

అ) తారా జువ్వలా లేవడం : ______________________

ఆ) గుడ్లు తేల వేయడం : ______________________

ఇ) చెవులు కొరుక్కోవడం : ______________________

ఈ) కాలికి బలపం కట్టుకోవడం: ______________________

ఉ) కథ అడ్డంతిరగడం : ______________________

**3. కింది పదాలు చదవండి. పాఠం ఆధారంగా వీటికి వివరణలు రాయండి.**

అ) తారా జువ్వలా లేచింది : ______________________

ఆ) ఆ పిల్ల కరవ బోయింది : ______________________

ఇ) స్కూలుకు నామంవేసి వెళ్ళాం : ______________________

ఈ) గంగి గోవుపాలు గంటెడైనను చాలు : ______________________

ఉ) అగ్ర తాంబూలం : ______________________



## IV. భాషా కార్యకలాపాలు

1) ఈ మధ్యకాలంలో విడుదలైన ఏదైనా ఒక సినిమా గురించి రాసిన సమీక్ష వ్యాసాన్ని సేకరించండి. దాని గురించి సొంతమాటల్లో రాసి ప్రదర్శించండి.

2) మీరు చూసిన ఏదైనా ఒక సినిమా గురించి నివేదిక రాసి ప్రదర్శించండి (లేదా) ఈ మధ్యకాలంలో బాలల చలనచిత్రోత్సవ వేడుకలలో అవార్డుపొందిన సినిమా గురించిన వివరాలు సేకరించి నివేదికను రాసి ప్రదర్శించండి.

## V. వ్యాకరణాంశాలు

### పునశ్చరణ

**1. కింది వాక్యాల్లో ఉన్న 'అనునాసిక', 'పద్వాది' సంధుల పదాలను గుర్తించి విడదీయండి. సూత్రం రాయండి.**

అ) ఎక్కడ కూర్చున్నది మరచిపోయి తన్మయులమై చూసేవాళ్ళం.

ఆ) నీవు సందేహపడనవసరం లేదు.

ఇ) పురాణ వాఙ్మయం చూసి భయపడకు. చదివి ఆనందపడు.

ఈ) సన్నుతి చేయుము.

ఉ) రాణ్మణి యుద్ధంలో భంగపడదు.

**2. కింది వాక్యలను ప్రత్యక్ష, పరోక్ష కథనంలోకి మార్చండి.**

అ) నేను నేటి సినిమాలను చూడలేకపోతున్నాను అని అమ్మతో అన్నాను.

ఆ) నీకివ్వాల్సింది ఏమీలేదు అని నాతో అతడన్నాడు.

ఇ) సుందరకాండ చదవమని నాకు ఉపాధ్యాయుడు చెప్పాడు.

ఈ) వాళ్ళమ్మ చెప్పింది భానుప్రకాశ్ ఊరికెళ్ళాడని.

ఉ) చెన్నయ్య పద్యాలు బాగాపాడాడని అందరనుకుంటున్నారు.

### పరిచయం

**1. అర్థాలంకారాల్లోని మరొక అలంకారాన్ని తెలుసుకుందాం.**

ఉదా॥ i) మా చెల్లెలు తాటి చెట్టంత పొడవుంది.

ii) దేవాలయ గోపురాలు ఆకాశానికంటుతున్నాయి.

పై వాక్యాల్లో చెల్లె ఎత్తును, గోపురాల ఎత్తులను ఉన్న ఎత్తు కంటె ఎక్కువచేసి చెప్పడం జరిగింది కదా! అంటే అతిశయంగా చెప్పడం అన్నమాట. ఇలా చెప్పటాన్ని అతిశయోక్తి అలంకారంతో చెప్పటం అని అంటారు.

లక్షణం : ఉన్న విషయాన్ని ఉన్నదానికంటె ఎక్కువచేసి చెప్పడం.

కింది లక్ష్యాలను పరిశీలించండి. అలంకారం గుర్తించండి.



i) కం. చుక్కలు తల పూవులుగా
అక్కజముగ మేనుపెంచి యంబర వీధిన్
వెక్కసమై చూపట్టిన
అక్కోమలి ముదము నొందె ఆత్మస్థితికిన్

ii) మా పొలంలో బంగారం పండింది.




"సినిమా ఉత్తమమైన కళాస్వరూపం. దీని ద్వారా ఒక దేశం యొక్క సంస్కృతి సంప్రదాయాలు ఇతరులకు తెలుస్తాయి."

*- కాన్‌స్టెంటు లాంబర్టు*





# ౨. బసవపరిణయం

– పాల్కురికి సోమనాథుడు

**చదవండి - ఆలోచించి చెప్పండి.**

శ్రీ సీతారాముల కల్యాణం చూతము రారండీ ॥2॥

సిరికల్యాణపు బొట్టును పెట్టి బొట్టును పెట్టి
మణి బాసికమును నుదుటను గట్టి – నుదుటను గట్టి
పారాణిని పాదాలకు పెట్టి... ఆ... అఆఆ... అఆఆఆ... ॥2॥

పెళ్ళి కూతురై వెలసిన సీతా... కల్యాణం చూతమురారండీ ॥శ్రీసీతా॥

సంపంగి నూనెను కురులను దువ్వి – కురులను దువ్వి –
సొంపుగ కస్తూరి నామము దీర్చి – నామము దీర్చి –
చంప జవ్వాది చుక్కనుబెట్టి – ఆ... అఆఆ... అఆఆఆ...॥2॥

పెళికొడుకై వెలసిన రాముని కల్యాణం చూతము రారండీ ॥శ్రీసీతా॥

ప్రశ్నలు:

1. మీరెప్పుడైనా ఈ పాట విన్నారా? ఏ సందర్భంగా విన్నారు?
2. సీతారాముల కల్యాణం ఇప్పటికీ మనరాష్ట్రంలో వైభవంగా ఎక్కడ జరుగుతుంది?
3. 'కల్యాణం'లో పాటించే సంప్రదాయాల గురించి మీకు తెలిసిన సంగతులు చెప్పండి.
4. 'కల్యాణానికి' – పర్యాయ పదాలు చెప్పండి.

*. బసవేశ్వరుని పరిణయం గురించి తెలుసుకుందాం.

**పాఠ్యాంశ ఉద్దేశం / నేపథ్యం**

పరమశివుణ్ణి ఆరాధించే వాళ్ళంతా ఒకటే మతమని, కుల, మత, జాతి, వర్గ, వర్ణ భేదాలకతీతమైన సమ సమాజ స్థాపనకు కృషిచేసిన మహాత్ముడు బసవేశ్వరుడు. 'కాయికమేకైలాస' (శ్రమ జీవనమే శ్రేష్ఠ) మని చాటిన చైతన్యమూర్తి. ఇతడు కర్ణాటకలోని హింగుళేశ్వర భాగవాటి అనే అగ్రహారంలో మాదాంబ, మాదిరాజు దంపతులకు 1140లో జన్మించాడు. మాదాంబ సోదరుడు బలదేవుడు కళ్యాణకటకరాజు బిజ్జలుని వద్ద కోశాధికారి, తన కూతురు గంగాంబను బసవేశ్వరునికిచ్చి వివాహం జరిపించాడు. ఆ వివాహ విశేషాలే ఈ పాఠానికి నేపథ్యం.

(ఇది బసవపురాణం – ప్రథమాశ్వాసంలోనిది.







# యుద్ధ కాండం



శ్రీరాముడు హనుమంతుని సాహసాన్ని ప్రశంసించాడు. గరుత్మంతుడు, వాయుదేవుడు, హనుమంతునికి తప్ప ఈ మహాసముద్రాన్ని లంఘించడానికి ఇతరులకు సాధ్యం కాదన్నాడు. ఇచ్చిన పనిని సాధించడమేగాక, దానికి భంగం కలుగకుండా దానికనుబంధమైన ఇతర కార్యాలను సాధించేవాడు ఉత్తముడైన సేవకుడు. కేవలం ఇచ్చిన పనినే నెరవేర్చేవాడు మధ్యముడు. తనకు సామర్థ్యం ఉన్నా ఇచ్చిన పనిని పూర్తిచేయనివాడు అధముడు. సీతాదేవి కుశల వార్త చెప్పి మహోపకారం చేసిన హనుమంతునకు ఏమియ్యగలనంటూ దగ్గరకు తీసుకొని గట్టిగా గుండెకు హత్తుకున్నాడు శ్రీరాముడు. ఇదే తానియ్యగల సర్వస్వమన్నాడు. ఆదరాభిమానాలకు మించిన ఆస్తి ఉండదు కదా!

శ్రీరాముని మనసులో మళ్ళీ దుఃఖం పొంగిపొర్లింది. సుగ్రీవుడు ఊరడించాడు. నిరుత్సాహం ప్రయోజనాలను నాశనం చేస్తుందన్నాడు. దుఃఖం శౌర్య పరాక్రమాలను దిగజారుస్తుందన్నాడు. శత్రువు విషయంలో ఇప్పుడు దుఃఖం కాదు, క్రోధం చూపవలసిన సమయమని సూచించాడు. మహాసముద్రంపై సేతువును కట్టకుండా లంకను జయించడం ఇంద్రాది దేవతలకూ కానిపని అన్నాడు. శ్రీరాముడు అడుగగా హనుమంతుడు లంకానగరంలోని రక్షణ వ్యవస్థను గూర్చి వివరంగా చెప్పాడు.

మధ్యాహ్నమైంది. ఈ విజయ ముహూర్తమే లంకా ప్రయాణానికి తగినదని శ్రీరాముడు సుగ్రీవునితో అన్నాడు. శ్రీరాముడు వానరులతో, 'నీలుడు సైన్యమునకు మార్గం చూపుతూ ముందునడవాలి. లక్షలాది వానరులు అతణ్ణి అనుసరించాలి. బాలురు వృద్ధులు, బలహీనులు కిష్కింధలోనే ఉండాలి. సుగ్రీవా! నేను హనుమంతుని భుజముపై, లక్ష్మణుడు అంగదుని భుజముపై కూర్చొని ముందుకు సాగుతాం. నీవు పల్లకినెక్కి మాతోపాటు రావాలి. జాంబవంతుడు, సుషేణుడు, వేగదర్శి సైన్యం వెనుకభాగంలో ఉండి రక్షణా బాధ్యతను చూడాలి. వెళ్ళేమార్గంలో నగరాలు, గ్రామాలు ఉంటే వాటిలోకి వెళ్ళరాదు. జల, ఫల, సంద్రమైన మూలం చూడాలి. మార్గం వెంట మనం ప్రయాణించాలి' అని రాముడు సూచించాడు. ఉత్సాహం ఉరకలు వేస్తుంటే అందరూ సముద్రతీరాల్ని చేరుకున్నారు.

లంకలో రావణుడు మంత్రులతో సమావేశమయ్యాడు. వానరులను ఎదుర్కొని లంకను కాపాడుకోవడానికి ఏం చేయాలో నిర్ణయించమన్నాడు. సభలోని వారు రావణ, ఇంద్రజిత్తుల పరాక్రమాన్ని పొగిడారు. నరవానరులను లెక్కచేయాల్సిన అవసరం లేదని పెదవి విరిచారు. 'రాముని హతమార్చగలవ'ని లంకేశునికి ఆత్మస్థైర్యాన్ని కలిగించారు. ప్రహస్తుడు మొదలైనవారు శత్రుసేనలను తామే తుదముట్టించగలమని డంబాలు పలికారు.

ఇవన్నీ విన్నాడు రావణుని సోదరుడు విభీషణుడు. రాక్షసులతో 'శత్రువుల శక్తి సామర్థ్యాలను తెలుసుకోకుండా వారిని చులకనగా భావించకూడదు. శ్రీరాముడు మనకేం అపకారం చేశాడు. మన రాజే సీతను అపహరించుకువచ్చాడు. దీనివల్ల పాపం వస్తుంది. కీర్తి ప్రతిష్ఠలు మంటగలుస్తాయి. ఆయుష్షు తగ్గుతుంది. సంపదలన్నీ నశిస్తాయి. కనుక సీతను శ్రీరామునికి అప్పగించడమే అన్ని విధాలా మంచిది. అనవసరంగా కలహం తెచ్చుకోవడం దేనికి? పైగా శ్రీరాముని వంటి మహావీరునితో



యుద్ధం తగదు! అంటూ రావణునివైపు తిరిగాడు. 'అన్నా! అనవసరంగా కోపించడం మంచిదికాదు. అది ధర్మానికి ఆటంకమౌతుంది. సుఖాలను దూరంచేస్తుంద'ని హితవు పలికాడు. విభీషణుని ఈ హితబోధ 'చెవిటివాని ముందు శంఖమూదినట్ల'యింది. రావణుని భవనానికి వచ్చిన కుంభకర్ణుడు కూడా రావణుణ్ణి తప్పుపట్టాడు. సీతాపహరణ సమయంలో తమను సంప్రదించి ఉంటే బాగుండేదన్నాడు. ఇప్పుడు ఆలోచించి ప్రయోజనం లేదన్నాడు. ఇదంతా 'గతజలసేతుబంధనమే' (నీళ్ళుపోయిన తరువాత అడ్డుకట్టవేయడం)నని కుండ బద్దలుకొట్టినట్టు చెప్పాడు. 'నీవు శత్రువు పట్ల వ్యవహరించిన తీరు సరైనది కాదు, శ్రీరాముడు నిన్ను ఇంకా చంపకుండా ఉండడం నీ అదృష్టం' అన్నాడు. ఇవన్నీ ఎలా ఉన్నా శ్రీరాముని తుదముట్టించే భారం తనదేనని ప్రకటించుకున్నాడు కుంభకర్ణుడు.

రావణుడు విభీషణుని మాటలకు క్రోధావేశాలకు లోనయ్యాడు. తీవ్రస్థాయిలో నిందించాడు. అన్న తండ్రితో సమానుడని అతని నిందలను సహించాడు విభీషణుడు. కాని రావణుని అధర్మమార్గాన్ని మాత్రం సమర్థించలేదు. ధర్మం వీడిన రావణుని వీడడానికే విభీషణుడు నిర్ణయించుకున్నాడు. రెండు గడియల్లో రామలక్ష్మణులున్నచోటికి నలుగురు అనుచరులతో చేరాడు.

ఆకాశంలోనే నిలిచి శ్రీరాముని శరణుకోరాడు విభీషణుడు. అనుగ్రహించాడు దాశరథి. విభీషణుడు శ్రీరాముని పాదాలపై వాలాడు. రావణుని విషయాలన్నీ సంక్షిప్తంగా చెప్పాడు. శ్రీరాముడు విభీషణునితో 'నేను రావణుని బంధుమిత్ర సమేతంగా హతమార్చి నిన్ను రాజును చేస్తాన'ని తమ్ములపై ఒట్టేసి చెప్పాడు. ఈ పనిలో తాను యథాశక్తి సహాయపడగలనని విభీషణుడు మాట ఇచ్చాడు. రాముడు విభీషణుని ఆలింగనం చేసుకున్నాడు. లక్ష్మణునితో వెంటనే సముద్రజలం తెచ్చి లంకారాజుగా విభీషణుని పట్టాభిషిక్తుని చేయమన్నాడు. శ్రీరాముని ఆజ్ఞ వెంటనే ఆచరణ రూపం దాల్చింది. అందరూ ఆనందాన్ని ప్రకటించారు.

సముద్రాన్ని దాటే ఉపాయమేమిటని సుగ్రీవుని ప్రశ్నించాడు శ్రీరాముడు. సముద్రుని ప్రార్థించడంవల్ల ఇది సాధ్యపడుతుందన్నాడు విభీషణుడు. శ్రీరాముడు సముద్రతీరంలో ధర్భాసనంపై కూర్చుని సముద్రుని ఉపాసించాడు. మూడు రాత్రులు గడిచాయి. సముద్రుడు ఎదుట నిలువలేదు. శ్రీరాముని కన్నులు ఎర్రబారాయి. సముద్రుడి అహంకారాన్ని అణగదొక్కాలనుకున్నాడు. నీటినంతా ఇంకిపోయేటట్టు చేయాలనుకున్నాడు. బ్రహ్మాస్త్రాన్ని స్మరించాడు. ప్రకృతంతా అల్లకల్లోలమౌతున్నది. సముద్రుడు భయపడి పారిపోతున్నాడు. పరుగెత్తే వానిపై బాణం ప్రయోగించరాదని ఆగాడు శ్రీరాముడు. సముద్రుడు దారికి వచ్చాడు. లంకకు వెళ్ళడానికి దారినిస్తానన్నాడు. ఎక్కుపెట్టిన బాణం వృథాకారాదు. ఎక్కడ ప్రయోగించాలో చెప్పమన్నాడు శ్రీరాముడు. పాపాత్ములు దోపిడిదారులు ఉండే 'ద్రుమకుల్యము'పై ప్రయోగించమన్నాడు సముద్రుడు. అది జరిగిపోయింది.

విశ్వకర్మ కుమారుడైన 'నలుడు' శిల్పకళానిపుణుడు. ఉత్సాహం, శక్తి ఉన్నవాడు. సేతువు (వంతెన) ను నిర్మించడానికి అతడే యోగ్యుడని సముద్రుడు తెలిపాడు. ఆ సేతువును తాను భరిస్తానని మాటఇచ్చాడు. సేతువు నిర్మాణానికి వానర నాయకులకు ఆజ్ఞ ఇచ్చాడు శ్రీరాముడు. అందరూ మహారణ్యం దారి పట్టారు. పెద్దపెద్ద చెట్లను బండరాళ్ళను మోసుకువస్తున్నారు. సముద్రంలో పడేస్తున్నారు. వాటి దెబ్బకు సముద్రంలోని నీరు ఆకాశానికి రాకపోకలు సాగిస్తున్నది. నలుని సూచనలననుసరించి కొలతల ప్రకారం సేతువు కట్టబడుతున్నది. వందయోజనాల పొడవు, పది యోజనాల వెడల్పుగల సేతువు ఐదు రోజుల్లో నిర్మించబడ్డది.

శ్రీరామలక్ష్మణులు సుగ్రీవునితో కలసి ముందునడుస్తున్నారు. సైన్యం వారిని అనుసరిస్తున్నది. సైన్యంలో కొందరు వెనుక నడుస్తున్నారు. కొందరు సేతువు మధ్యభాగంలో, మరి కొందరు రెండు పక్కలా నడుస్తున్నారు. కొందరు సముద్రంలో దూకి ఈదుతూ వస్తూంటే మరికొందరు ఆకాశంలో ఎగిరి వస్తున్నారు. వారు చేసే కోలాహలానికి సముద్రమే మౌనం దాల్చింది. అందరూ అవతలి తీరం చేరారు.



శ్రీరాముడు యుద్ధనీతిని అనుసరించి సైన్యాన్ని వివిధ విభాగాలుగా విభజించాడు. ఎవరి బాధ్యతలను వాళ్ళకు అప్పగించాడు. రావణుని మంత్రులైన శుకసారణులు శ్రీరాముని బలం తెలుసుకోవాలని వానర రూపాలుదాల్చి వానరులలో చేరారు. విభీషణుడు వారిని గుర్తించి శ్రీరాముని ఎదుట నిలిపాడు. క్షమించాడు శ్రీరాముడు. తమ గురించి ఇంకా ఏమన్నా తెలుసుకోవాలంటే అడ్డులేదని వారికి చెప్పాడు. సీతను వెంటనే అప్పగించకపోతే తన చేతిలో చావు తప్పదని రావణునికి చెప్పవలసిందిగా సూచిస్తూ శుకసారణులను పంపించివేశాడు. వారు వెళ్ళి ఇక్కడి విషయాలన్నీ పొల్లుబోకుండా రావణునికి తెలిపారు.

రావణుడు సీత విషయంలో మరొక ఎత్తుగడ వేశాడు. అశోకవనం వెళ్ళి రాముడు తనచేతిలో హతుడైనాడని సీతతో పలికాడు. ఆమె నమ్మలేదు. మాయావియైన విద్యుజ్జిహ్వుని పిలిచాడు. అతడు శ్రీరామునిదే అనిపించే మాయాశిరస్సును, ధనుర్బాణాలను తీసుకొనివచ్చి చూపించాడు సీతకు. ఇప్పటికైనా తన్నాశ్రయించమని సీతను కోరాడు రావణుడు. సీత కుమిలిపోయింది. రావణుడు తన భవనానికి వెళ్ళిపోయాడు. విభీషణుని భార్య 'సరమ' సీతను ఊరడించింది. ఇదంతా రాక్షస మాయ అని చెప్పింది. శ్రీరాముడు క్షేమమేనని తెలిపింది.

శ్రీరామచంద్రాదులు వానరసైన్యంతో సువేల పర్వతానికి చేరుకున్నారు. ఆరాత్రి అక్కడే గడిపారు. ఎత్తైన ఆ పర్వత శిఖరం నుండి లంకానగర శోభను చూశారు. లంకలో మేడపైభాగంలో ఠీవిగా కూర్చున్న రావణుని శ్రీరాముడు చూశాడు. వానర ప్రముఖులూ చూశారు. సుగ్రీవుడు ఒక్క ఉదుటునలేచి కోపంతో ఊగిపోతున్నాడు. క్షణాలలో సువేల పర్వతం నుండి రావణ భవనంపై వాలాడు. తాను శ్రీరాముని మిత్రుడనని, తన నుండి తప్పించుకోవడం తరంకాదని లంకేశుని హెచ్చరించాడు. రావణునిపైకి దూకి అతని కిరీటాన్ని తీసి నేలకుకొట్టాడు. రెచ్చిపోయాడు రావణుడు. 'సుగ్రీవా! ఇంత వరకు నీవు నా కంటబడలేదు. లేకుంటే ఎప్పుడో హీనగ్రీవుడవు (తల తెగినవాడవు) అయ్యేవాడివి' అంటూ గర్జించాడు. ఇద్దరి మధ్యా బాహాబాహి యుద్ధం జరిగింది. సుగ్రీవుడు రావణుని ముప్పతిప్పలు పెట్టి క్షణాలలో రివ్వున ఎగిరి సువేల పర్వతంపై వాలాడు. శ్రీరాముడు సుగ్రీవుని సున్నితంగా మందలించాడు. తొందరపడి ఇలాంటి సాహసాలు చేయవద్దని సలహా ఇచ్చాడు.

రావణుని వద్దకు అంగదుని రాయబారిగా పంపాడు శ్రీరాముడు. సీతను అప్పగించకుంటే శ్రీరాముని చేతిలో మరణం తథ్యమని, లంకకు విభీషణుడు రాజుకాగలడని శ్రీరాముని వాక్యంగా రావణునికి వినిపించాడు అంగదుడు. సభ అట్టుడికిపోయింది. నలుగురు రాక్షసులు అంగదుడిపై విరుచుకుపడ్డారు. అంగదుడు వారిని తన చంకలో ఇరికించుకొని ప్రాసాదంపైకి ఎగిరాడు. అక్కడి నుండి వారిని బలంగా నేలపైకి విసిరాడు. సింహనాదం చేసి ఆకాశమార్గంలో శ్రీరాముని చేరాడు. రావణుని భావం అర్థంచేసుకున్నాడు శ్రీరాముడు. ధనుస్సుకు పని చెప్పాల్సిన సమయం ఆసన్నమైందని అర్థంచేసుకున్నాడు.

లంకపై దండయాత్ర మొదలైంది. లంకను నాలుగువైపుల నుండీ సైన్యంతో ముట్టడించాడు శ్రీరాముడు. తన భవనం మీద నుండి పరిస్థితిని గమనించాడు లంకేశుడు. దీర్ఘాలోచనలోపడ్డాడు. యుద్ధం మొదలైంది. ఇరు సైన్యాలు తీవ్రంగా పోరాడుతున్నాయి. ఆంజనేయుని చేతిలో జంబుమాలి, సుషేణుని చేతిలో విద్యున్మాలి మరణించారు. చీకటిలో ఎవరు ఎవరో (రాక్షసుడా? వానరుడా?) అడిగి తెలుసుకుని మరీ కొట్టుకుంటున్నారు.

అంగదుని చేతిలో రావణకుమారుడు ఇంద్రజిత్తు ఓడిపోయాడు. తట్టుకోలేకపోయాడు. కపట యుద్ధానికి దిగాడు. రామలక్ష్మణులను మూర్ఛపోయేట్టుచేసి నాగాస్త్రంతో బంధించాడు. వారు మరణించారని భ్రాంతిపడి రావణునివద్దకు వెళ్ళి విషయాన్ని తెలిపాడు. రావణుడు అభినందించాడు. రావణుని ఆదేశం మేరకు త్రిజట మొదలైనవారు సీతను పుష్పక విమానంపై యుద్ధ భూమికి తీసుకువెళ్ళారు. నేలపై బడిఉన్న రామలక్ష్మణులను సీత చూసింది. మరణించారని భావించి కన్నీరు కాల్వలు గట్టేలా ఏడ్చింది. పక్కనే ఉన్న త్రిజట ఓదార్పుతో కూడిన ధైర్యాన్నిచ్చింది. రామలక్ష్మణుడు బ్రతికే ఉన్నారని ఆధారాలు చూపించింది. వానరసైన్యం ప్రసన్నంగా ఉండడం ఒక కారణం. అన్నింటికీ మించి 'భర్త మరణించిన స్త్రీని పుష్పక విమానం తీసుకొనిరాదు'



అని చెప్పడంతో సీత మనసు కుదుటపడింది. గరుత్మంతుని రాకతో రామలక్ష్మణులు నాగాస్త్ర ప్రభావం నుండి విముక్తులైనారు. వానరులు 'జయజయ' ధ్వానాలు చేశారు. అవి రావణుని గుండెలో 'అప' శబ్దాన్ని జోడించుకొని ప్రతిధ్వనిస్తున్నాయి. హనుమంతుని చేతిలో ధూమ్రాక్షుడు, అకంపనుడు, అంగదుని బారినపడి వజ్రదంష్ట్రుడు, నీలునికి చిక్కి ప్రహస్తుడు యమపురిబాటపట్టారు.

రావణుని బాణశక్తికి సుగ్రీవుడు మూర్ఛపోయాడు. శ్రీరాముడు విల్లందుకున్నాడు. అన్నను వారించి లక్ష్మణుడు రావణుని ఎదిరించడానికి పూనుకున్నాడు. వానరసేనపై శరవర్షధారకురిపిస్తున్నాడు రావణుడు. ఆంజనేయుడు రావణుని ధాటికి అడ్డుకట్టవేశాడు. అరచేతితో హనుమంతుని బలంగా చరచాడు రావణుడు. చలించిపోయాడు మారుతి. క్షణంలో తేరుకున్నాడు. అరచేతితో రావణుని ఒక్క దెబ్బ వేశాడు. కంపించిపోయాడు దశగ్రీవుడు. తేరుకుని 'వానరా! భళా, నాకు శత్రువువే అయినా నీ శక్తిని మెచ్చుకుంటున్నాన'ని యుద్ధ సహృదయతను చాటాడు రావణుడు.

రావణుడు ప్రయోగించిన 'శక్తి' అనే ఆయుధం లక్ష్మణుని ఎదలో నాటుకుంది. స్పృహదప్పినాడు లక్ష్మణుడు. అతణ్ణి ఎత్తుకొని వెళ్ళాలని శతవిధాలా ప్రయత్నించి విఫలుడైనాడు రావణుడు. అంతలో ఆంజనేయుడు రావణునిపై దాడిచేశాడు. వక్షఃస్థలంపై ముష్టిఘాతంతో రావణుని కూలబడేటట్లు చేశాడు. లక్ష్మణుని శ్రీరాముని వద్దకు చేర్చాడు. హనుమ కోరిక మేరకు అతని భుజాలపై కూర్చుని రావణునితో పోరుచేశాడు శ్రీరాముడు. శ్రీరాముని పరాక్రమం ముందు రావణుని ధనుస్సు, కిరీటం దాసోహమయ్యాయి. దయతలచాడు శ్రీరాముడు. రావణునితో' నీవు యుద్ధంలో అలసిపోయావు. సేదతీర్చుకొనిరా. అప్పుడు నా బలమేమిటో తెలుస్తుంద'ని సుతిమెత్తగా చెప్పాడు.

అంతఃపురానికి తిరిగివెళ్ళి నా అవమానభారం రావణుడిని ఒక చోట కూర్చోనీయడం లేదు. కుంభకర్ణుని నిద్రలేపమన్నాడు రావణుడు. అతికష్టం మీద ఆ పని సాధ్యమయింది రాక్షసులకు. కుంభకర్ణునికి ఆరు నెలలు నిద్ర ఒకరోజు భోజనం. అందుకే 'కుంభకర్ణనిద్ర' అనేది ఒక జాతీయంగా భాషలోకి వచ్చింది. కుంభకర్ణుడు రావణుని సమీపించాడు. జరిగిందంతా చెప్పాడు రావణుడు. తెలివిగలవారు జరిగిన దానిని గూర్చి ఆలోచించరన్నాడు కుంభకర్ణుడు. తనకు సహాయపడమని కుంభకర్ణుని కోరాడు రావణుడు. 'ఆపదల పాలైన వానిని ఆదుకొనేవాడే నిజమైన మిత్రుడు. తప్పుదారి పట్టి కష్టాల్లో పడ్డవారికి చేయూతనిచ్చి ఆదుకొనేవాడే ఆప్తుడ'ని రావణుడన్నాడు. కుంభకర్ణుడు యుద్ధసన్నద్ధుడయ్యాడు.

కుంభకర్ణుడు యుద్ధంలో వానరులను చావుదెబ్బ తీస్తున్నాడు. వానరులు తట్టుకోలేక తలోదారి పట్టారు. శ్రీరాముని ఆశ్రయించారు. 'ఐంద్రాస్త్రము'తో కుంభకర్ణుని శిరస్సును ఖండించి శాశ్వత నిద్రలోకి పంపాడు శ్రీరాముడు. శ్రీరాముని బాణధాటికి కుంభకర్ణుని తల లంకలో పడిపోయింది. ఆ తల తగలడం వల్ల రాజవీథులలోని ఇంటికప్పులు, ఎత్తైన ప్రాకారాలు కూలిపోయాయి. కుంభకర్ణుని మరణవార్త రావణుని క్రుంగదీసింది.

రావణ కుమారుడైన అతికాయుడు లక్ష్మణుని బ్రహ్మాస్త్రానికి బలైనాడు. తమ్ముని, కొడుకును పోగొట్టుకొని తల్లడిల్లుతున్న రావణుని ఓదార్చాడు ఇంద్రజిత్తు. భారం తనపై వేసుకొని. యుద్ధరంగానికి వచ్చాడు. రామలక్ష్మణులపై బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. రాముని సూచనమేరకు రామునితోపాటు లక్ష్మణుడు స్పృహకోల్పోయినట్లు పడివున్నాడు. వారు మరణించారనుకున్నాడు ఇంద్రజిత్తు. తండ్రికీ వార్తను తెలిపాడు.

వానరసైన్య శిబిరంలో అలజడి మొదలైంది. విభీషణుడు ధైర్యం చెప్పాడు. రామలక్ష్మణులకు ఏమీకాలేదన్నాడు. బ్రహ్మాయందలి గౌరవంతో అస్త్రబాధను అనుభవించారని తెలిపాడు. బ్రహ్మాస్త్ర ప్రభావంతో అరవైఏడు కోట్ల మంది హతులయ్యారు. చాలామంది దెబ్బతిన్నారు. హనుమంతుడు, విభీషణుడు, జాంబవంతుని కోసం వెతుకుతున్నారు. జాంబవంతుడు కనిపించాడు. సరిగ్గా చూడలేకపోతున్నానన్నాడు. ధ్వనిని బట్టి విభీషణుని గుర్తించానన్నాడు. 'హనుమంతుడు క్షేమమేనా' అని అడిగాడు. ఆంతర్యం అంతుచిక్కలేదు విభీషణునికి. 'హనుమంతుడు జీవిస్తే వానరసైన్యం చచ్చినా బతికినట్లే లేదా హనుమ మరణిస్తే అందరం



బతికిఉన్నా చచ్చిన వారితో సమానమేనన్నాడు' జాంబవంతుడు. జాంబవంతుని ఆదేశంపై హిమాలయాలకు వెళ్ళి అక్కడ ఉన్న సర్వౌషధి మహాపర్వతమును పెల్లగించి తీసుకువచ్చాడు హనుమంతుడు. ఓషధుల వాసనకే రామలక్ష్మణుల గాయాలన్నీ మటుమాయమయ్యాయి. చనిపోయిన వానరులు మళ్ళీ లేచికూర్చున్నారు. సుగ్రీవాజ్ఞతో వానరులు లంకకు నిప్పుపెట్టారు.

శత్రుపక్షాన్ని మానసికంగా దెబ్బతీయదలచాడు ఇంద్రజిత్తు. హనుమదాది వానరవీరులు చూస్తుండగా మాయాసీతను సంహరించాడు. అందరూ నిజమేననుకున్నారు. వార్త తెలిసి శ్రీరాముడు శోకసంద్రంలో మునిగిపోయారు. ఇదంతా ఇంద్రజిత్తు మాయేనని విభీషణుడు తెలపడంతో అందరూ ఊపిరిపీల్చుకున్నారు.

శతృసంహారానికి ఇంద్రజిత్తు నికుంభిలా అభిచారహోమాన్ని తలపెట్టాడు. దానిని భంగంచేయడానికి రామానుజ్ఞతో లక్ష్మణుడు వెళ్ళాడు. ఇంద్రజిత్తు లక్షణుల మధ్య ఘోర యుద్ధం జరిగింది. 'ఐంద్రాస్త్రము'ను ప్రయోగించి ఇంద్రజిత్తు తలను నేలరాల్చాడు లక్ష్మణుడు. శ్రీరాముడు లక్ష్మణుని మెచ్చుకున్నాడు.

రావణుడు యుద్ధభూమిలో ప్రళయకాల రుద్రునిలా విజృంభిస్తున్నాడు. వానర వీరులు తట్టుకోలేక యుద్ధరంగం నుండి కాలికి బుద్ధి చెపుతున్నారు. మరొకవైపు సుగ్రీవుని చేతిలో విరూపాక్షుడు, మహోదరుడు మట్టిగరచారు.

యుద్ధం చివరి అంకానికి చేరుతున్నది. రామలక్ష్మణులతో రావణునిపోరు తీవ్రతరమవుతున్నది. రావణుడు విభీషణుని చంపడానికి బల్లెమునెత్తాడు. అది మహాశక్తివంతమైనది. విభీషణునికి ప్రాణాపాయ స్థితిని గమనించిన లక్ష్మణుడు రావణునిపై బాణాలను కుమ్మరించాడు. ఎటూ తోచక విభీషణుని చంపే ప్రయతాన్ని విరమించుకున్న రావణుడు లక్ష్మణునిపై ఆగ్రహించి 'శక్తి' అనే ఆయుధాన్ని ప్రయోగించాడు. అది గమనించిన శ్రీరాముడు 'శక్తి'ని వేడుకున్నాడు. 'నీలోని చంపేశక్తి నశించుగాక' అని. అంతే – అది ప్రాణశక్తిని కోల్పోయింది. లక్ష్మణుని ఎదపై బలంగా నాటుకుంది. నేలపై పడిపోయాడు లక్ష్మణుడు. వానరులు ఆ ఆయుధాన్ని ఎంత ప్రయత్నించినా లక్ష్మణుని ఎద నుండి తీయలేకపోయారు. రాముడు తన రెండు చేతులతో బయటికి లాగి విరచివేశాడు. ఇక ఉపేక్షించి లాభం లేదనుకున్నాడు, శ్రీరాముడు వానరులతో, ఈ లోకంలో ఇక రావణుడో? రాముడో? మిగిలి ఉండడం తథ్యం' అన్నాడు. శ్రీరాముని విలువిద్యాపాండిత్యానికి ఎదురునిలువలేక రావణుడు భయంతో పరుగులు తీశాడు.

పడిపోయిన లక్ష్మణుని చూచి విలవిలలాడిపోయాడు శ్రీరాముడు. 'ఏదేశమందైనా భార్య దొరకవచ్చు. బంధువులు దొరకవచ్చు. కాని లక్ష్మణుని వంటి తమ్ముడు దొరకడని' కన్నీరుకార్చాడు. సుషేణుడు లక్ష్మణుని పరీక్షించి చనిపోలేదని నిర్ధారించాడు. సుషేణుని సూచనమేరకు హనుమంతుడు ఓషధులు తేవడానికి వేగంగా వెళ్ళాడు. ఓషధీపర్వతాన్నే తెచ్చాడు. ఓషధీ ప్రభావంతో లక్ష్మణుడు లేచికూర్చున్నాడు. పట్టరాని ఆనందంతో శ్రీరాముడు 'లక్ష్మణా నీవు మరణించి ఉంటే నా విజయానికి అర్థమేలేదు. అప్పుడు సీతతోగాని నా ప్రాణాలతోకాని ఏం ప్రయోజనం' అన్నాడు.

ఇంద్రుడు పంపగా మాతలి దివ్యరథంతో సహా శ్రీరాముని వద్దకు వచ్చాడు. ప్రదక్షిణ పూర్వకంగా నమస్కరించి శ్రీరాముడు రథాన్ని అధిరోహించాడు. యుద్ధభూమికి సాగిందారథం. మిగతా రోజుల కన్నా భిన్నంగా ఉందీనాటి యుద్ధం. కొంతసేపు ఎవరికెవరూ తీసిపోని విధంగా విజృంభించారు. రాసురాను రామునిదే పైచేయి అవుతున్నది. రావణుని సారథి గమనించాడు. రథాన్ని పక్కకు మళ్ళించాడు. అలా చేయడం అవమానంగా భావించిన రావణుడు సారథిపై నిప్పులు చెరిగాడు. రథం మళ్ళీ రాముని ముందు నిలిచింది. యుద్ధం చూడడానికి అగస్త్యుడు దేవతలతో కూడి అక్కడకు వచ్చాడు. శ్రీరామునికి 'ఆదిత్య హృదయం' ఉపదేశించాడు. శ్రీరాముని బాణాలతాకిడికి రావణుని తలలు నేలరాలుతున్నాయి. కాని వెంటనే చిత్రంగా మళ్ళీ మొలుస్తున్నాయి.



ఆకాశానికి ఆకాశం, సముద్రునికి సముద్రమే సమానమైనట్లు రామరావణ యుద్ధానికి రామరావణ యుద్ధమే సమానమన్నట్లు సాగుతున్నది. బ్రహ్మాస్త్ర ప్రయోగం చేయవలసిందిగా 'మాతలి' శ్రీరామునకు సూచించాడు. శ్రీరాముడు బ్రహ్మాస్త్ర ప్రయోగంతో రావణాసురుని అంతమొందించాడు.

అన్నయైన రావణుని మరణానికి బాధపడ్డాడు విభీషణుడు. దహన సంస్కారాలకు అనుమతినివ్వమని శ్రీరాముని ప్రార్థించాడు. 'వ్యక్తులు జీవించివున్నంతవరకే వైరముండాలి. తరువాత దానిని వదలివేయాలి. మన కార్యం నెరవేరింది. కావలసిన సంస్కారాలను చేయమని అన్నాడు శ్రీరాముడు. 'ఇప్పుడు రావణుడు నీకెట్లో నాకూ అట్లే గౌరవాస్పదుడు' అని తన విశాల హృదయాన్ని చాటుకున్నాడు శ్రీరాముడు. రావణుని భార్య మండోదరి భర్త మరణానికి పుట్టెడు దుఃఖంలో కూరుకుపోయింది. విభీషణుడు రావణునికి ఉత్తరక్రియలను నిర్వర్తించాడు.

శ్రీరాముని ఆదేశం మేరకు లక్ష్మణుడు విభీషణుని లంకారాజుగా పట్టాభిషిక్తుని చేశాడు. సీతతో తన విజయవార్తను తెలుపమని హనుమంతుని ఆదేశించాడు శ్రీరాముడు. హనుమ వెంటనే వెళ్ళి ఈ శుభవార్తను సీతమ్మ చెవిలో వేశాడు. ఆమె ఆనందానికి అవధుల్లేవు. ఇంతకాలం చుట్టూచేరి బాధించిన రాక్షస స్త్రీలను చంపడానికి అనుమతినిమ్మన్నాడు హనుమ. తగని పని, వద్దని వారించింది సీత.

విభీషణుడు పల్లకిలో సీతాదేవిని శ్రీరాముని వద్దకు చేర్చాడు. సంతోషంతో భర్తను చేరింది సీత. స్వీకరించడానికి నిరాకరించాడు సీతాపతి. 'నా వంశ ప్రతిష్ఠ నిలుపుకోవడానికై దుష్ట రావణుని చెర నుండి నిన్ను విడిపించాను. ఇంతకాలం పరుని పంచన ఉన్నందున నీ ప్రవర్తన గురించి నాకు సందేహముంది. కనుక నీవు నీ ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళవచ్చు'నని శ్రీరాముడు అన్నాడు. శ్రీరాముని మాటలు ములుకుల్లా గుచ్చుకున్నాయి సీతకు. స్థాయికి దగినట్లుగా మాట్లాడలేదని రామునితో అన్నది. శ్రీరామునకు విశ్వాసం కలిగించడానికి 'అగ్ని ప్రవేశం' ఒక్కటే శరణ్యమని భావించింది. శ్రీరాముని మనసెరిగి లక్ష్మణుడు చితిని సిద్ధపరచాడు. సీత అగ్నిలోకి ప్రవేశించింది. అక్కడి వారంతా ఆందోళనచెందారు. అగ్నిదేవుడు స్వయంగా సీతా దేవిని తీసుకువచ్చి ఆమె గొప్పదనాన్ని వెల్లడించాడు. శ్రీరాముని స్వీకరించాల్సిందిగా కోరాడు.

సీత గురించి తనకంతా తెలుసన్నాడు శ్రీరాముడు. ఆమె శీలం యొక్క గొప్పదనాన్ని ముల్లోకాలకు చాటడానికే అగ్నిప్రవేశం చేస్తున్నా ఊరుకున్నానన్నాడు. సీతను దగ్గరకు తీసుకున్నాడు.

పరమశివుడు శ్రీరాముని ప్రశంసించాడు. దుష్టసంహారంచేసిన శ్రీరాముని ప్రజానురంజకంగా పరిపాలన చేయమన్నాడు. శ్రీరాముని కోరిక మేరకు ఇంద్రుడు మృతులైపడివున్న వానరులను మళ్లీ బతికించాడు. విభీషణుడు లంకలో కొంతకాలం ఉండవలసిందని శ్రీరాముని అభ్యర్థించాడు. భరతుని కొరకు తాను త్వరగా ప్రయాణం కావలసిందేనన్నాడు శ్రీరాముడు. వానరులను వారి స్వస్థానాలకు వెళ్ళమనిచెప్పి, విభీషణుని వీడ్కోలు అందుకున్నాడు. పుష్పకవిమానంలో అయోధ్యకు బయలుదేరాడు దారిలో ఆయా ప్రదేశాలన్నీ సీతకు చూపుతున్నాడు. భరద్వాజాశ్రమాన్ని సందర్శించారు. శ్రీరామాజ్ఞతో హనుమంతుడు శ్రీరాముడు వస్తున్న విషయాన్ని భరతునికి, గుహునికి ముందుగా వెళ్ళి తెలియజేశాడు. వారెంతో ఆనందించారు.

పుష్పక విమానంలో నందిగ్రామం చేరుకున్న సీతారామలక్ష్మణులకు భరతుడు, ప్రముఖులు ఘనంగా స్వాగతం పలికారు. సీతారామలక్ష్మణులు కౌసల్య, సుమిత్ర, కైకేయి, వశిష్ఠుల పాదాలకు ప్రణామాలు అర్పించారు. భరతుడు శ్రీరాముని చరణాలకు పాదుకలను తొడిగాడు. భరతుని ప్రేమతో అక్కున జేర్చుకున్నాడు శ్రీరాముడు.

అంగరంగవైభవంగా శ్రీరామ పట్టాభిషేకమహోత్సవం జరిగింది. యువరాజుగా ఉండాల్సిందిగా శ్రీరాముడు లక్ష్మణుని కోరాడు కాని అతడు ఎంత మాత్రం ఒప్పుకోలేదు. భరతుని యువరాజుగా చేశాడు. యజ్ఞయాగాది క్రతువులను నిర్విఘ్నంగా కొనసాగిస్తున్నాడు శ్రీరాముడు. ప్రజలను కన్నబిడ్డలవలే చూసుకుంటున్నాడు. ఎలాంటి ఈతి బాధలు లేవు. అందరూ ధర్మబద్ధంగా నడచుకొంటున్నారు. ఇలా పదకొండువేల సంవత్సరాలు ప్రజానురంజకంగా పరిపాలించాడు శ్రీరాముడు. అందుకే 'రామరాజ్యం' అన్న మాట నేటికీ ఆదర్శమై నిలచింది.



## ఉపవాచకం

# మహాభారతం

*(సంక్షిప్తం)*

(మహర్షి వేదవ్యాస మహాభారతం ఆధారంగా)



# 1

భారతీయుల ప్రాచీన ఇతిహాసాలు రామాయణ భారతాలు. ప్రతి భారతీయుడూ ఈ ఇతిహాసాలను తెలుసుకొని ఉండటం అవసరం. మొదట ఇవి ఆశురూపంలో ఉండటం వలన అనేక రకాలైన మార్పులు చేర్పులూ చెందుతూ వచ్చాయి. ఈ కథలు మొదట సంస్కృతంలో రచింపబడి, లక్షాఇరవైఅయిదువేల శ్లోకాలతో కల్గిన బృహత్కావ్యం మహాభారతం. అందుకే మహాభారత మూలకథను విద్యార్థులు తెలుసుకొని ఉండటం అవసరం. తర్వాత ప్రపంచంలోని అనేక భాషల్లోకి అనువదింపబడ్డాయి.

భారతంలో ఉన్న కథ, సంఘటనలు, పాత్రలు, ధర్మసూక్ష్మాలు ఆ కథను జగద్విఖ్యాతం చేశాయి. అందుకే భారతం ధర్మశాస్త్రంగా, బహుపురాణాల కలయికలా, వేదాంతంగా, నీతిశాస్త్రంగా, మహాకావ్యంగా, సర్వలక్షణ సంగ్రహంగా, గొప్పకథగా పేరెన్నికగన్నది. ఇది ద్వాపర యుగం చివరి రోజుల్లో జరిగినకథ. 'భారతంలో లేనిది ప్రపంచంలో ఎక్కడాలేదు. ప్రపంచంలో ఉన్నదంతా భారతంలో ఉన్నది. ధర్మార్థకామమోక్ష సంబంధమైన ఏ సందేహానికైనా మహాభారతంలో సమాధానం దొరుకుతుందని ప్రతీతి.

మహాభారతంలోని ప్రధాన కథ పాండవులు – కౌరవులకు సంబంధించింది. కొన్ని తరాలు ముందుకువెళ్ళి వాళ్ళ వంశక్రమం తెలుసుకుంటూ, కనీసం తాతలనాటి కథాక్రమం చదువుకొందాం.

## 1. ఆదిపర్వం

అజామీఢుడనే రాజుకు గల కుమారుల్లో ముఖ్యుడు సంవరణుడు; అతని కొడుకు కురువు; కురువు తనయుడు విదూరథుడు; విదూరథుని పుత్రుడు అనశ్వుడు; అనశ్వుని సుతుడు పరీక్షిత్తు; పరీక్షిత్తుని కొడుకు భీమసేనుడు; భీమసేనుని కుమారుడు ప్రతిశ్రవుడు; ప్రతిశ్రవుని నందనుడు ప్రతీపుడు; ప్రతీపునికి ముగ్గురు తనయులు. వాళ్ళు దేవాపి, శంతనుడు, బాహ్లికుడు. దేవాపి బాల్యంలోనే తపస్సు చేయడానికి వెళ్ళడంతో రెండవ కుమారుడైన శంతనుడు రాజయ్యాడు.

శంతనుడు ఎంతో గొప్పవాడు. మహాబలపరాక్రమవంతుడు. ప్రజలను కన్నబిడ్డల్లా పాలించేవాడు. ఒక రోజు వేటకోసం అడవికి వెళ్ళిన శంతనుడు వేటాడి అలసిపోయి గంగాతీరం చేరుకున్నాడు. అక్కడొక అపురూపలావణ్యవతి, అతిలోక సుందరి అయిన దివ్యాంగన కనిపించింది. ఆమెను చూసిన శంతనుడు దాహం విషయం కూడా మరచిపోయి, "నేను భరత రాజ్యాన్ని, పాలించే రాజును. హస్తినాపురం మా పట్టణం. నిన్ను అర్థాంగిగా స్వీకరించాలనుకుంటున్నాను. దయచేసి కాదనకు" అన్నాడు.

అందుకు ఆమె, "మహారాజా! మీకు భార్యను కావడానికి నాకూ ఇష్టమే. నా పేరు గంగ. కాని, నా చర్యలను కాదనకూడదు. అట్లా కాదన్న మరుక్షణం నేను వెళ్ళిపోతాను" అన్నది.

శంతనుడందుకు అంగీకరించి ఆమెను వివాహం చేసుకున్నాడు. వాళ్ళు ఎంతో అన్యోన్యంగా జీవించారు. గంగకు ఒక కుమారుడు జన్మించాడు. కొడుకు పుట్టిన వెంటనే ఆమె ఆ బాలుడ్ని గంగా ప్రవాహంలో వదిలిపెట్టింది. శంతనుడు ఆశ్చర్యపోయాడు, బాధపడ్డాడు. కాని ఇచ్చిన మాట ప్రకారం ఆమె చర్యలను అడ్డుకోలేదు. తర్వాత రెండో సంతానం కలిగింది. ఈ సారీ మగబిడ్డే. గంగ అతడ్ని కూడా ప్రవాహంలో వదిలింది. మూడు, నాలుగు, ఐదు... అట్లా ఏడురుగు కుమారులనూ గంగా నదిలో వదిలింది. ఎనిమిదో సంతానం కూడా మగపిల్లవాడే. అతణ్ణి కూడా పుట్టగానే ప్రవాహంలో వదిలేందుకు ఉద్యుక్తురాలయ్యింది ఆమె.

"ఆగు! అసలు నీవెవరు? ఎందుకు నా జీవితంలోకి ప్రవేశించావు? ఇంత అందమైన నీలో కన్నబిడ్డలను చంపుకునే కఠిన హృదయం ఎందుకున్నది? ఈ ఎనిమిదవ సంతానాన్నైనా చంపకుండా వదిలిపెట్టు. వాణ్ణి నాకిచ్చేసెయ్" అన్నాడు గంగను



అడ్డుకుంటూ శంతనుడు.

"మహారాజా! నేను స్వర్గలోకవాసిని, నా పేరు గంగ. శాపవశాన మానవాకారంలో ఇక్కడ జన్మించాను. నాకు పుట్టిన కుమారులందరు కూడా వశిష్ఠుని శాపం పొందినవాళ్ళే. పుట్టగానే వాళ్ళను నీళ్ళలో వదిలి మోక్షం కలిగించుమని వాళ్ళు కోరడం వల్లనే నేనాపని చేశాను" అన్నది గంగ.

మాటలు రాక నిలబడిపోయిన శంతనుడితో ఇంకా ఇలా అన్నది గంగ – "నీవు ఆడిన మాట తప్పి, నాపనిని అడ్డుకున్నావు కాబట్టి నేనిక్కడ ఉండలేను" అంటూ కుమారునితో సహా అదృశ్యమైపోయింది గంగ.

ఇంద్రియనిగ్రహం, దానం, క్షమ, జ్ఞానం, ధైర్యం, దయ, బుద్ధి, పరాక్రమం కలిగిన మేధావి శంతనుడు. జరిగిన దానికి చింతిస్తూ కాలం వృథా చేయక మనసును పరిపాలనలో నిలిపి, మళ్ళీ పెళ్ళి చేసుకోకుండా జీవనం సాగించాడు. సుమారు ముప్పైయ్యేళ్ళు గడిచింతర్వాత ఒకరోజు గంగా తీరంలో విహరిస్తూ, ఒక అద్భుతమైన దృశ్యం చూశాడు. అక్కడ ఆజానుబాహువు, అత్యంత సుందరుడు ఐన ఒక యువకుడు అస్త్రవిన్యాసం చేస్తూ, తన బాణాలతో గంగా ప్రవాహాన్ని అడ్డుకుంటున్నాడు. అంతలో అక్కడొక దివ్యస్త్రీ కనిపించి, "రండి మహారాజా! మీకోసమే ఎదురుచూస్తున్నాను" అన్నది శంతనుడ్ని మరింత ఆశ్చర్యచకితుడ్ని చేస్తూ.

శంతనుడికి ఆమె మాటలు అర్థం కాలేదు. ఆమెను ఎక్కడో చూసినట్లు గుర్తొచ్చింది. ఎవరో వెంటనే స్ఫురణకు రాలేదు. అతని అనుమానాలను పటాపంచెలు చేస్తూ ఆమె తన మాటల్ని కొనసాగించింది– "శంతన మహారాజా! నేను గంగను. ముప్పై సంవత్సరాల క్రితం ఒక కుమారుడ్ని తీసుకొని వెళ్ళాను కదా! ఆ కుమారుడే ఈ మహావీరుడు. పేరు దేవవ్రతుడు" అన్నది.

"కలిసొచ్చేకాలానికి నడిచొచ్చేకొడుకును చూసి పొంగిపోయాడు శంతనుడు. దేవవ్రతుడు తండ్రికి పాదాభివందనం చేశాడు. కొడుకును అక్కున జేర్చుకొని పులకితగాత్రుడై పుత్రగాత్రపరిష్వంగ సౌఖ్యాన్ని అనుభవిస్తూ ఆనంద బాష్పాలు రాల్చాడు. గంగనూ, దేవవ్రతుణ్ణీ తనతోపాటు రాజ్యానికి రమ్మన్నాడు. గంగ అందుకు ఒప్పుకోలేదు. "నా శాపం తీరింది. ఈ కుమారుణ్ణి నీ కప్పగించడంతో బాధ్యత కూడా పూర్తయ్యింది. ఇతణ్ణి తీసుకొని వెళ్ళు" అంటూ శంతనుని జవాబుకోసం ఎదురు చూడకుండా స్వర్గంవైపు సాగిపోయింది.

దేవవ్రతుడు సామాన్యుడు కాదు. వశిష్ఠ మహర్షివద్ద వేదాలను అధ్యయనం చేశాడు; శుక్రాచార్యునివద్ద, బృహస్పతివద్ద ధర్మనీతి శాస్త్రాలు చదువుకున్నాడు; పరశురాముని దగ్గర శస్త్రాస్త్రవిద్యలన్నీ నేర్చుకున్నాడు. శాస్త్ర పారంగతుడు, వీరుడు, యుద్ధ నిపుణుడు, సుందరుడు, ధీరగంభీరుడైన దేవవ్రతుడ్ని చూసి హస్తినాపుర ప్రజలంతా ఆనందపరవశులైనారు. ఒక శుభముహూర్తాన శంతనుడు దేవవ్రతునికి యౌవరాజ్య పట్టాభిషేకం చేశాడు. అయితే కథ అనుకోని మలుపు తిరిగింది ఇక్కడే.

ఉత్తముడైన కొడుకు రాజ్యానికి వచ్చినంతర్వాత శంతనుడికి ఎంతో మనశ్శాంతి కలిగింది. అతడు మళ్లీ నిండు యవ్వనుడైనట్లు జవసత్వాలతో విహరించసాగాడు. ఈ నేపథ్యంలో ఒక రోజు యమునా తీరానికి వేటకు వెళ్ళాడు. నదీ తీరారణ్యంలో విహరిస్తూండగా దివ్యమైన పరిమళం అతని ముక్కుపుటాలను తాకింది. ఆ పరిమళానికి వశుడై, ఆ దిక్కును వెతుక్కుంటూ వెళ్ళిన శంతనుడు ఒక జనపదాన్ని (పల్లెను) చేరుకున్నాడు. అక్కడొక అసమాన సౌందర్యవతి అతనికి కనిపించింది. ఆమె ఆ ఆటవిక రాజ్యానికి నాయకుడైన దాశరాజు పెంపుడు కూతురు – సత్యవతి. ఆమెను తనకిచ్చి వివాహం జరిపించమని అడిగాడు శంతనుడు.

తన కూతురు అభిప్రాయం తెలుసుకున్నాడు దాశరాజు. "మహారాజా! నా బిడ్డకూడా నిన్ను ఇష్టపడుతున్నది. మీ అంతటి చక్రవర్తికి భార్యగావడం ఆమె అదృష్టం; వియ్యమందడం నా భాగ్యం. కాని, మీరొక్క ప్రతిజ్ఞ చేయాలి. నా కూతురుకు పుట్టిన కొడుకునే మీ తదనంతరం రాజ్యాభిషిక్తుడ్ని చేయాలి" అన్నాడు. దేవవ్రతుణ్ణి కాదని, ఇంకొకరిని హస్తినకు రాజుగా చేయడం శంతనునికి నచ్చలేదు. మనసు చంపుకొని రాజధానికి తిరిగి వెళ్ళిపోయాడు.



రాజ్యానికి చేరుకున్న శంతనుడి మనసు మనసులో లేకుండా పోయింది. వేళకు తినడు; నిద్ర సరిగ్గా లేదు; రాచకార్యాలల్లో పాలుపంచుకోడు; ఇష్టాగోష్ఠులులేవు; కొడుకుతోనూ మునుపటిలా సంతోషంగా మాట్లాడటం లేదు. దేవవ్రతుడు భిషగ్వరులను సంప్రదించాడు. జ్యోతిష్యులనడిగాడు –ఎవరి ప్రయత్నమూ సత్ఫలితాన్నివ్వలేదు. రోగానికైతే మందుంటుందిగానీ, మనోవ్యాధికి మందెక్కడుంది? చివరకు కుశాగ్రబుద్ధి ఐన దేవవ్రతుడు మంత్రి మీద ఒత్తిడి తెచ్చి, అసలు సంగతి తెలుసుకున్నాడు. సామంతరాజుల్లో పెద్దవాళ్ళను కొంతమందిని వెంటబెట్టుకొని దాశరాజు వద్దకు వెళ్ళాడు.

దాశరాజు దేవవ్రతుడ్ని సాదరంగా ఆహ్వానించి, సముచిత రీతిలో సత్కరించాడు. తర్వాత దేవవ్రతుడు తన తండ్రికి సత్యవతితో వివాహం జరిపించమని దాశరాజును అర్థించాడు. “నీ అంతటి బలవంతుడైన పుత్రుడుండగా నా బిడ్డకు కలిగే సంతానానికి రాజ్యం దక్కడం కల్ల. అందుకే నేను ఆమె వివాహానికి అడ్డు చెప్పక తప్పలేదు” అంటూ నర్మగర్భంగా తన మనసులోని మాటను చెప్పాడు దాశరాజు.

అందుకు దేవవ్రతుడు “మీకా అనుమానం అవసరంలేదు. నేను రాజ్యాభిషేకం చేసుకోను. సత్యవతీమాత కుమారులకే రాజ్యాధికారం దక్కుతుందని ఇంతమంది పెద్దలముందు మాట ఇస్తున్నాను” అన్నాడు. దాశరాజు తృప్తిపడలేదు. “నీవంటే ఉత్తముడవు. కాని, నీ కుమారులు నిన్ననుసరిస్తారన్న నమ్మకం లేదు కదా!” అన్నాడు.

ఒక్క క్షణం ఆలోచించిన దేవవ్రతుడు – అందరూ వినేటట్లు ఒక భీషణమైన ప్రతిజ్ఞ చేశాడు. “ఎంతటి తప్పని పరిస్థితులేర్పడినా నేను రాజ్యపరిపాలన చేయను. వివాహం చేసుకోను. ఆజన్మ బ్రహ్మచారిగానే ఉండిపోతాను” అని.

తండ్రి కోసం, తండ్రి సుఖం కోసం ఆవిధంగా తన సమస్తాన్ని త్యాగం చేయడానికి సిద్ధపడిన దేవవ్రతుని నిర్ణయానికి పెద్దలందరూ ఆశ్చర్యపోయారు. దేవతలు ‘ఇంతటి త్యాగబుద్ధి కల్గిన ఈ మహనీయుడు మానవోత్తముడు” అంటూ పూలవాన కురిపించారు. అప్పుడు లోకాలన్నీ అతని భీషణమైన నిర్ణయాన్ని చూసి ‘భీష్ముడు’ అని గౌరవించాయి. అప్పటి నుండీ దేవవ్రతుడు భీష్ముడు అయ్యాడు. శంతనుడు కొడుకు త్యాగబుద్ధికి చలించిపోయాడు. ‘స్వచ్ఛంద మరణ శక్తి’ని అతనికి అనుగ్రహించాడు. అంటే భీష్ముడు తాను కోరుకున్నంత కాలం జీవిస్తాడు. తనంత తాను కోరుకుంటేనేగానీ మరణం అతని దరిజేరదు.

## 2

శంతనునికి సత్యవతి వల్ల ఇద్దరు కుమారులు కలిగారు. వాళ్ళు చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు. చిత్రాంగదుడు తనను మించిన బలవంతుడు లేడన్న గర్వంతో విర్రవీగేవాడు. తండ్రి తర్వాత అతనికే పట్టాభిషేకం చేశాడు భీష్ముడు. కాని బల గర్వితుడైన చిత్రాంగుడు గంధర్వులతో యుద్ధం చేసి చనిపోయాడు. భీష్ముడు విచిత్రవీర్యుడిని రాజును చేశాడు. కాశీరాజు కుమార్తెలు ముగ్గురూ అతిలోక సౌందర్యవతులని తెలిసి, స్వయంవరానికివెళ్ళి, అంబ, అంబిక, అంబాలిక అనే ఆ ముగ్గురిని తెచ్చి విచిత్రవీర్యునికి వివాహం చేయబోయాడు. అప్పుడు అంబ తాను అంతకు ముందే సాళ్వరాజును వరించానని, స్వయంవరంలో అతణ్ణే పతిగా పొందాలనుకున్నా’నని చెప్పింది. పెద్దలతో ఆలోచించి, అంబను ఆమె ఇష్టానుసారం వెళ్ళడానికి అనుమతించి, అంబికను, అంబాలికను తమ్మునికిచ్చి పెళ్ళి చేశాడు భీష్ముడు. కాని కొంతకాలానికే విచిత్రవీర్యుడు క్షయవ్యాధిగ్రస్తుడై పరలోకం చేరుకున్నాడు. పరిస్థితి మళ్ళీ మొదటికొచ్చింది.

సత్యవతి ఆలోచనలో పడింది. తాను కోరుకున్నట్లే తన కుమారులకు రాజ్యాధికారం దక్కింది కాని, భాగ్యహీనులైన కొడుకులు అది పూర్తిగా అనుభవించలేకపోగా వారసులు కూడా లేకుండా రాజ్యాన్ని దిక్కుమాలినదాన్ని చేసి జీవితాలను చాలించారు. అందుకే భీష్ముణ్ణి వివాహం చేసుకొమ్మని, రాచరికాన్ని నెరపుమని కోరింది. కాని భీష్ముడు ఎంతమాత్రం ఒప్పుకోలేదు. భరతకులం



సత్యం, ధర్మం, శాంతి, అహింస అనే మార్గాలకు ప్రతీక అని, ఏది ఏమైనా తాను ఆ రెండు పనులూ చేయలేనని అన్నాడు. అప్పుడు పెద్దలతో ఆలోచించి, వ్యాసుడిని పిలిపించి, అతడ్ని అంబిక, అంబాలికలకు సంతానం కలిగేటట్లు వరమీయమని ప్రార్థించారు. (వ్యాసుడు పూర్వం సత్యవతి కుమారుడే) అయితే అంబిక, అంబాలికలు వ్యాసుని రూపం చూసి అసహ్యించుకున్నారు. తప్పనిసరై, వంశాన్ని నిలబెట్టడానికి అతనితో సంతానాన్ని పొందారు. తత్ఫలితంగా అంబికకు గుడ్డివాడైన ధృతరాష్ట్రుడు. అంబాలికకు పాలిపోయిన దేహంతో పాండురాజూ జన్మించారు. అంబిక ప్రేరణతో ఆమె దాసి ఆ మహనీయుని వలన కుశాగ్రబుద్ధియైన విదురుడ్ని పొందింది.

ధృతరాష్ట్రుడు, పాండురాజు, విదురుడు పెరిగి పెద్దవాళ్ళయ్యారు. ధృతరాష్ట్రునికి రాజ్యపట్టాభిషేకం చేసి, పాండురాజును, విదురుణ్ణి అతనికి సహాయపడేట్లు నియమించాడు భీష్ముడు. మహాబలవంతుడైన పాండురాజు, గొప్ప నీతిశాస్త్రజ్ఞుడైన విదురుడు తమ తమ విధులు సమర్థంగా నిర్వర్తిస్తూ కురువంశకీర్తిని, హస్తినా పురశోభను ఇనుమడింపజేస్తున్నారు. భీష్ముడు ధృతరాష్ట్రునికి గాంధారరాజు సుబలుని కుమార్తె గాంధారితో వివాహం జరిపించాడు. భర్త అంధుడైనందున గాంధారి కూడా జీవితాంతం కళ్ళకు గుడ్డకట్టుకొని గడపటానికి నిర్ణయించుకున్నది. గాంధారి వెంట అతని తమ్ముడు శకుని కూడా తోడుగా వచ్చాడు హస్తినకు – పాండురాజుకు కుంతీభోజుని దత్తపుత్రిక (వసుదేవుని సోదరి) యైన పృథతో వివాహం చేశాడు. పృథకే 'కుంతి' అనే పేరు కూడా ఉన్నది. అట్లే మద్రరాజ్యాధిపతి శల్యుడు తన సోదరి మాద్రిని పాండురాజుకిచ్చి పెళ్ళి చేశాడు. తర్వాత పాండురాజు రాజ్యవిస్తరణ కోసం జైత్రయాత్ర చేశాడు. మగధ, విదేహ, కాశీ, శుంభ, పుండ్ర తదితర రాజ్యాలను గెలిచి రాజ్యాన్ని సువిశాలం, సుదృఢం చేశాడు. విదేహరాజ్యం నుంచి దేవకమహారాజు దాసి కూతురును తెచ్చి, తమ్ముడు విదురునికీ వివాహం జరిపించాడు.

వ్యాసమహర్షి హస్తినకు వచ్చినప్పుడు గాంధారి తన భర్తవంటి బలవంతులైన వందమంది కుమారులు కావాలని కోరింది. 'నీ కోరిక నెరవేరుతుంద'దని ఆశీర్వదించాడు వ్యాసుడు. పాండురాజుకు యుద్ధం, వేట ఇష్టమైన వ్యాపకాలు. ఒకరోజు తన భార్యలిద్దరితో వేటకు బయలుదేరాడు. అడవిలో కిందముడనే ముని, తన భార్యతో మృగరూపంలో సంచరిస్తూండగా ఆ రెండు లేళ్ళనూ తన బాణాలతో సంహరించాడు పాండురాజు. కిందముడు చనిపోతూ నిజరూపం పొంది, "భార్యను తాకితే నీవు కూడా చనిపోతా"వని శపించాడు.

ఈ శాపం కారణంగా పాండురాజులో వైరాగ్యం చోటు చేసుకున్నది. కిందమ దంపతులను చంపినందుకు ఎంతగానో పశ్చాత్తాపం చెందాడు. తాను సన్యాసం తీసుకొని ఇటునుంచి ఇటే వెళ్ళిపోతానని, భార్యలను రాజధానికి వెళ్ళమన్నాడు. కాని భార్యలందుకు ఒప్పుకోలేదు. 'మీలాగే మేమూ సన్యాస నియమాలు పాటిస్తాం. ముగ్గురమూ ఆ విధంగా వానప్రస్థాశ్రమ జీవనం గడుపుదాం' అన్నారు. (వాన ప్రస్థాశ్రమం అంటే వృద్ధాప్యంలో సాంసారిక బంధాలను వదిలి, కందమూలాలు భుజిస్తూ, భగవంతుని గురించి ధ్యానం చేస్తూ భార్యాభర్తలు సాగించే జీవనం) పాండురాజు అందుకు సమ్మతించి, ధన, కనక, వస్తువాహనాలన్నీ పరివారంతో హస్తినకు పంపుతూ, తమ నిర్ణయాన్ని మహారాజు ధృతరాష్ట్రునికి, భీష్మాది పెద్దలకూ తెలియజేయమన్నాడు. ఆ విషయం తెలుసుకొని అంతా దుఃఖించారు.

భార్యలిద్దరితో కలిసి పర్వతాలన్నీ దాటుకుంటూ వెళ్ళి, చివరకు గంధమాదన పర్వతం చేరుకున్నాడు పాండురాజు. అక్కడ కొన్నాళ్ళుండి, ఆ తర్వాత ఋషులకు నిలయమైన శతశృంగ పర్వతానికి చేరుకున్నారు. అక్కడి నుండి చాలా మంది ఋషులు బ్రహ్మలోకం వెళ్తుంటే తానూ వస్తానన్నాడు పాండురాజు. అప్పుడా ఋషులు – పితృ, దేవ, ఋషి, మనుష్య ఋణాలు తీర్చుకున్నవారే బ్రహ్మలోక ప్రవేశానికి అర్హులు. మీకు సంతానయోగం ఉన్నది. మీ భార్యలు తప్పక పుత్రులను కంటారు. ఆ తర్వాతనే ఊర్ధ్వలోక ప్రవేశానికి ప్రయత్నం చేయండి" అని ఆశీర్వదించారు – పాండురాజు ఈ విషయం కుంతీదేవి వద్ద ప్రస్తావించాడు.



కుంతీదేవి, తాను కన్నెగా ఉన్నప్పుడు దుర్వాస మహామునిని సేవలతో సంతోషపెట్టగా ఆయన మంత్రాన్ని ఉపదేశించాడని, దానివల్ల కోరకున్న దేవతల ద్వారా సంతానం కలుగుతుందని చెప్పింది. పాండురాజు పరమానంద భరితుడై, దేవతలలో ముందుగా యమధర్మరాజును ఆవాహన చేసుకొమ్మన్నాడు. అతనివల్ల ధర్మవంతుడైన కుమారుడు కల్గుతాడని అన్నాడు. కుంతి యమధర్మరాజును ప్రార్థించింది. అతడు శౌర్యవంతుడు, ధర్మచింతనుడైన కొడుకును ప్రసాదించాడు. అతనికి యుధిష్ఠిరుడనే పేరు పెట్టుకున్నారు. ఈ విషయం హస్తినలో తెలిసింది. అప్పటికే వ్యాసుని వరం పొందిన గాంధారి గర్భం ధరించి రెండేంళ్ళైంది. సంతానం మాత్రం కలుగలేదు. తనకంటె ముందు తన తోటికోడలు సంతానాన్ని కనడం ఆమెకు దుస్సహమైంది. బాధతో గర్భవిచ్ఛేదనం చేసుకున్నది. ఇనుపగుండు లాంటి పిండం బయటపడింది. ఈ విషయం తెలుసుకున్న వ్యాసుడు ఆమెను ఓదార్చి, "ఈ పిండాన్ని నూటా ఒక్క కుండల్లో భద్రపరచండి! మీ కోరిక నెరవేరుతుంది" అన్నాడు. వ్యాసుడు చెప్పినట్లే చల్లని నీళ్ళు చిలకరించడంతో ఆ పిండం నూటొక్క ముక్కలుగా విడిపోయింది. రెండేళ్ళ తర్వాత వాటిలో నుండి దుర్యోధనుడు, దుశ్శాసనుడు, దుస్సహుడు, దుశ్శలుడు, జలసంధుడు, సముడు, సహుడు, విందుడు, అనువిందుడు, దుర్ధర్షుడు, సుబాహుడు మొదలుగాగల నూరుగురు కొడుకులు, 'దుస్సల' అనే కూతురూ జన్మించింది.

అక్కడ శతశృంగ పర్వతం మీద పాండురాజు ప్రోత్సాహంతో కుంతి వాయుదేవుడ్ని ప్రార్థించి మహా బలవంతుడైన భీముడిని కన్నది. భీముడెంతటి బలవంతుడంటే పసివాడుగా ఉన్నప్పుడే తల్లి ఒడి నుండి జారి బండమీద పడితే బండ భళ్ళున బద్దలైపోయిందిగాని, అతడు ఉక్కుగుండులా చెక్కు చెదర లేదు. తర్వాత ఇంద్రుని మంత్రబద్ధుడ్నిచేసి అర్జునుడిని కన్నది. మాద్రి తాను కూడా సంతానవతినవుతానని, మంత్రఫలం తనకూ దక్కేటట్లుగా అనుగ్రహించుమని కుంతిని కోరింది. కుంతి ఇచ్చిన మంత్రశక్తితో అశ్వినీ దేవతలను ప్రార్థించి కవల పిల్లలను కన్నది. వాళ్ళకు నకులుడు, సహదేవుడని నామకరణం చేశారు. తర్వాత ఒకరోజు ఏకాంతంగా ఉన్న మాద్రిని చూసి ఆమెను తాకబోయాడు పాండురాజు. తాకిన మరుక్షణం కిందముని శాపం కారణంగా ప్రాణాలు కోల్పోయాడు. బిడ్డల బాధ్యతను అక్కకు అప్పగించి, భర్తతోపాటు 'సహగమనం' చేసింది మాద్రి.

అక్కడి ఋషులు కుంతిని, పాండునందనులను వెంటతీసుకొని మాద్రి, పాండురాజుల అస్థికలతో హస్తినకు చేరుకొని, జరిగిన సంగతంతా వివరించారు. విషయం తెలుసుకొని ధృతరాష్ట్రాదులు ఎంతగానో దుఃఖించి, తగు రీతి శ్రాద్ధ కర్మలు నిర్వహించారు. సత్యవతి ఎంతగానో రోదించసాగింది. అప్పుడు వ్యాసుడు, 'దుర్యోధనాదులవలన మరిన్ని తీవ్ర పరిణామాలేర్పడతాయి. అప్పుడు నీవింకా తట్టుకోలేవు. కాబట్టి ఇప్పుడే తపస్సుతో జీవనం పావనం గావించుకో' అని సాంత్వన పరిచాడు. సత్యవతి భీష్మాదుల అనుమతితో అంబిక, అంబాలికలతో కలిసి అడవికి వెళ్ళి తపశ్చర్యతో అనతి కాలంలోనే స్వర్గప్రాప్తినొందారు.

## 3

కౌరవులు, పాండవులు హస్తినాపురంలో కలిసి మెలిసి జీవిస్తున్నారు. అందరిలోకీ బలవంతుడు భీమసేనుడు; అందరిలోకీ దుర్మార్గుడుగా పేరుతెచ్చుకున్నవాడు దుర్యోధనుడు. సహజబలవంతుడైన భీముడు తన అన్నదమ్ములను ఆటపట్టించేవాడు. ఒక్కొక్కసారి పదిమందినీ పిట్టల్ని పట్టినట్లు చంకల్లో ఇరికించుకొని తీసుకొనిపోయేవాడు; నీళ్ళల్లో ముంచేవాడు; జుట్లుపట్టుకొని లాక్కుపోయేవాడు. ఆటలాడేటప్పుడు ఎంతమంది ఆపాలని చూసినా ఆపలేకపోయేవాళ్ళు. ఇవన్నీ భీముడు నవ్వులాటకోసమే చేసేవాడు కాని, అతనికి ఎవ్వరి మీదా ద్వేషం లేదు. అయితే దుర్యోధనుడు మాత్రం ప్రతి చర్యనూ ద్వేషబుద్ధితో, పగతో పరిశీలించేవాడు. భీముని కారణంగా అతడిలో పాండవులందరిమీదా పగ, ప్రతీకారం రగుల్కున్నాయి. ఏ మాత్రం అవకాశం దొరికినా భీముడ్ని చంపివేయ్యాలని, పాండవులను హస్తిన నుండి తరిమివెయ్యాలనీ అనుకుంటూండేవాడు. నిజంగానే ఒకరోజు



అతనికి అటువంటి అవకాశం 'ఉదకక్రీడనం' రూపంలో వచ్చింది.

కౌరవ పాండవులు శకుని మొదలైన వారిని వెంటబెట్టుకొని, గంగాతీరంలోని ప్రమాణకోటి అనే స్థలానికి 'ఉదకక్రీడనం' ఆడడానికి వెళ్ళారు. దుర్యోధనుడు ముందుగానే అక్కడ చేసే భోజ్యపదార్థాల్లో భీమునికోసం తినడానికి వేరే ఏర్పాట్లు చేయించి, అందులో విషం కలిపించాడు. ఉదకక్రీడనం (నీళ్ళలో ఆడటం)లో బాగా అలసిపోయిన వాళ్ళంతా చక్కగా భోజనాలు చేశారు. భీమునికి దుర్యోధనుడే దగ్గరుండి కొసరికొసరి తినిపించాడు. అది చూసి ధర్మరాజు, తమ్ముడు దుర్యోధనునిలో పరివర్తన కల్గిందని సంతోషించాడు కాని అది కపటప్రేమ అని నమ్మలేకపోయాడు. బాగా తిన్న తర్వాత ఎవరికి వాళ్ళు తమకు కేటాయించిన స్థలాల్లో అలసిపోయి దీర్ఘ నిద్రల్లోకి జారుకున్నారు. అదే అదనుగా దుర్యోధనుడు తన తమ్ముళ్ళతో కలిసి, భీముడ్ని పెద్ద పెద్ద తీగలతో బంధించి, ఎత్తైన ఒడ్డు నుంచి గంగలోకి విసిరేశాడు. ఆ తర్వాత ఏమీ ఎరుగనట్లు భీముడు కనిపించడం లేదని బాధపడుతూ అందరితోపాటు వెతికాడు. అతడు ముందే వెళ్ళిపోయుండవచ్చునని అందరూ నిర్ధారణకు వచ్చి హస్తినకు చేరుకున్నారు. భీముడు తప్పిపోయిన సంగతి తెలిసి అందరూ కలత చెందారు – దుర్యోధనాదులు తప్ప.

గంగలో విసిరివేయబడ్డ భీముడు నాగలోకం చేరుకున్నాడు. అక్కడ భయంకరమైన పాములు కాటేయడం వల్ల తిన్న ఆహారంలోని విషమంతా విరుగుడైంది. నాగలోక నాయకుడైన వాసుకి, ఆర్యకుడు భీముని వివరాలు తెలుసుకొని, అతడు తమ చుట్టమేనని గ్రహించి, ఎనిమిది పాత్రల నిండుగా ఉన్న రసం త్రాగించారు. దాని వల్ల అతనికి వెయ్యేనుగుల బలం వచ్చింది. తర్వాత అతడ్ని ప్రమాణకోటివద్ద వదిలేశారు. ఎనిమిదో రోజున దర్జాగా ఇల్లు చేరుకున్న భీముడ్ని చూసి అందరూ ఆశ్చర్యానందమగ్నులయ్యారు. దుర్యోధనుడు మాత్రం 'తానొకటి తలస్తే, దైవమొకటి తలచిందికదా' అంటూ తీవ్ర విచారమగ్నుడయ్యాడు. దుర్యోధనుని కుట్ర గురించి తెలిసినా, ఆ విషయంలో గొడవ పెట్టుకోరాదని, సహనం వహించమని విదురుడు కుంతిని, ధర్మరాజునూ కోరాడు.

భీష్ముడు కౌరవ పాండవులకు ధనుర్విద్య నేర్పించవలసిన సమయమాసన్నమైందని గ్రహించి, కృపాచార్యుని పిలిపించి, వాళ్ళనతనికి అప్పగించాడు. పిల్లలు చాలా ఉత్సాహంగా అస్త్రవిద్యాభ్యాసం చేస్తున్నారు. ఈ సమయంలో ఒకసారి ఆడుకుంటూండగా బంతి ఒకటి లోతైన బావిలో పడిపోయింది. నూటా అయిదుగురూ అక్కడికి చేరి బంతిని ఎలా తీసుకోవాలో తెలియక తికమకపడుతున్నారు. అప్పుడు ఆ దారిన వెళ్తున్న ద్రోణుడు వాళ్ళను చూశాడు. వెంటనే తన వేలికున్న ఉంగరాన్ని కూడా ఆ నీటిలోకి విసిరేశాడు. పిల్లలు ఆశ్చర్యపోయారు. అర్జునుని చేతిలోని ధనుర్బాణాలు తీసుకొని, అమ్ములను బంతికి సంధించి, ఒకదానివెనుక ఒకటిగా వాటిని అనుసంధానించి వాళ్ళ బంతిని బయటికి తీయడమేగాక, ఆ ప్రక్రియ ద్వారానే ఉంగరాన్ని కూడా తీసి చూపించాడు. ఈ అద్భుతం చూసి ఆశ్చర్యపోయిన బాలురంతా తమ తాతయ్య భీష్మునివద్దకు వెళ్ళి జరిగిందంతా పూసగుచ్చినట్లు చెప్పారు. భీష్ముడు ద్రోణుడ్ని కలుసుకొని, తన మనుమలను ధనుర్విద్యాపారంగతులను చేయవలసిందిగా అర్థించాడు. ఆ విధంగా ద్రోణుడు కురుపాండవులకు అస్త్ర విద్యలను నేర్పించసాగాడు.

ద్రోణుని కొడుకు అశ్వత్థామ. ద్రోణుడికి అతడంటే సహజంగానే ప్రత్యేకాభిమానం. అయితే అర్జునుడు ద్రోణుడిపట్ల అమిత భక్తి ప్రపత్తులు చూపేవాడు. విద్య మరియు అధ్యయనం పట్ల కూడా ఎనలేని శ్రద్ధకనబరచేవాడు. వీటితో ద్రోణుడు ప్రసన్నుడై అర్జునుడ్ని తనకు అత్యంత ప్రియ శిష్యునిగా ప్రకటించి, ప్రపంచంలో నిన్ను మించిన ధనుర్ధారుడు లేడన్న రీతిగా తీర్చిదిద్దుతానన్నాడు. కాని కొన్ని రోజుల్లోనే అర్జునుని తలదన్నే విలుకాడున్నాడన్న సంగతి వాళ్ళకు అనుభవంలోకి వచ్చింది.

ద్రోణుని అస్త్ర విద్యా పటిమ గురించి విని, వివిధ దేశాల వాళ్ళు అతని వద్దకు విద్య నేర్చుకోవడానికి వచ్చేవాళ్ళు. అలాంటివాళ్ళలో ఒకరోజు నిషధరాజు హిరణ్యధన్వుని కుమారుడు ఏకలవ్యుడూ ఉన్నాడు. కాని, ఏకలవ్యుడు తక్కువకులానికి చెందినవాడని అతనికి విద్యనేర్పడాన్ని తిరస్కరించాడు ద్రోణుడు. అయినా నిరాశ చెందకుండా, ఏకాగ్రతతో సాధన చేస్తే






ఎంతటి కష్టమైన పనులనైనా సాధించవచ్చుని, అందుకు కులభేదాలు అడ్డంకి కానేరవని నిరూపించాడు ఏకలవ్యుడు. ద్రోణుని ప్రతిమ పెట్టుకొని, అతడ్నే గురువుగా భావించి నిరంతర కఠోరసాధనతో తిరుగులేని విలుకాడైనాడు. ఇది తెలిసిన అర్జునుడు తనను మించిన వాడున్నాడని గురువుకు చెప్పాడు. అర్జునునివల్ల లోకానికి ఒక మహోపకారం జరుగవలసి ఉన్నది. ఏకలవ్యుని కారణంగా ఆ లక్ష్యం నెరవేరదేమోనన్న భయంతో గురుదక్షిణగా తనకు కుడిచేతి బొటనవ్రేలిని ఇవ్వుమని ఏకలవ్యుడ్ని అడిగాడు. ఏకలవ్యుడు బొటనవేలునిచ్చి తన గురుభక్తిని చాటుకున్నాడు. శిష్య ప్రేమకు ద్రోణుడు, గురుభక్తికి ఏకలవ్యుడు, అర్జునుడూ ప్రతిభావంతుడుగా ప్రసిద్ధిగాంచారు.

కురుపాండవుల అస్త్రవిద్యాభ్యాసం పూర్తయిన తర్వాత ఒకరోజు అస్త్రవిద్యాప్రదర్శనను ఏర్పాటు చేశాడు ద్రోణుడు. అందులో అర్జునుని ప్రతాపం చూసి అందరూ ఆశ్చర్యాద్భుత భయ విహ్వలురైనారు. అర్జునుని మించిన విలుకాడు ఈ ప్రపంచంలో ఎక్కడా లేడండూ జయజయధ్వానాలు చేశారు అంతా. సరిగ్గా అప్పుడే కర్ణుడు ధనుష్టంకారం చేస్తూ రంగమధ్యంలోకి వచ్చి, 'అంతకు మించిన అస్త్ర విన్యాసం నేను ప్రదర్శిస్తా' నంటూ సవాలు విసిరాడు. అది చూసి అర్జునుడు కలవరపడ్డాడు. 'తనకొక తోడు దొరికా'డంటూ దుర్యోధనుడు మహదానందపడ్డాడు. అతడు అతిరథుడనే సూతుని (రథాన్ని తోలేవాని) కొడుకు కాబట్టి క్షత్రియులతో పోటీకి అనర్హుడన్నాడు కృపాచార్యుడు. వెంటనే దుర్యోధనుడు, 'అతడ్ని అంగరాజ్యానికి రాజును చేస్తున్నా'నని ప్రకటించి కయ్యానికి కాలుదువ్వేటట్లు చేశాడు. 'ఇది అస్త్ర విద్యా ప్రదర్శన కాని, యుద్ధ ప్రదర్శన కాద'ని పెద్దలందరూ సర్దిచెప్పి, ఆ వాతావరణం సద్దుమణిగేటట్లు చేశారు.

ఈ సంఘటన తర్వాత కురుపాండవుల మధ్య పొరపొచ్చాలు అధికమయ్యాయి. ధృతరాష్ట్రునిలో కూడా తన కొడుకులకంటే పాండవులు ఎక్కువ గౌరవాదరాలు పొందుతున్నారన్న ఈసు ప్రవేశించింది.

'తనను అవమానించిన ద్రుపదుడ్ని పట్టితెచ్చి ఇవ్వడమే తానుకోరుకునే గురుదక్షిణ' అని కురుపాండవులతో అన్నాడు ద్రోణుడు. కౌరవులెవ్వరూ అది సాధించలేకపోయారు. మహావీరుడైన అర్జునుడు కష్టసాధ్యమైన ఆ కార్యాన్ని అలవోకగా సాధించి చూపించాడు. ద్రుపదుడ్ని రథంకొమ్ముకు కట్టుకొని తెచ్చి ద్రోణుని కాళ్ళమీద పడేశాడు. అర్జునుని ఖ్యాతి మరింత అధికమైంది. ఆ తర్వాత పాండవులు మహనీయులైన ఋషులవద్ద, మహాత్ముల వద్ద అన్ని విద్యలూ సాంగోపాంగంగా నేర్చి తమ బుద్ధికుశలతను, శ్రద్ధాసక్తులనూ చాటుకున్నారు. ధృతరాష్ట్రుడు పెద్దవాడైన యుధిష్ఠిరుడికి యౌవరాజ్యాభిషేకం చేశాడు. ఆ తర్వాత అర్జునుడు సోదరులైన భీమనకుల సహదేవులను తోడు తీసుకొని, తండ్రిలాగా జైత్రయాత్ర చేసి మరింత రాజ్యవిస్తరణ గావించాడు. పాండురాజు సైతం జయించలేకపోయిన సౌవీరదేశంతోపాటు తూర్పు పశ్చిమ దిగ్భాగాలను జయించి కురువంశ కీర్తిని ఇనుమడింపజేశాడు.

ధృతరాష్ట్రుని మనోవేదన మరింత అధికమైంది. మరో పక్క దుర్యోధనుడు చెవిలో జోరీగలా తన బాధనంతా వీలు చిక్కినప్పుడల్లా వెళ్ళబోసుకుంటున్నాడు. ఈ పరిస్థితుల్లో పాండవులను హస్తిన నుండి దూరంగా పంపించాలని, అదే అదనుగా దుర్యోధనుడు ప్రజలను మచ్చిక చేసుకొని రాజ్యాధికారాన్ని స్వీకరించాలని ధృతరాష్ట్రుడు అంతరంగ సచివుడైన కణికునితో కూడి పన్నాగం పన్నాడు. అందుకు పాండవులను వారణావతం అను నగరానికి పంపడానికి ఏర్పాటు చేశారు. అక్కడ వారికోసం లక్కతో ఇంటిని నిర్మించారు. ఈ కుట్ర తెలిసినా, పెదనాయనకు ఎదురు చెప్పలేక యుధిష్ఠిరుడు తల్లితో, తమ్ముళ్ళతో కలిసి వారణావతానికి చేరుకున్నాడు.

## 4

వారణావత ప్రజలు పాండవులను చూడటమే తనకు మహాదృష్టంగా భావించారు. పాండవులక్కడ ఒక ఏడాదిపాటున్నారు. దుర్యోధనుని పక్షాన లక్క ఇంటిని తగులబెట్టి, పాండవులను సజీవదహనం చేయడానికి నియమించబడిన పురోచనుడు సమయం



కోసం కాచుకొని ఉన్నాడు. ఈ లోపు విదురుడు ఒక నమ్మకమైన మనిషిని పంపి, లక్క ఇంటి నుండి అడవిలోనికి ఒక సొరంగమార్గం తవ్వించాడు. పురోచనుడితో సహా ఆ ఇంటిని పాండవులే దహించేసి అందులో నుండి సురక్షితంగా బయటపడ్డారు. యాదృచ్ఛికంగా ఆ సమయానికి అక్కడ ఒక భిల్లస్త్రీ తన ఐదుగురు కుమారులతో ఉంది. వాళ్ళు కూడా ఆ మంటలకు ఆహుతి అయినారు. వాళ్ళను చూసి పాండవులే చనిపోయారనుకొని కౌరవులు శ్రాద్ధకర్మలు కూడా నిర్వహించారు.

పాండవులు చీకట్లో అడవిలో సంచరిస్తూండగా హిడింబ అను రాక్షస కాంత చూసింది. భీమసేనుడ్ని తొలి చూపులోనే వలచింది, తనను పెళ్ళి చేసుకొమ్మని కోరింది. అంతలో ఆమె అన్న హిడింబాసురుడు అక్కడికి వచ్చాడు. భీముడు అతణ్ణి సంహరించి తల్లి, అన్న ధర్మజునుని అనుమతితో హిడింబను పెళ్ళాడాడు. ఒక సంవత్సరం తర్వాత వాళ్ళకు ఘటోత్కచుడు అనే కొడుకు కలిగాడు. అతడు మహాబలవంతుడు, సకల విద్యావంతుడు, రాక్షసమాయలన్నీ పుట్టుకతోనే నేర్చుకున్నాడు. భీమసేనుని అనుమతితో ఘతోత్కచుడు తల్లిని తీసుకొని తమ నిజావాసానికి వెళ్ళిపోయాడు.

వ్యాసుడు పాండవులను కలిసి, "ఏకచక్రపురానికి వెళ్ళండి. మీకు మేలు జరుగుతుంది. మీకు రాజ్యం, సకల సుఖాలు సంప్రాప్తిస్తా"యని ఆశీర్వదించాడు. అయితే సరైన సమయంలోనే మీరెవరో తెలియాలి. అంతవరకూ ప్రచ్ఛన్న వేషాల్లోనే ఉండటం మంచిదని సూచించాడు.

ఏక చక్రపురంలో ఒక బ్రాహ్మణుల ఇంట్లో ఉన్నారు పాండవులు. వాళ్ళది చిన్న కుటుంబం. భార్య, భర్త, కూతురు, కొడుకు. పాండవులు యాచక వృత్తితో జీవిస్తున్నారు. ఒకరోజు యుధిష్ఠిరుడు అర్జున నకుల సహదేవులతో కలిసి భిక్షకోసం వెళ్ళారు. బ్రాహ్మణ కుటుంబం పెద్దగా రోదిస్తూంటే కారణం అడిగింది కుంతి. బకాసురడనే రాక్షసుడు నగరంలోని వాళ్ళనుండి రోజుకు ఒక్కో కుటుంబం నుంచి ఒక మనిషిని, బండెడు అన్నం, రెండు ఎద్దులను ఆహారంగా తీసుకుంటాడు. ఇది ఒప్పదం. ఈ రోజు తమ కుటుంబం వంతుగాబట్టి, ఎవర్ని పంపాలో తోచక బాధపడుతున్నాం' అని చెప్పాడు యజమాని. అప్పుడు కుంతీదేవి, "నీకు ఒక్కడే కొడుకు కాబట్టి బాధపడుతున్నావ్. నాకు ఐదుగురున్నారు అందులో ఒకర్ని పంపిస్తా"నన్నది. బ్రాహ్మణుడందుకు ఒప్పుకోలేదు. తన కొడుకు మహావీరుడని, ఆ బకాసురుడ్ని అంతమొందిస్తాడని వాళ్ళకు నచ్చజెప్పి, భీముణ్ణి పంపింది కుంతి. భీముడు ఆ బకాసురుణ్ణి వధించి, ఏకచక్ర పురవాసుల శోకం తీర్చాడు.

పాంచాలాధీశుడైన ద్రుపదుడు ద్రోణాచార్యుని చేత పరాభవింపబడ్డ తర్వాత అందుకు ప్రతీకారం తీర్చుకోవాలని, ద్రోణుని సంహరించగల మహావీరుని కోసం ఒక విశేషమైన యజ్ఞం చేశాడు. యజ్ఞఫలంగా అతనికి అగ్నికుండం నుండే ఒక దివ్యమైన పుత్రుడు లభించాడు. అతని పేరు దృష్టద్యుమ్నుడు. అతనితోపాటు ఒక కూతురూ లభించింది. ఆమె పేరు కృష్ణ. ద్రుపదుని కూతురు కావడంవల్ల అందరూ ఆమెను ద్రౌపది అని పిలిచారు. ద్రౌపది నల్లగా ఉన్నా ఎంతో అందమైంది. ఆమె శరీరం నుండి ఎల్లప్పుడూ వికసించిన నల్లకలువల సౌరభం వ్యాపిస్తూండేది. గత జన్మలో ఆమె తనకు మంచి భర్తకావాలని శంకరుని గురించి తపస్సు చేసింది. శివుడు ప్రత్యక్షం కాగానే 'భర్తకావాలి! భర్తకావాలి! అని ఐదుసార్లు కోరింది. అందుకు శంకరుడు 'తథాస్తు!' అన్నాడు. 'నీకు ఐదుగురుభర్తలుంటారు. తప్పదు! అయినా నీవు చరితార్థురాలివి అవుతావు' అని ఆశీర్వదించాడు.

బకాసురుని వధానంతరం పాండవులను కలిసిన వ్యాసుడు వాళ్ళను పాంచాలపురం వెళ్ళమని ఉద్బోధించాడు. అక్కడ నిర్వహిస్తున్న ద్రౌపదీ స్వయంవరానికి వెళ్ళమని కూడా చెప్పాడు. వ్యాసుని ఆదేశం మేరకు పాండవులు బ్రాహ్మణ వేషాల్లోనే పాంచాలపురం చేరుకున్నారు. స్వయంవర సభలో బ్రాహ్మణ సమూహంలోనే కూర్చున్నారు.

ద్రుపదుడు స్వయంవర సన్నాహంలో భాగంగా మత్స్యయంత్రాన్ని ఏర్పాటుచేశాడు. పైన యంత్రమధ్యంలో గిరగిరా తిరుగుతున్న చేపను కింద నీళ్ళలో ప్రతిబింబాన్ని చూస్తూ కొట్టిన వారికి ద్రౌపదినిచ్చి వివాహం చేస్తానని ప్రకటించాడు. కౌరవుల్లో చాలా మంది ఆపని చేయలేక భంగపడ్డారు. ఇతర క్షత్రియ వీరులూ విఫలమయ్యారు. కర్ణుడు అలవోకగా ధనుస్సునెత్తి ఎక్కుపెట్టినా







'సూతపుత్రుడ్ని నేను వరించ'నన్నది ద్రౌపది. అప్పుడు అన్నల అనుమతి తీసుకొని అర్జునుడు యంత్రభేదనానికి సిద్ధపడ్డాడు. అందరూ ఆశ్చర్యచకితులై చూస్తూండగా అర్జునుడు మత్స్యయంత్రాన్ని ఛేదించాడు. క్షత్రియులకు అది అవమానకరంగా ఉందని వాళ్ళంతా ద్రుపదుని మీదికి కత్తిదూశారు. వాళ్ళందరినీ భీమార్జునులు ఎదిరించారు. శ్రీకృష్ణుడు కల్పించుకొని అందరినీ శాంతపరిచి, యుద్ధం నివారించాడు. ద్రౌపదిని వెంటబెట్టుకొని పాండవులు ఇంటికి వెళ్ళి తల్లితో "అమ్మా! భిక్షతీసుకొని వచ్చాం!" అన్నారు బయటినుంచే. లోపలున్న కుంతీదేవి వివరాలు తెలుసుకోకుండానే "అందరూ పంచుకోండి నాయనా!" అని ఆదేశించింది. బిడ్డలు తెచ్చింది భిక్షకాదని, అమ్మాయి అని తెలిసి ఆశ్చర్యపోయి, పశ్చాత్తాపంతో కుంగిపోయింది కుంతి. అందరూ విచారంతో ఉండగా వ్యాసభగవానుడు వచ్చి 'ద్రౌపది పూర్వజన్మలో పొందిన వరం కారణంగా ఈ పరిస్థితి కల్గింది. భగవంతుని వరానికి తిరుగుండదు. ఐదుగురినీ ఆమె వివాహం చేసుకోవడం ధర్మమే'నని హితబోధ చేశాడు. ద్రుపదుడు తన కూతురును స్వయంవరంలో గెలిచిన వీరుడు అర్జునుడేనని, బ్రాహ్మణ వేషాల్లో ఉన్నవాళ్ళు పాండవులన్న సంగతి తెలిసి ఎంతో సంతోషించాడు. వ్యాసుని సూచన మేరకు ఐదుగురికీ తన కూతురుతో పెళ్ళి జరిపించి, ధన కనక వస్తువాహనాలతో తృప్తులను చేశాడు. శ్రీకృష్ణుడు కూడా అనేక కానుకలు సమర్పించాడు.

పాండవులు ద్రుపదుని పాంచాలరాజ్యంలో ఉన్నారని, మత్స్యయంత్ర భేదన మొనర్చినవాడు అర్జునుడేనని హస్తినాపురంలో ఉన్న కురువంశస్థులకందరికీ తెలిసింది. ధృతరాష్ట్రుడు, దుర్యోధన దుష్టచతుష్టయం (దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని) తప్ప అందరూ ఎంతో ఆనందించారు. వాళ్ళను సగౌరవంగా పిలిపించి, అర్ధరాజ్యం అప్పగించుమని ధృతరాష్ట్రునికి చెప్పారు భీష్మాది పెద్దలు. తప్పనిసరై వాళ్ళను విదురునిచే పిలిపించి, అర్ధరాజ్యాన్ని ఏలుకొమ్మని చెప్పి, ఖాండవప్రస్థానికి పంపించాడు ధృతరాష్ట్రుడు. ఖాండవప్రస్థంలో అద్భుతమైన రాజభవనం నిర్మించారు. అది స్వర్గశోభను సంతరించుకున్నది. అందుకే ఖాండవప్రస్థాన్నే ఇంద్రప్రస్థమన్నాడు ధర్మరాజుగా పేరుగాంచిన యుధిష్ఠిరుడు. ఓ శుభముహూర్తాన ధర్మరాజుకు పట్టాభిషేకం చేశారు పెద్దలు. అందరూ సుఖంగా జీవిస్తున్నారు. ఇంద్రప్రస్థంలో ధర్మరాజు పాలన – కృతయుగాన్ని గుర్తుకు తెచ్చేంత వైభవంగా ఉంది.

ఇట్లా ఉండగా నారదుడు ఇంద్రప్రస్థానికి వచ్చాడు. ద్రౌపదితో పాండవులు కాపురం చేయడానికి ఒక నియమం ఏర్పరచుకోవడం మంచిదని, అది ధర్మసమ్మతము, న్యాయసమ్మతమూ కావాలని ఒక సూచన చేశాడు. ఆ సూచన ప్రకారం ద్రౌపది పాండవులకు ఒక్కొక్క సంవత్సరం ఒకరికి భార్యగా ఉండాలి. ఆ సమయంలో తక్కిన నలువురూ మాతృభావంతో, వాత్సల్యంతో ఆమెపట్ల వ్యవహరించాలి. ఆమె భర్తతో ఉన్న గృహంలోకి ఎవరైనా ప్రవేశిస్తే పన్నెండేళ్ళు వనవాసం చేయాలి. ఆ నియమం అందరికీ నచ్చింది. ఆ ప్రకారమే వాళ్ళు నడుచుకోసాగారు. ఈ నియమం ప్రకారం ద్రౌపది ధర్మరాజుకు భార్యగా ఉన్న సమయంలో ఒక సంఘటన జరిగింది.

ఒక బ్రాహ్మణుడు అర్జునునితో తన గోసంపదను దొంగలు దోచుకొని వెళ్తున్నారు. కాపాడుమంటూ మొరపెట్టుకున్నాడు. అది విన్న అర్జునుడు ఆలస్యం చేయకుండా తన అస్త్రశస్త్రాలు తీసుకున్నాడు. ఆ సమయంలో ధర్మరాజు ద్రౌపదితో అస్త్రాలున్న గదిలోనే ఉన్నాడు. తనకు శిక్షపడ్డాసరే, ధర్మాన్ని రక్షించడమే ప్రధాన కర్తవ్యంగా భావించి, అర్జునుడు దొంగల బారినుండి ఆ భూసురుని గోధనాన్ని కాపాడి, అతనికి అప్పగించాడు. ధర్మరక్షణయితే అయ్యిందికాని, నియమ భంగం చేసిన అర్జునుడు శిక్షార్హుడయ్యాడు. ధర్మరాజు క్షమించానన్నా వినకుండా పన్నెండు సంవత్సరాలు తన కుటుంబానికి దూరంగా వనవాసానికి సిద్ధమయ్యాడు. ఈ యాత్ర మహాభారతకథలో అర్జునుని తీర్థయాత్రగా ప్రసిద్ధమయ్యింది.

ఈ యాత్రలో అర్జునుడు వందలకొద్ది అడవులు, సరోవరాలు, పుణ్యతీర్థాలు, దేశాలు, సముద్రాలు చూశాడు. హరిద్వార్‌లో ఉండగా నాగకన్య ఉలూచిని పరిణయమాడాడు. అక్కడి నుండి మహేంద్ర పర్వత సమీపంలోని మణిపురం చేరి, చిత్రవాహనుని కూతురు చిత్రాంగదను పెళ్ళాడాడు. వాళ్ళకు కలిగిన కొడుకుకు బభ్రువాహనుడనే పేరు పెట్టారు. ఆ తర్వాత సముద్ర తీరాన



గల పంచతీర్థాల్లో (అగస్త్య, సౌభద్ర, పౌలోమ, కారంధ, భారద్వాజ) స్నానమాడి, శాపవశులైన అప్సరస స్త్రీలకు శాపవిమోచనం కల్గించాడు. అక్కడి నుండి గోకర్ణ క్షేత్రం మీదుగా ప్రభాస తీర్థానికి చేరుకున్నాడు. అక్కడ అర్జునుని ఆత్మీయ మిత్రుడైన కృష్ణుడు కలిశాడు. ఇద్దరూ రైవతక పర్వతానికి చేరుకున్నారు. కృష్ణుని అభిమతం మేరకు సేవకులు సకల ఏర్పాట్లూ గావించారు. మిత్రులిద్దరూ చాలాకాలం కలిసి ఉన్నారు అక్కడే. రైవతకాద్రి ఉత్సవంలో బలరామకృష్ణుల సోదరి సుభద్రను చూసిన అర్జునుడు ఆమెను ఇష్టపడ్డాడు. మిత్రుని కోరిక నెరిగిన కృష్ణుడు 'నీ కంటె యోగ్యుడైన భర్త నా చెల్లెలికింకెవరున్నారు? స్వయంవరంలో ఆమె నిన్ను వరించకుంటే నీ ఆశయం నెరవేరదు, కాబట్టి ఎత్తుకొనిపోయి వివాహం చేసుకో' అన్నాడు. అర్జునుడు అందుకోసం యత్నించగా యాదవ వీరులంతా అడ్డుకో జూచారు. కృష్ణుడు వాళ్ళను శాంతపరచి, రాక్షసవిధిని వివాహం చేసుకోవడం దోషం కాదని నచ్చజెప్పి, శాస్త్రోక్తవిధిని పెళ్ళిజరిపించుమని బలరాముడ్ని కోరాడు. వివాహానంతరం సంవత్సరకాలం ద్వారకలో ఉండి, తర్వాత వనవాసకాలాన్ని పూర్తిచేసి, సుభద్రాసమేతుడై ఇంద్రప్రస్థానికి చేరుకున్నాడు అర్జునుడు. పాండవులు, పరివారం, సమస్త ప్రజలూ ఎంతగానో సంతోషించారు. సుభద్రార్జునులకు అభిమన్యుడు జన్మించాడు. అతడు అన్ని విద్యలూ నేర్చుకున్నాడు. తండ్రివద్ద ధనుర్వేదం అభ్యసించాడు.

పాండవులందరూ ద్రౌపదివల్ల సంతానవంతులయ్యారు. యుధిష్ఠిరునికి ప్రతివింధ్యుడు; భీమసేనునికి సుతసోముడు; అర్జునునికి శ్రుతకర్ముడు; నకులునికి శతానీకుడు; సహదేవునికి శ్రుతసేనుడు అనే పుత్రులు కలిగారు. వీళ్ళంతా వేద విద్యలతోపాటు అర్జునుని వద్ద శస్త్రాస్త్ర విద్యల నభ్యసించారు.

కృష్ణార్జునులు జలవిహారానికై ఒకరోజు యమునా తీరానికి వెళ్ళారు. అక్కడ అగ్నిదేవుడు ఒక యాచకుడై వచ్చి, తన ఆకలి తీర్చుమని అడిగాడు. కృష్ణార్జునులు అందుకు ఒప్పుకున్నారు. అప్పుడు అగ్ని తన ఖాండవ వనాన్ని దహించడమే భోజనమని, తాను అగ్నిదేవుడినని, వనంలో ఇంద్రుని స్నేహితుడైన తక్షకుడు కాపురం ఉండటంవల్ల దహించనీయకుండా అడ్డుకుంటున్నాడని అసలు సంగతి చెప్పాడు. అందుకు కృష్ణార్జునులు తమ వద్ద సరియైన ఆయుధాలు లేవన్నారు. అప్పుడు అగ్ని అర్జునునికి గాండీవాన్ని, అక్షయ తూణీరాన్నీ సమకూర్చాడు. కృష్ణునికి సుదర్శనచక్రాన్ని, కౌమోదకి అనే గదను ఇచ్చాడు. వారి సాయంతో ఖాండవ దహనాన్ని యథేచ్ఛగా పూర్తిచేశాడు. అయితే ఆ సమయంలో కురుక్షేత్రానికి వెళ్ళడం వల్ల తక్షకుడు చనిపోలేదు. అతని కొడుకును ఇంద్రుడు కాపాడాడు. జరిత, ఆమె పిల్లలను అగ్ని దేవుడు దహించకుండా వదిలేశాడు. మయుడనే రాక్షసుడు అర్జునుని శరణుజొచ్చి ప్రాణాలు కాపాడుకున్నాడు.

## 2. సభాపర్వం

తన ప్రాణాలు కాపాడినందుకు కృతజ్ఞతగా 'మయసభ' అనే ఓ అద్భుతమైన భవనాన్ని పాండవులకు నిర్మించి ఇచ్చాడు మయుడు.

మయుడు అద్భుత మణిమయ భవనం (వేయి హస్తాల పొడవు వెడల్పులతో, చిత్ర విచిత్ర వస్తు, వృక్ష సంపత్తితో) నిర్మించి ఇవ్వడంతోపాటు భీమునికి గదను, అర్జునునికి దేవదత్తమనే శంఖాన్ని, అపారధనరాసులనూ పాండవులకు కానుకలుగా సమర్పించుకున్నాడు. ఒకరోజు నారదుడు స్వర్గం నుంచి వస్తూ, 'రాజసూయ యాగం చేయండి! ఇది మీ తండ్రిగారి కోరిక. దీనివల్ల మీకు యశస్సు, మీతండ్రికి స్వర్గసుఖం అధికమవుతాయి' అని చెప్పాడు. ధర్మరాజు ఈ విషయమై పెద్దలందరి సలహాలు తీసుకున్నాడు. రాజసూయ యాగమంటే ఇతర రాజులందరి మీద ఏకఛత్రాధిపత్యం సాధించడమే. ఈ నేపథ్యంలో వ్యతిరేకతలను అణచివేయడం, యుద్ధాలు చేయడమూ సంభవిస్తుంది. అందరూ యాగం చేయడాన్ని ప్రోత్సహించారు. శ్రీకృష్ణుడు మాత్రం మగధను పాలించే జరాసంధుడు అనేకమంది రాజులను జయించి, బలగర్వితుడై వాళ్ళచేత ఊడిగం చేయించుకుంటున్నాడు. అతడ్ని జయిస్తేనే రాజసూయం విజయవంతమవుతుదని సలహా ఇచ్చాడు. కృష్ణుని సలహా ననుసరించి, అతడ్ని కృష్ణుని



వెంటబెట్టుకొని మగధకు చేరుకున్నారు పాండవులు. ఎవ్వరితో యుద్ధం చేస్తా'వని కృష్ణుడు జరాసంధుడ్ని అడిగాడు. బలవంతుడైన జరాసంధుడు తనతో సమాన బలుడైన భీముడ్ని ఎంచుకున్నాడు. ఇద్దరికీ పదమూడు రోజులు అవిరామంగా మల్లయుద్ధం జరిగింది. పద్నాలుగో రోజు జరాసంధుడ్ని, కృష్ణుని సలహాల ఆధారంగా వధించాడు భీముడు. రాజులందరూ చెరసాల నుండి విముక్తులయ్యారు. పాండవులకు అనేక కానుకలు సమర్పించి, ధర్మరాజు సార్వభౌమత్వాన్ని ఆనందంగా అంగీకరించారు. ధర్మరాజు రాజులందరినీ పిలిపించి, రాజసూయయాగం ప్రారంభించాడు.

అందరికంటె ముందుగా శ్రీకృష్ణుడ్ని పరమదైవంగా భావించి పూజించాడు ధర్మరాజు. ఆ పూజను ఆక్షేపిస్తూ, శిశుపాలుడు అందరినీ దూషించడం మొదలుపెట్టాడు. అతని తల్లికిచ్చిన మాట ప్రకారం వంద తప్పులు పూర్తికావడంతో శిశుపాలుని శిరస్సును ఖండించాడు కృష్ణుడు. రాజసూయ యాగం పూర్తయిన తర్వాత దుర్యోధనుడు మయసభను దర్శించాడు. ధర్మరాజు పొందిన గౌరవాదరాలకు, కీర్తి సత్కారాలకు అతని గుండె మండిపోయింది. మయసభ శత్రువుకు మాయసభలా గోచరిస్తుంది. లేనివి ఉన్నట్లు, ఉన్నవి లేనట్లు భ్రమింపజేస్తుంది. అసూయాపరుడైన దుర్యోధనునికి అన్నీ అట్లాగే కనిపించాయి. నీళ్ళు లేని చోట ఉన్నట్లు, గుమ్మం ఉన్నచోట లేనట్లూ కనిపించి, విరుద్ధప్రవర్తనలతో అవమానాలపాలయ్యాడు. అవహేళనలను పొందాడు. దాంతో అతనిలో ప్రతీకారేచ్ఛ మేరుపర్వతాన్ని మించిపోయింది. అసూయ, అవమానం, అతనిలో ద్వేషాన్ని పెంచాయి. శకునితో, కర్ణునితో, దుశ్శాసనునితో కలిసి పాండవులను పరాభవించే ఉపాయాలను చర్చించాడు దుర్యోధనుడు. "యుద్ధంలో వాళ్ళను జయించలేం కాబట్టి, జూదంలో ఓడిద్దాం. యుధిష్ఠిరుడు జూదవ్యసనప్రియుడు. అతన్ని రప్పిద్దాం!' అన్నాడు శకుని. ధృతరాష్ట్రుని ద్వారా పాండవులను హస్తినకు పిలిపించారు.

మొదట ధర్మరాజు జూదానికి సుముఖత చూపకున్నా, శకుని రెచ్చగొట్టడంతో ఆటకు సిద్ధపడ్డాడు. కాని జూదంలో సిద్ధహస్తుడైన మాయల అక్షులుగల శకుని ముందు అతని పాచికలేవీ పారలేదు. ప్రతిసారీ శకుని గెలిచాడు. వస్తువాహనాలతో మొదలుపెట్టి, సమస్త రాజ్యాన్నీ జూదంలో పణంగా పెట్టాడు యుధిష్ఠిరుడు. తర్వాత తమ్ముళ్ళ నందరినీ ఓడిపోయాడు. ధర్మబద్ధులైన భీమార్జున నకుల సహదేవులు అన్న మాటకు ఎదురాడక తలవంచుకున్నారు. తర్వాత ధర్మరాజు తనను తాను పణంగా పెట్టాడు. తనుకూడా ఓడిపోయిన తర్వాత చివరకు ద్రౌపదిని ఒడ్డాడు. ఆమెను కూడా ఓడిపోయాడు.

దుర్యోధనాదులు పాండవులను సూటిపోటి మాటలతో బాధపెట్టడమే గాక ద్రౌపదిని సభకీడ్చుకొని వచ్చారు. అందరూ చూస్తూండగా దుశ్శాసనుడు ఆమెను వివస్త్రను జేయడానికి పూనుకున్నాడు. దుర్యోధనుడ్ని ఎదిరించలేక అందరూ తలలు వంచుకున్నారు. ధర్మశృంఖల బద్ధులైన పాండవులూ నోరు మెదపలేకపోయారు. అప్పుడు ద్రౌపది తనను కాపాడమని కృష్ణున్ని ఆర్తితో ప్రార్థించింది. దీనజనోద్ధారకుడైన ఆ వాసుదేవుడు ప్రచ్ఛన్న రూపంలో అక్కడికి వచ్చి, అక్షయవస్త్రాలిచ్చి ఆమె గౌరవాన్ని నిలబెట్టాడు. అప్పుడు ఎన్నో దుశ్శకునాలు తోచాయి. భయపడిన ధృతరాష్ట్రుడు ద్రౌపదిని ఏంకావాలో కోరుకొమ్మన్నాడు. ద్రౌపది మొదట రాజైన యుధిష్ఠిరుడ్ని దాస్య విముక్తుడ్ని చేయమని అడిగింది. రెండో వరంగా భర్తలందరనీ విడుదల చేయమని అడిగింది. మూడోవరం ఆమె కోరుకోనప్పటికీ సమస్త సంపదలనూ, రాజ్యాన్నీ తిరిగి ఇచ్చేస్తున్నానని, ఇంద్రప్రస్థానికి వెళ్ళి సుఖంగా ఉండమని ఔదార్యం ప్రకటించాడు ధృతరాష్ట్రుడు. అంతకు ముందే ద్రౌపదికి జరుగుతున్న అవమానాన్ని భరించలేని భీముడు దుశ్శాసనుని గుండె చీల్చి రక్తం తాగుతానని, దుర్యోధనుని తొడలు విరగ్గొట్టి చంపుతానని భీషణమైన ప్రతిజ్ఞలు చేశాడు. మొత్తం మీద ధృతరాష్ట్రుని అనుగ్రహంతో పాండవులు ఇంద్రప్రస్థానికి పయనమయ్యారు. పెద్దలంతా సంతోషించారు. కాని దుర్యోధనాదులైన దుష్ట చతుష్టయానికి ఇది కంటగింపుగా మారింది. తాము సంపాదించిన సమస్తాన్ని ముసలి గుడ్డి రాజు అప్పనంగా ఇచ్చివేశాడని ఆవేదన చెందారు. ఈసారి పన్నెండేండ్లు వనవాసం, ఒక యేడు అజ్ఞాతవాసం పందెంగాస్తూ, పాండవులను జూద మాడటానికి రమ్మని ఆహ్వానించమన్నారు ధృతరాష్ట్రుణ్ణి. దుర్యోధనుని మాటకాదనలేక నగరం వదిలి వెళ్ళిన వాళ్ళను వెనక్కి పిలిపించాడు ధృతరాష్ట్రుడు.



ఈసారి కూడా గెలుపు శకునిదే. ఒప్పందం ప్రకారం ఓడిన వాళ్ళు పన్నెండేళ్ళు వనవాసం చేయాలి. తర్వాత ఒక సంవత్సరం అజ్ఞాతవాసం అంటే ఎవరికీ తెలియకుండా జీవనం గడపాలి. ఒకవేళ తెలిస్తే మళ్ళీ పన్నెండేండ్లు వనవాసం. ఏడాది అజ్ఞాతవాసం చేయాలి. ఓటమి, అవమానాన్ని మూట గట్టుకొని, భార్య ద్రౌపదితో కూడా అక్కడి నుండే నారచీరలు ధరించి అడవుల్లోకి బయలుదేరారు పాండవులు. తల్లి కుంతీదేవి విదురునింట ఉండిపోయింది. ప్రజలంతా ఈ పరిణామానికి ఎంతగానో బాధపడ్డారు. కురువంశ నాశనం తప్పదన్నారు విజ్ఞులు. ఇంద్రప్రస్థానికి కౌరవుల ప్రతినిధిగా ద్రోణాచార్యుదుని నియమించారు.

## 3. అరణ్యపర్వం (వనపర్వం)

పాండవులు అడవులకు వెళ్తూ వారించినా వినకుండా చాలా మంది సజ్జనులు వాళ్ళమీద అభిమానం చంపుకోలేక వెంటవచ్చారు. ఏ ఆధారమూలేని తాము వచ్చిన వాళ్ళకు ఏం ఏర్పాట్లు చేయగలమన్న విచారం యుధిష్ఠిరుడ్ని పీడించింది. అప్పుడు సూర్యుడ్ని ప్రార్థిస్తే అతడొక పాత్రనిచ్చాడు. ఆ పాత్రలో కావాలనుకున్న పదార్థాలు కావలసినన్ని సమకూరుతాయి. అదే అక్షయపాత్ర. పాండవులు అడవుల్లో ఒక చోటున ఉండక క్రమంగా ఒక స్థలం నుండి మరొక స్థలానికి మారుతున్నారు. ఇలా మారుతూ వారు కామ్యక వనంలో ఉన్నప్పుడు శ్రీకృష్ణాదులు వచ్చి సాంత్వనపరిచారు. ద్రౌపది తన ఆవేదననంతా చెప్పుకున్నది. యుద్ధం జరుగుతుందని, కష్టాలు తొలగిపోతాయని చెల్లెలిని ఓదార్చాడు కృష్ణుడు. వ్యాసుడు ధర్మరాజును కలిసి, రాబోయే యుద్ధంలో విజయం సాధించేందుకు అవసరమైన శస్త్రాస్త్రాలకోసం అర్జునుణ్ణి తపస్సుకు పంపుమని చెప్పాడు. అర్జునుడు అన్న అనుమతితో శంకరుడ్ని తన తపస్సుతో మెప్పించి పాశుపతాస్త్రం పొందాడు. ఇంద్రుని కోసం తపస్సు చేస్తే, తన అంశతో జన్మించిన అర్జునుడికి ప్రేమతో సమస్తాస్త్రాలనివ్వడమేగాక, తన సింహాసనం సగభాగంలో అతడ్ని కూర్చుండబెట్టుకొని ఆదరించాడు. ఇంద్రునికోరిక మేరకు అర్జునుడు చిత్రసేనుడను గంధర్వుని వద్ద సంగీత నాట్యాలను అభ్యసించాడు.

దేవసభలో ఉండగా అర్జునుడొకసారి ఊర్వశిని తదేక దృష్టితో చూశాడు. ఆమె అర్జునుడు తనను ప్రేమిస్తున్నాడనుకున్నది. అతని గుణగణాలకు ముగ్ధురాలై ఏకాంతంగా ఉన్నప్పుడు, వద్దకు చేరి, తాను అతడ్ని ప్రేమిస్తున్నానని చెప్పింది. అప్పుడు అర్జునుడు – "అమ్మా! నీవు మా వంశీయులకు తల్లివి. నాకు కుంతీదేవి ఎంతో, నీవు కూడా అంతే!" అంటూ పాదాభివందనం చేశాడు. ఆ మాటలు ఊర్వశికి నచ్చలేదు. పైగా కోపం తెప్పించాయి – "నాపట్ల నీవు నపుంసకుడిలా ప్రవర్తించావుగాబట్టి, నపుంసకుడవైపోదువు గాక!" అని శపించింది. చింతాక్రాంతుడైన అర్జునుడు ఇంద్రునితో జరిగింది వివరించాడు. ఇంద్రుడు బాధపడవద్దని, ఈ శాపప్రభావం ఏడాదిపాటు మాత్రమే ఉంటుందని, వనవాసం తర్వాత అజ్ఞాతవాసంలో ఈ శాపమే నీకు వరంగా పరిణమిస్తుందని ఆశీర్వదించాడు.

తర్వాత అర్జునుడు తన సోదరులను కలుసుకున్నాడు. అడవులన్నీ తిరుగుతూ ద్వైతవనానికి చేరుకున్నారు. అక్కడ కృష్ణుడు సత్యభామా సహితుడై పాండవులను కలుసుకున్నాడు. సత్యభామతో మాట్లాడి ద్రౌపది ఎంతో సాంత్వన పొందింది. పాండవులు ద్వైతవనంలో ఉన్న సంగతి కౌరవ దుష్టచతుష్టయానికి తెలిసింది. ఆవనంలో ఉన్న గోవులను కాపాడే నెపం (ఘోషయాత్ర)తో పాండవులకు తమవైభవాన్ని చూపించి నొప్పించాలనుకున్నారు. అన్ని ఏర్పాట్లూ చేసుకొని పాండవులు బసచేసిన ప్రదేశానికి వెళ్ళారు. అప్పుడు ధర్మరాజు రాజర్షియజ్ఞం చేస్తున్నాడు. కావాలని ఆ ప్రదేశాన్ని తన క్రీడాంగణంగా మార్చి పాండవులను క్షోభకు గురిచేయాలని, సరోవరంలోకి సపరివారంగా ప్రవేశించబోయినారు కాని, తానొకటి తలచితే దైవమొకటి తలచిందన్నట్లు, సరోవర ప్రవేశాన్ని చిత్రసేనుడనే గంధర్వరాజు అడ్డుకున్నాడు. ఆ సమయంలో తామూ అక్కడ జలక్రీడలాడతామన్నాడు. దాంతో వివాదం ముదిరింది. రోషంతో దుర్యోధనుడు యుద్ధం చేశాడు. కాని గంధర్వరాజు అందరినీ చిటికెలో ఓడించి కర్ణదుర్యోధనులను తన రథం కొమ్ముకు కట్టుకొని తీసుకొని పోసాగాడు. ఇది తెలిసి భీమార్జునులు సంబరపడ్డారు. కాని యుధిష్ఠిరుడు వాళ్ళను పిలిచి, 'మనం దాయాదులమైనా ఒకే వంశం వాళ్ళం. విడిగా ఉన్నప్పుడు వందమంది వేరు, ఐదుగురు వేరు. కాని ఇతరులు మనపైకి వస్తే మాత్రం మనం నూటా ఐదు మందిమి. దుర్యోధనుడ్ని విడిపించుకొనిరండి!' అని ఆదేశించాడు. అన్నమాటను కాదనలేక గంధర్వుల నుండి వాళ్ళను విడిపించుకొని తెచ్చారు భీమార్జునులు . ధర్మరాజు దుర్యోధనుడికి బుద్ధులు చెప్పి పంపించాడు.



పాండవులను అవమానించడానికి వెళ్ళి, తానే అవమానంపాలైన దుర్యోధనుడు ప్రాయోపవేశానికి (ఆత్మహత్యకు) సిద్ధపడ్డాడు. శకుని, కర్ణుడు, దుశ్శాసనుడు అతడ్ని వారించారు.

## 6

పాండవులు తిరిగి కామ్యకవనానికి చేరుకున్నారు. అక్కడ ఒక రోజు ద్రౌపది ఒంటరిగా ఉన్న సమయంలో ఆ దారిన వెళ్తున్న జయద్రథుడు (సైంధవుడు) ఆమెను చూసి, మోహించి, తన వెంట తీసుకొని పోసాగాడు. అతని వెంట సింధు, సౌవీర, శిబి, త్రిగర్తాది దేశాల సైన్యం కూడా ఉన్నది. ద్రౌపది తనను కాపాడమని ఎలుగెత్తి అరచింది. విషయం తెలుసుకున్న పాండవులు వాని సైన్యాలనంతా చెల్లా చెదరుచేసి, అతడు తమ సోదరి దుస్సల భర్తగావడంవలన ప్రాణభిక్ష పెట్టారుగానీ, తల గొరిగించి, అవమానపరచి, హింసించి పంపించారు. ఆ అవమాన భారంతో సరాసరి హరిద్వారం చేరుకొని శివుడ్ని గురించి కఠోర తపస్సు చేశాడు. అర్జునుడులేని సమయంలో పాండవులను ఒక్కరోజు జయించగలిగే వరం సంపాదించాడు. కామ్యకవనంలోని అనుభవం తర్వాత పాండవులు మళ్లీ ద్వైతవనానికి వెళ్లారు.

ఇదిలా ఉండగా కర్ణునికి స్వప్నంలో సూర్యుడు సాక్షాత్కరించి, 'ఇంద్రుడు కపట యాచకుని వేషంలో నీవద్దకు వచ్చి కవచకుండలాలు అడుగుతాడు. నీ ప్రాణాలను కాపాడే ఆ రెండింటిని మాత్రం దానంచేయవద్దని హెచ్చరిస్తాడు. కాని కర్ణుడు' దానం చేయడం నా స్వభావం. ప్రాణం పోయినా ఈ నియమాన్ని మానుకో'నంటాడు. అన్నట్లుగానే మరుసటిరోజు యాచకుడై వచ్చిన ఇంద్రునికి సంతోషంగా తన కవచకుండలాలను శరీరం నుండి వేరుచేసి ఇస్తాడు కర్ణుడు. అతని దాన గుణానికి దేవతలు సైతం ముగ్ధులై పూలవాన కురిపిస్తారు. లోకమంతా కీర్తిస్తుంది. దేవేంద్రుడు కూడా శక్తివంతమైన భుజంగాస్త్రాన్ని ఇస్తాడు. అయితే 'అది ఆపత్కాలంలో ప్రయోగించాలని, ఒక్కసారే ఉపయోగపడుతుందని చెపుతాడు.

ఇలా ఉండగా ఒకనాడు ద్వైతవనంలో హఠాత్తుగా ఒక సంఘటన జరిగింది. అగ్నిని తయారుచేసుకునేందుకు మునులు అడవుల్లో 'అరణి' అనే కర్రను ఉపయోగిస్తుంటారు. ఎక్కడి నుంచో ఒక లేడివచ్చి ఒక ముని అరణిని ఎత్తుకుపోయింది. అతడీ సంగతి పాండవులవద్ద మొరపెట్టుకున్నాడు. దాన్ని పట్టుకునేందుకు వాళ్ళు పరుగుతీశారు. అదివాళ్ళకు చిక్కకుండా, అస్త్రాలకూ లొంగకుండా పరుగెత్తసాగింది. వాళ్ళు మరింత పట్టుదలతో దాన్ని వెంబడించారు. అట్లా వెంబడిస్తూ, ఒక కీకారణ్యం చేరుకున్నారు. అలసటతో, దప్పికతో ఒక చెట్టుకింద పడిపోయారు. ధర్మరాజు నకులునితో, పరిసరాల్లో ఎక్కడైనా నీళ్ళుంటే తీసుకొని రమ్మన్నాడు. నకులుడు అక్కడికి కొద్ది దూరంలో ఉన్న ఒక సరస్సులో నీళ్ళు తేవడానికి వెళ్ళి, ఆ నీళ్ళు తాగి అక్కడే విగతజీవుడైపోయాడు. అప్పుడు ధర్మరాజు మిగతా సోదరులను ముగ్గురిని పంపాడు. అందరికీ అదే గతి పట్టింది. చివరకు ధర్మరాజే స్వయంగా వెళ్ళాడు. అక్కడొక యక్షుడు పెద్ద కొంగ రూపంలో కనిపించి 'నా ప్రశ్నలకు జవాబులు చెప్పందే నీళ్ళు తాగవద్దన్నా, మూర్ఖంగా నీ తమ్ములు ప్రాణాలు పోగొట్టుకున్నారు. నీవైనా జవాబులు చెప్ప'మన్నాడు. ధర్మరాజు యక్షుని ప్రశ్నలన్నిటికీ సరైన సమాధానాలు చెప్పి, అతనితో వరాలు పొంది, తన తమ్ముళ్ళను బతికించుకున్నాడు. ఆ యక్షుడెవరోకాదు, ధర్మరాజు తండ్రి – సాక్షాత్తూ యమధర్మరాజే. 'అజ్ఞాతవాసంలో పాండవులను ఎవరూ గుర్తించలేరను' వరం కూడా ప్రసాదించాడు.

వనవాసం ముగియడంతోనే ద్వైతవనంలోని మునులందరివద్దా సెలవు తీసుకొని అక్కడి నుండి బయలుదేరారు – ద్రౌపదీ సహితంగా పాండవులు.

## 4. విరాటపర్వం

యుధిష్ఠిరుడు తమ్ములందరితో కలిసి చర్చించి, అజ్ఞాత వాసం మత్స్యదేశ రాజైన విరాటుని వద్ద పూర్తిచేయడం సముచితంగా ఉంటుందని నిర్ణయించాడు. పాండవులంటే ప్రత్యేకాభిమానంగల విరాటుని కొల్వులో తమ ఏడాది జీవితం సజావుగా సాగిపోతుందని



అందరూ అనుకున్నారు. అక్కడ యుధిష్ఠిరుడు కంకుభట్టు పేరుతో పాచికలాడే బ్రాహ్మణుడిగా భీముడు వల్లవుడు (వలలుడు) అనే వంటవాడుగా అర్జునుడు బృహన్నల అనే పేరుతో సంగీత నృత్యాచార్యుడుగా నకులుడు గ్రంథికుడు (దామగ్రంథి) అనే పేరుతో అశ్వపాలకుడుగా సహదేవుడు తంత్రీపాలుడు' అనే పేరుతో గోరక్షకుడుగా ద్రౌపది సైరంధ్రి అనే పేరుతో రాణీ సుధేష్ణాదేవి దాసిగా చేరారు. వాళ్ళకు జయుడు, జయంతుడు, విజయుడు, జయత్సేనుడు, జయద్బలుడనే రహస్యనామాలు ఏర్పాటు చేశాడు యుధిష్ఠిరుడు.

విరాటుని బావమరిదియైన కీచకుడు వారి సైన్యాధ్యక్షుడు మహాబలవంతుడు, స్త్రీలోలుడు. అతడు సైరంధ్రిని చూసి మోహించాడు. తనను పెళ్ళాడమని బలవంతం చేశాడు. ద్రౌపది (సైరంధ్రి) అతణ్ణి తిరస్కరించింది, తన భర్తలు గంధర్వులని, వాళ్ళకు ఈ విషయం తెలిస్తే సహించరని, చావు తప్పదని హెచ్చరించింది. అయినా కీచకుడు వినలేదు. ఆ మహాసాధ్విని రాజు సమక్షంలోనే అవమానించాడు. ఆమె బాధను చూసిన వలలుడు ద్రౌపదిచేత వాణ్ణి నర్తనశాలకు పిలిపించి, భయంకరంగా చంపి, వాని అవయవాలన్నీ పొట్టలో కూరాడు. సైరంధ్రిపట్ల అందరికీ భయభక్తులు పెరిగాయి.

అజ్ఞాతవాసం పూర్తిగావస్తున్నా పాండవుల ఆచూకీ తెలియకపోవడంతో దుర్యోధనునిలో ఆందోళన అధికమైంది. కురు వీరులందరినీ, పెద్దలనూ కలిసి సమాలోచనం చేశాడు. కీచక వధ గురించి తెలిసింది. ధర్మవర్తనులైన పాండవులు ఎక్కడుంటే అక్కడ ఋతువులు సక్రమంగా నడుచుకుంటాయని, రాజ్యం సుభిక్షంగా ఉంటుందని, ప్రజలు సుఖశాంతులతో జీవిస్తారని చెప్పారు పెద్దలు. ఆ లక్షణాలన్నీ మత్స్యరాజ్యంలో పొడసూపటంతో విరాటునిపైకి యుద్ధానికి వెళ్ళాలని, అక్కడ వాళ్ళుంటే తప్పక బయటపడతారని తలంచాడు దుర్యోధనుడు. ముందుగా త్రిగర్త రాజైన సుశర్మను ఒక పక్క నుంచి విరాటరాజ్యంపై దండెత్తి లక్షగోవులను తోలుకొనిపొమ్మని, తర్వాత భీష్మ, ద్రోణ, కర్ణాది మహావీరులతో కలిసి తాను మరోపక్క నుండి దాడిచేసి మిగతా గోవులను అపహరిస్తానని దుర్యోధనుడు వ్యూహరచన చేశాడు.

అనుకున్న ప్రకారం ముందుగా సుశర్మ దక్షిణంవైపు నుండి దండెత్తి గోవులను తోలుకొనిపోసాగాడు. ఆ విషయం తెలిసి విరాటుడు ససైన్యంగా యుద్ధానికి వెళ్ళాడు. అతనితోపాటు వలలుడు, తంత్రీపాలుడు, దామగ్రంథి కూడా యుద్ధంలో పాల్గొన్నారు. సరిగ్గా అదే సమయానికి ఉత్తర గోగ్రహణం విషయం తెలిసింది. అప్పుడు రాజధానిలో విరాటుని కుమారుడు భూమింజయుడు (ఉత్తరుడు), బృహన్నల మాత్రమే ఉన్నారు. 'నాకు సరైన సారథి ఉంటే కౌరవులను చిటికెలో ఓడించేస్తా'నని ఉత్తరుడు ప్రగల్భాలు పలుకసాగాడు. బృహన్నల సారథిగా ఉండటానికి సిద్ధమయ్యాడు. అయిష్టంగానే బృహన్నలను తీసుకొని యుద్ధరంగానికి వెళ్ళిన ఉత్తరుడు దూరం నుంచి కురువీరులను చూసి, భయంతో రథం దిగి పారిపోసాగాడు. బృహన్నల అతణ్ణి ఆపి, భయపడనవసరం లేదని, తాను వాళ్ళను జయిస్తానని, రథం నడిపించుమని ప్రోత్సహించాడు. తాము విరాటుని కొలువులోకి వచ్చేముందు శమీవృక్షం మీద దాచిన ఆయుధాల నుండి గాండీవాన్ని, అక్షయతూణీరాలను తీసుకొని, కౌరవులతో తలపడ్డాడు. అతని వీరత్వాన్ని చూసి అర్జునుడే అనుకున్నారు. దుర్యోధనుడు తాను అర్జునుణ్ణి గుర్తించానని, అజ్ఞాతవాసభంగమయ్యిందని సంబరపడ్డాడు. కానీ, భీష్ముడు అన్నీ లెక్కగట్టి అప్పటికే పాండవుల అజ్ఞాతవాసకాలం ముగిసిపోయిందని ప్రకటించాడు. అర్జునుడు శత్రువులందరినీ మూర్ఛితులను గావించాడు.

మరోపక్క సుశర్మతో జరిగిన యుద్ధంలో భీముడు అసమాన పరాక్రమం చూపి, అనూహ్యవిజయాన్ని విరాటునికి సాధించి పెట్టాడు. నగరానికి సంతోషంగా చేరుకున్న విరాటునికి, కొడుకు ఒక్కడే కౌరవ వీరులతో యుద్ధానికి వెళ్ళాడన్న సంగతి తెలిసింది. 'అతను తిరిగిరావడం కల్ల' అని ఆందోళనతో దుఃఖితుడయ్యాడు. అంతలో ఉత్తరుడు తిరిగివచ్చాడు. తన విజయానికి బృహన్నలే కారణమని, ఆయనే యుద్ధంచేసి కౌరవులనందరినీ ఓడించాడని చెప్పాడు. మరో రెండు రోజుల్లో వాళ్ళు తమ నిజరూపాలతో విరాటునికి దర్శన మిచ్చారు. విరాటరాజు ఆశ్చర్యానంద చకితుడై, తామేమైనా అపచారాలు చేసి ఉంటే క్షమించాల్సిందిగా ప్రార్థించాడు. తన కూతురైన ఉత్తరను వివాహం చేసుకొమ్మని అర్జునుడ్ని కోరాడు.



అర్జునుడు 'ఉత్తర నా శిష్యురాలు. ఆమె నాకు కూతురుతో సమానం. నేనామెను వివాహమాడలేనుకాని, నా కుమారుడైన అభిమన్యునికిచ్చి పెళ్ళి చేయండి, కోడలిని చేసుకుంటానన్నాడు. ఉత్తరాభిమన్యుల వివాహం వైభవంగా జరిగింది. విరాటుడు పాండవులకు ఉపప్లావ్య పట్టణంలో విడిదిని ఏర్పాటుచేశాడు. కృష్ణబలరామాది యదువీరులంతా వాళ్ళను కలుసుకున్నారు. కాశీరాజు, ద్రుపదమహారాజు, వృష్ణి, భోజ, అంధక తదితర రాజులంతా పాండవులను కలుసుకొని, తమ సైన్యధనాది సంపత్తులన్నీ ధర్మరాజు పరంచేసి, ఎల్లవేళలా ధర్మరాజు సేవకు తమ సంసిద్ధతను ప్రకటించారు.

## 5. ఉద్యోగపర్వం

పాండవపక్ష నేతలంతా విరాటుని కొలువులో సమావేశమయ్యారు. దుర్యోధనుని నుండి తమ అర్ధరాజ్యం తాము ధర్మబద్ధంగా తీసుకోవాలని, అయితే అతనికి ఇచ్చే ఉద్దేశం లేదు గనుక యుద్ధానికి సిద్ధం కావాలని అందరూ నిర్ణయించారు. తమ తమ నిజనివాసాలకు వెళ్ళారు.

యుద్ధం అనివార్యమని, ఇరుపక్షాల వాళ్ళు తమకు సహకరించగలవారి సహాయాన్ని అర్థిస్తూ... సంప్రదింపులు ప్రారంభించారు. అందులో భాగంగా దుర్యోధనుడు ద్వారకకు వెళ్ళి శ్రీకృష్ణుడ్ని కలుసుకున్నాడు. అయితే అతను వెళ్ళేసరికి కృష్ణుడు కపటనిద్ర నటిస్తున్నాడు. అతను కృష్ణుని తలవైపు కూర్చున్నాడు. తర్వాత అర్జునుడు వచ్చాడు. అతడు కృష్ణుని కాళ్ళ చెంత కూర్చున్నాడు. శ్రీకృష్ణుడు లేచి ముందుగా అర్జునుడ్ని చూసి, ఏం కావాలన్నాడు, తర్వాత దుర్యోధనుడ్ని చూసి 'నీకేం కావాలి?' అని అడిగాడు. అర్జునుడు కృష్ణుడ్ని కోరుకున్నాడు. దుర్యోధనుడు పదివేల సైన్యాన్నికోరుకున్నాడు.

శల్యుడు దుర్యోధనుని పక్షం చేరుతూనే పాండవులకు మాట సహాయం చేస్తానని మాటిచ్చాడు. ఇక తమ అరణ్య, అజ్ఞాతవాసాలు ముగిసాయని, అందువల్ల తమ రాజ్యం తమకీయవలసిందని, లేకుంటే యుద్ధం తప్పదని ధౌమ్యుడను పురోహితునితో ధర్మరాజు ధృతరాష్ట్రుని వద్దకు రాయబారం పంపాడు. అతని విజ్ఞప్తిని హస్తినలో అందరూ సమర్థించారు. దుర్యోధనునికి నచ్చజెప్పజూశారు. ధృతరాష్ట్రుడు కూడా సంజయుడ్ని పాండవుల వద్దకు యుద్ధం వద్దని, సంధిచేసుకొని సఖ్యంగా ఉండటానికి సిద్ధపడమని, అదే తనకూ సమ్మతమని, దుర్యోధనుని తప్పులు క్షమించమనీ రాయబారం పంపించాడు. ధర్మరాజు కూడా యుద్ధం తమకు సమ్మతం కాదని, అర్ధరాజ్యమీయకున్నా ఐదూళ్ళిచ్చినా చాలునని సంజయునితో సందేశం పంపాడు. సంజయుడు ఈ సంగతంతా ధృతరాష్ట్రునికి తెలియజేశాడు. విదురుడు ధృతరాష్ట్రునికి అనేక నీతులు ఉపదేశించాడు. అది 'విదురనీతి'గా ప్రసిద్ధమైంది. ధృతరాష్ట్రుడు దుర్యోధనునికి సంధిచేసుకోవడం మేలని ఉపదేశించాడు. దుర్యోధనుడు అంగీకరించలేదు. సూదిమొన మోపేంత నేల కూడా వాళ్ళకీయబోనని స్పష్టం చేశాడు. తర్వాత చివరి ప్రయత్నంగా శ్రీకృష్ణుడు పాండవుల దూతగా రాయబారం నెరపాడు. పాండవులందరి అభిప్రాయాలూ తెలుసుకొని, కౌరవసభలో నివేదించాడు. సంధికి ఒప్పుకోకపోతే యుద్ధమనే అగ్నిలో కౌరవులు మిడతల్లా కాలిపోతారని హెచ్చరించాడు. దుర్యోధనుడు పంతం విడువలేదు, పైగా తన మిత్రులతో కలిసి శ్రీకృష్ణుడిని బంధించాలని చూశాడు. శ్రీకృష్ణపరమాత్మను ఎవరు బంధించగలరు? వాళ్ళ కుట్రలను తుత్తునియలు జేస్తూ కృష్ణుడు తన విశ్వరూపాన్ని చూపించాడు. ఆ మహాతేజోమూర్తిని భీష్మ, ద్రోణ, విదుర, కృపాచార్యులు, మహర్షులు తప్ప ఎవరూ చూడలేకపోయారు. ధృతరాష్ట్రుడు దేవదేవుని ప్రార్థించి, ఆ దివ్యరూపాన్ని సందర్శించుకున్నాడు. గాంధారి కూడా కుమారుని మనసు మార్చడానికి ఎంతగానో ప్రయత్నించి విఫలమైంది.

తర్వాత కృష్ణుడు కర్ణునికలిసి, 'నీవు కుంతీదేవి కుమారుడవు. పాండవుల్లో శ్రేష్ఠుడవు. నీవు వారి పక్షంలో చేరు, మేలు జరుగుతుం'దని హితబోధ చేశాడు. కర్ణుడు 'స్నేహానికి ప్రాణం ఇచ్చేనేను, దుర్యోధనుని వదిలిరాలేనని, నమ్మకద్రోహం చేయలేనని, పాండవుల సాహచర్యంలో లభించే కోటి సుఖాలకంటే, దుర్యోధనునికోసం ప్రాణాలర్పించడమే కీర్తిదాయకమని కృష్ణుని మాట



తోసిపుచ్చాడు. అటుపిమ్మట కృష్ణుని ప్రేరణతో కుంతి కూడా ఆ ప్రయత్నం చేసింది. 'కన్నతల్లి మీది గౌరవంతో నీ కొడుకుల్లో అర్జునుడ్ని తప్ప, తక్కిన వాళ్ళను వధించ'నని కర్ణుడు ఆమెకు మాటిచ్చాడు.

యుద్ధం నిశ్చయమైంది. కౌరవసైన్యానికి భీష్మపితామహుడు సర్వసైన్యాధ్యక్షుడుగా నియమితుడయ్యాడు. 'తనను పదే పదే అవమానించే భీష్ముడు చనిపోయేదాకా తాను ఆయుధం చేపట్ట'నని కర్ణుడు ప్రతిజ్ఞచేసి, యుద్ధరంగం నుండి తప్పుకున్నాడు. పాండవుల సర్వసైన్యాధ్యక్షుడిగా ద్రౌపది ద్రుష్టద్యుమ్నుడు నియామకమయ్యాడు. దుర్యోధనుడు తమ బలాబలాలను సమీక్షించుకుంటూ భీష్ముడ్ని 'మీ యుద్ధ విశారదత్వం సెలవీయ'మని అడిగాడు. అందుకు భీష్ముడు – "యుద్ధంలో నన్ను మించినవారులేరు. నేను అందరితో అన్ని రకాలుగా యుద్ధం చేస్తాను కాని, శిఖండి నాముందుకు వస్తే నేను అస్త్రాన్ని ప్రయోగించలేను' అని చెప్పాడు. ఎందుకంటే అతడు పూర్వజన్మలో కాశీరాజు పెద్దకుమార్తె అంబ. స్వయంవరంలో భీష్ముడామెను బలవంతంగా ఎత్తుకొనివచ్చినా, 'సాళ్వరాజును ప్రేమించా'నని చెప్పడంతో దయతలచిపొమ్మన్నాడు. సాళ్వుడు కూడా ఆమెను స్వీకరించక పోవడంతో పరమేశ్వరుని గురించి తపస్సుచేసి, భీష్ముడ్ని వధించే వరం పొందింది. ఆ వరప్రభావంతోనే ద్రుపదునికి కూతురుగా పుట్టి, పురుషునిగా జీవిస్తున్నది. ఆమెను చూస్తే భీష్ముడు ధనుస్సెక్కుపెట్టలేడు.

కురుపాండవసైన్యాలు యుద్ధం కోసం కురుక్షేత్రమనే రణక్షేత్రానికి చేరుకున్నాయి.

# 7

## 6. భీష్మపర్వం

కురుక్షేత్రం అనే రణస్థలంలో కురుపాండవసైన్యాలు మోహరింపబడ్డాయి. ఎదురుగా కనిపిస్తున్న గురువులు, తాతలు, తండ్రులు, బంధువులతో యుద్ధం చేయాలన్న విషయం అర్జునునికి బాధకల్గించింది. అస్త్రాలువదిలేసి యుద్ధం చేయనన్నాడు. అప్పుడు కృష్ణుడు – ఎవరి విధిని వాళ్ళు తప్పక నిర్వర్తించాలని, చిత్తశుద్ధితో కృషిచేయాలని, ఫలితం భగవంతుడు నిర్ణయిస్తాడని, కర్మఫలాన్ని అనుభవించడం ఎంతటివారికైనా తప్పదని గీతను ఉపదేశిస్తూ (భగవద్గీత 18 అధ్యాయాలు) అర్జునుణ్ణి కర్తవ్యోన్ముఖుడ్ని చేస్తాడు. యుధిష్ఠిరుడు భీష్మాదుల వద్దకు వెళ్ళి యుద్ధానికి అనుమతిని, ఆశీర్వాదాన్నీ తీసుకుంటాడు.

భీష్ముని నేతృత్వంలో కౌరవులు, ద్రుష్టద్యుమ్నుని నాయకత్వంలో పాండవులు భీకరంగా పోరాటం సాగించారు. ఆ యుద్ధం తొమ్మిది రోజులు నిరాఘాటంగా సాగింది. తొమ్మిదవరోజు శ్రీకృష్ణుడు ధర్మరాజుతో 'భీష్ముడు చనిపోతేగానీ మీకు విజయం లభించదు. ఇప్పటికే తొంభైవేల యోధులను మీరు కోల్పోయారు. అతణ్ణి చంపగలిగే మార్గం ఆయన ద్వారానే తెలుసుకోండి!' అన్నాడు. ధర్మరాజు భీష్ముణ్ణి కలిసి 'యుద్ధంలో మేము జయించే మార్గం చెప్పు'మని అడిగాడు. భీష్ముడు తాను చనిపోతేగాని, కౌరవులను జయించలేరని చెబుతూ, శిఖండిని ముందుంచుకొని యుద్ధం చేయమని సలహాఇచ్చాడు. పదవ రోజు అదే వ్యూహాన్ని అనుసరించి అర్జునుడు భీష్ముడి దేహాన్ని అంగుళంఖాళీ లేకుండా బాణాలతో ఛిద్రంచేశాడు. అయినా తండ్రిగారిచ్చిన 'స్వేచ్ఛామరణ' వరం వల్ల భీష్ముడు చావలేదు. శరీరంలో దిగిన బాణాలే శయ్య (అంపశయ్య)గా పడిపోయాడు.

ఆ స్థితిలో భీష్మునికి దాహంవేస్తే అర్జునుడు తన పర్జన్య బాణంతో పాతాళగంగను పైకి తెప్పించి అతని దాహం తీర్చాడు. ధర్మజ, దుర్యోధనాది పౌత్రులను భీష్ముడు ఓదార్చాడు, కృష్ణుని సాంత్వన వచనాలు శ్రద్ధగా విన్నాడు. కర్ణుడు తనను క్షమించమని వేడుకొనగా ప్రేమతో అతడ్ని దీవించి ఇప్పటికైనా పాండవ పక్షంలో చేరమని హితబోధ చేశాడు. కర్ణుడు 'స్నేహంకోసం నా ప్రాణాలు తృణప్రాయంగా భావిస్తా'నని, దుర్యోధనుని పక్షాన్నే పోరాడుతానని, భీష్ముని సూచనను తోసిపుచ్చాడు.



## 7. ద్రోణపర్వం

చేసిన ప్రతిజ్ఞననుసరించి కర్ణుడు యుద్ధరంగంలోకి దిగాడు. ద్రోణుడు సర్వసైన్యాధ్యక్షుడయ్యాడు. సకల శస్త్రాస్త్రవేదియైన ద్రోణుడు యుద్ధరంగంలో రౌద్రరూపంతో పాండవసేనపై విరుచుకుపడ్డాడు. గురువును మించిన శిష్యుడుగా కీర్తిగాంచిన అర్జునుడు అతడ్ని సమర్థంగా ఎదుర్కొన్నాడు. దుర్యోధనుడు ద్రోణునితో 'ధర్మరాజును పట్టి బంధిస్తే మనం విజయం సాధించినట్లే. ఆ పనిచేయండి!' అని మొరపెట్టుకున్నాడు. 'అర్జునుణ్ణి మిగతా పాండవులనుండి దూరంగా తీసుకొనివెళ్తే, ఆపని చేయడం సులభమవుతుంది. కృష్ణార్జునులను జయించడం సృష్టిలో ఎవ్వరి తరమూకా'దన్నాడు ద్రోణుడు. సంశప్తకులు అర్జునుడ్ని రెచ్చగొట్టి యుద్ధరంగంలో దక్షిణం వైపు దూరంగా తీసుకొనిపోయారు. ఆ సమయంలో విచిత్రమూ, అభేద్యమూ అయిన పద్మవ్యూహరచన చేశాడు ద్రోణుడు. అర్జునుడులేని పాండవులు ఆ వ్యూహాన్ని ఛేదించడానికి అశక్తులు. ఆ రహస్యం తెలిసిన అభిమన్యుడ్ని ముందునడువుమని, తాము వెనుకనే వస్తామని ధర్మరాజు కోరాడు. పెదతండ్రి ఆజ్ఞతో, మహోత్సాహంగా పద్మవ్యూహంలోకి చొరబడ్డాడు అభిమన్యుడు. పరమేశ్వరునితో పొందిన వరబలం చేత జయద్రథుడు (సైంధవుడు) ధర్మరాజాదులను అడ్డుకున్నాడు. అభిమన్యుడు తన తండ్రుల సాయంకోసం ఎదురుచూడకుండానే మహోగ్రంగా యుద్ధం చేశాడు. కర్ణ, ద్రోణ, కృప, అశ్వత్థామ, బృహద్బల, కృతవర్మ అనే ఆరుగురు మహారథులు ఒక్కటై, ఒంటరి బాలుడైన అభిమన్యునిపై ఒక్కసారిగా దాడిచేశారు. రథాన్ని ముక్కలు చేశారు; గుఱ్ఱాలను హతమార్చారు; ధనుస్సు విరిచేశారు; ఖడ్గాన్ని ముక్కలు చేశారు; గదను నుగ్గునుగ్గు చేశారు. రక్తసిక్తమైన దేహంతో, అమ్ముల బాధను తట్టుకుంటూనే, రథ చక్రాన్నే సుదర్శన చక్రమనిపించేలా మహావీరోచితంగా యుద్ధం చేశాడు అభిమన్యుడు. కాని అందరూ మూకుమ్మడిగా దాడి చేయడంతో వీరస్వర్గమలంకరించాడు సుభద్రానందనుడు. 'మరో అర్జునుడు' అని శత్రువుల చేత కొనియాడబడి, పార్థివ దేహాన్ని వీడినా, అందరిచేత గొప్ప సాహసికుడిగా, మహావీరుడిగా కీర్తింపబడ్డాడు అభిమన్యుడు.

అభిమన్యుని మరణంతో అందరూ దుఃఖసాగరంలో మునిగిపోయారు. ధర్మరాజు తీవ్ర నిరాశలో మునిగిపోయాడు. నిర్వేదవశు డైపోయాడు. అర్జునునికి, జరిగిన సంగతంతా వివరించాడు ధర్మరాజు. అభిమన్యుని మరణానికి పరోక్షంగా కారణమైన సైంధవుడ్ని మరుసటిరోజు సూర్యుడస్తమించకముందే సంహరిస్తానని, అట్లా చేయలేకపోతే అగ్నిప్రవేశం చేసి దేహం చాలిస్తానని భీషణ ప్రతిజ్ఞ చేశాడు అర్జునుడు. అర్జునుడి నుండి జయద్రథుణ్ణి (సైంధవుడు) కాపాడటానికి భయంకరమైన వ్యూహరచన చేశాడు ద్రోణుడు. ఏడు అక్షౌహిణిల సైన్యం మధ్య అతడ్ని దాచి, తామంతా ముందుండి అర్జునునితో యుద్ధం చేయసాగారు ద్రోణాదులు. సూర్యుడు పశ్చిమదిశకు చేరుకుంటున్నాడు, జయద్రథుడ్ని కనిపెట్టలేకపోయాడు అర్జునుడు. అప్పుడే హఠాత్తుగా చీకటి పడేటట్లు చేశాడు కృష్ణుడు తన మయాశక్తితో. కౌరవసేన ఆనంద తాండవం చేయసాగింది. జయద్రథుడు చావకపోగా, పాండవ మధ్యముడు అర్జునుడు ఆత్మత్యాగం చేసే దుస్థితి దాపురించింది అనుకున్నారు అంతా. సైంధవుడు నిర్భయంగా సైన్యమధ్యం నుండి బయటికొచ్చాడు. అప్పుడు కృష్ణుడు తన మాయను ఉపసంహరించి, సూర్యుడు కనపడేటట్లు చేశాడు. 'అర్జునా! అదిగో సూర్యుడు ఇదిగో జయద్రథుడు. వెంటనే వీని తల నరుకు!' అన్నాడు. అందరూ చూస్తూండగానే వాడిబాణంతో ఆ సైంధవాధముని తల మొండెం నుండి వేరు చేశాడు అర్జునుడు. అప్పుడు కృష్ణుడు మరో మాట చెప్పాడు. 'వీని తండ్రి వృద్ధక్షత్రుడు, తన కొడుకు తలను ఎవడు నేలపై పారేస్తాడో వాని తల వంద ముక్కలవుతుం'దని శపించి ఉన్నాడు. వాడిప్పుడు శమంతపంచకవనంలో తపస్సు చేస్తున్నాడు. ఈ తలను నేలమీద పడనీయక, సరాసరి వాని తండ్రి ఒడిలో పడేట్లు చేయి' అన్నాడు. అర్జునుడు మరో బాణంతో ఆపని పూర్తిచేశాడు. హఠాత్తుగా ఒడిలోపడ్డ తలను నేలమీదికి విసిరిన వృద్ధక్షత్రుడు తల నూరుముక్కలై చచ్చాడు.

తమ్ముడు అభిమన్యుడు కౌరవాధముల చేతిలో వధింపబడి వీరస్వర్గమలంకరించినాడన్న విషయం తెలుసుకున్న ఘటోత్కచుడు ధర్మరాజు అనుమతితో యుద్ధరంగంలోకి దిగాడు. తన మాయాయుద్ధంతో కౌరవుల లక్షలాది సైన్యాలను సంహరించాడు. అలంబసుణ్ణి వధించాడు. అశ్వత్థామను గాయపరిచాడు, కర్ణుణ్ణి ఓడించాడు. అందరినీ నానా యాతనలకు గురిచేయసాగాడు.



అప్పుడు దుర్యోధనుడు 'నీవద్ద నున్న దివ్యాస్త్రాన్ని ప్రయోగించి ఈ ఘటోత్కచుని పీడ విరగడ గావించు'మన్నాడు కర్ణునితో. అర్జునుణ్ణి చంపడం కోసం ప్రయోగించకుండా అట్టేపెట్టుకున్న ఆ అస్త్రాన్ని కర్ణుడు తన మిత్రుడన్న మాట కాదనలేక ఘటోత్కచుని మీద ప్రయోగించాడు. ఘటోత్కచుడు రణభూమిలో కూలిపోయాడు. ఘటోత్కచుడు చనిపోయాడన్న బాధకంటె, కర్ణుడు దివ్యాస్త్రాన్ని అర్జునుని మీద ప్రయోగించే అవకాశమికలేదన్న ఆనందం ప్రకటించాడు కృష్ణుడు.

యుద్ధం మరింత భీకర రూపం దాల్చింది. ద్రోణుడు ద్రుపదుడ్ని సంహరించాడు. ద్రుష్టద్యుమ్నుడు ఉగ్రుడయ్యాడు. అర్జునుడు 'అధర్మపక్షం చేరినందుకు గురువునైనా నిర్జించక తప్పదన్న ఆగ్రహం పూనాడు. ఎవరెంత ప్రయత్నం చేసినా ద్రోణుణ్ణి మాత్రం జయించలేకపోయారు. ఎనభైయేదేళ్ళ వయస్సులోనూ నవయువకుడిలా పోరాడుతున్న ద్రోణుడ్ని ఎదుర్కొనడానికి వ్యూహం తోచక తికమకపడుతున్న పాండవులకు కృష్ణుడు ఉపాయం చెప్పాడు – 'ద్రోణునికి కొడుకంటే పంచప్రాణాలు. అశ్వత్థామ చనిపోయాడని ధర్మరాజు అబద్ధమాడాలి. దాంతో అతడు అస్త్రసన్యాసం చేస్తాడు. అప్పుడు అనాయాసంగా వధించవచ్చు'. దీనికి సత్యసంధుడైన ధర్మరాజు ఒప్పుకోలేదు. కాని యుద్ధరంగంలో అప్పుడే అశ్వత్థామ అనే పేరుగల ఏనుగు చనిపోయింది. అప్పుడు ధర్మరాజు – 'అశ్వత్థామ చనిపోయాడు కాని అది ఏనుగు' అన్నాడు. అయితే మొదటి భాగం గట్టిగా అరచి, రెండో భాగం వినిపించనట్లు గొణిగాడు. సత్యవాక్కు అయిన ధర్మరాజు మాటలు విన్న ద్రోణుడు నిజంగానే తన కొడుకు చనిపోయాడని అస్త్రసన్యాసం చేశాడు. అదే అదనుగా ద్రుష్టద్యుమ్నుడు ఖడ్గంతో ద్రోణుని తలను మొండెం నుండి వేరుచేశాడు. ఈ విషయం తెలిసిన అశ్వత్థామ మహోగ్రుడై పాండవులను వధిస్తానని ప్రతిజ్ఞ చేశాడు.

# 8

## 8. కర్ణపర్వం

ద్రోణుని మరణంతో దుర్యోధనుడు కర్ణుడ్ని సర్వసైన్యాధిపతిని చేశాడు. కర్ణుడి రథసారథిగా శల్యుడ్ని ఎంపిక చేసుకున్నాడు. మద్ర దేశాధిపతి శల్యుడు ధర్మరాజుకు కూడా యుద్ధంలో మాట సాయం చేస్తానని మాటిచ్చి ఉన్నాడు. అందుకే కర్ణునికి సారథ్యం వహిస్తూనే కఠినమైన నిందా వాక్యాలతో, శత్రువీరుల పొగడ్తలతో అతడ్ని నిర్వీర్యుడ్ని చేయడానికి పూనుకున్నాడు. (అందుకే మన వైపు ఉండి కూడా శత్రువులకు సాయంచేసేవారిని చూసి ఇప్పటికీ శల్యసారథ్యం అనే మాట ఉపయోగిస్తున్నాం). కర్ణుడు యుద్ధరంగంలో భయంకరంగా విజృంభించాడు. కౌరవసైన్యం అతని విజృంభణతో ప్రేరేపితులై రెట్టించిన ఉత్సాహంతో యుద్ధం చేయసాగారు. మరోపక్క పాండవుల్లో పట్టుదల ఏమాత్రం తగ్గలేదు. భీముడు మొదటిరోజు నుండీ కౌరవులను వరుసబెట్టి యమపురికి పంపిస్తూనే ఉన్నాడు. అశ్వత్థామ తండ్రిని కోల్పోయినప్పటి నుండి ప్రతీకారేచ్ఛతో రగిలిపోతూనే ఉన్నాడు. పాండవులు కూడా అభిమన్యుడ్ని, ఘటోత్కచుడ్నీ కోల్పోయి కుపితులై ఉన్నారు. ఈ నేపథ్యంలోనే భీమునికి దుశ్శాసనుడు ఎదురయ్యాడు రణరంగంలో.

ఒక్కసారి భీమునికి ద్రౌపదికి నిండు సభలో జరిగిన పరాభవం గుర్తుకొచ్చింది. తన ప్రతిజ్ఞ అతనెన్నడూ మరచిపోలేదు. దుశ్శాసనునితో మొదట గదాయుద్ధంచేసి, ఓడించి, ఆపై పారిపోతున్న దుశ్శాసనునిపట్టి, నేలమీదపడేసి, తన వాడి గోళ్ళతో వాని గుండెను భయంకరంగా చీల్చాడు. దోసిళ్ళతో నెత్తురు తాగి, అంతటితో ఆగక వాని పేగులు హారాల్లా మెడలో వేసుకొని భీకరంగా గర్జించాడు. అది చూసిన శత్రువుల గుండెలవిసిపోయాయి. సైనికులు చాలా మంది అది చూస్తూనే పారిపోయారు.

యుద్ధరంగంలో కర్ణార్జునులు ఎదురయ్యారు. కర్ణుడు అంతకు ముందే ధర్మరాజు, భీముడు, నకుల సహదేవులు తన చేతికి చిక్కినా, తల్లికిచ్చిన మాటప్రకారం వాళ్ళను చంపకుండా వదిలిపెట్టాడు. ఒకరినొకరు అధిక్షేపించుకుంటూ అర్జునుడూ, కర్ణుడు పరస్పరం అస్త్రాలు ప్రయోగించుకోసాగారు. కర్ణునివద్ద అర్జునుని మీద ప్రయోగించడానికి శక్తివంతమైన అస్త్రం ఒకటి ఇంకా






మిగిలే ఉంది. అది సర్పముఖాస్త్రం. అది ఎంతో భయంకరమైంది. అగ్నికి వాయువు తోడైనట్లు ఎప్పుడో ఖాండవదహనంలో తన తల్లి చావడానికి కారణమైన అర్జునునిమీద ప్రతీకారం తీర్చుకోవడానికి ఎదురుచూస్తున్న అశ్వసేనుడు (తక్షకుని కొడుకు) అదృశ్యరూపంలో కర్ణుని తూణీరంలో చేరాడు. కర్ణుడు సర్పముఖాస్త్రం ప్రయోగించినప్పుడు దాన్ని ఆవహించి, విషపూరితం గావించి అర్జునుని మీదికి దూసుకొనిపోయాడు. ఇదంతా గమనించిన కృష్ణుడు రథాన్ని బలంగా అడుగుమేర భూమిలోకి తొక్కాడు. అర్జునుని కంఠానికి తగలవలసిన బాణం కిరీటానికి తాకింది. ఇంద్రుడు ప్రసాదించిన ఆ దివ్య కిరీటం కూడా విషాగ్నికీలల్లో పడి కాలి, కాంతివిహీనమై పడిపోయింది. దాంతో రెచ్చిపోయిన అర్జునుడు శరపరంపరగురిపించి, రథాన్ని, సారథిని, కర్ణుణ్ణి తీవ్రంగా గాయపరిచాడు. అప్పుడే కర్ణుని రథం నేలలోనికి కుంగిపోసాగింది. నేలలో దిగబడిన తన రథాన్ని ఎత్తే ప్రయత్నం చేయసాగాడు కర్ణుడు. కర్ణుడ్ని చంపడానికి అదే తగిన సమయమని, అస్త్రం సంధించుమని అర్జునుణ్ణి ప్రోత్సహించాడు కృష్ణుడు. 'అది అధర్మ' మని అడ్డుకో బోయిన కర్ణుణ్ణి – 'అభిమన్యుణ్ణి చంపడం అధర్మం కాదా?' అని నిలదీశాడు కృష్ణుడు. కొడుకు మరణ సంఘటన గుర్తుకురాగానే అర్జునుడు రెట్టించిన కోపంతో కర్ణుడిపై దివ్యాస్త్రం ప్రయోగించి నిహతుణ్ణి చేశాడు.

స్నేహితుని మరణంతో దుర్భరశోకంలో కూరుకుపోయాడు దుర్యోధనుడు. ప్రముఖులందరూ చనిపోయినా అతనిలో యుద్ధవిముఖతకు బదులు యుద్ధోన్మాదం విజృంభించింది. కర్ణుడు గొప్పదానశీలి. మహాపరాక్రమవంతుడు, అతులిత శస్త్రాస్త్ర విద్యాపారంగతుడు కానీ దుష్టుడైన దుర్యోధనుని సాహచర్యంలో అధర్మం పక్షం వహించి, అర్థరహితంగా దేహయాత్ర చాలించాడు.

## 9. శల్యపర్వం

కర్ణుడు చనిపోయిన తర్వాత మద్ర రాజైన శల్యుణ్ణి సర్వ సైన్యాధ్యక్షుణ్ణి చేశాడు దుర్యోధనుడు. శల్యుడు యుధిష్టిరునితో జరిగిన ఘోర యుద్ధంలో అనుచరులతో సహా హతమయ్యాడు. శకునిని, అతని కొడుకైన ఉలూకుని సహదేవుడు సంహరించాడు. ఆ విధంగా దుర్యోధనుని 11 అక్షోహిణుల సైన్యమంతా చనిపోయింది. కేవలం వందల సంఖ్యలో సైనికులు మిగిలారు. యోధుల్లో అశ్వత్థామ, కృతవర్మ, కృపాచార్యుడు మాత్రం దుర్యోధనుని పక్షంలో ఉన్నారు. ఈ పరిస్థితినంతా చూసిన దుర్యోధనుడు క్షతగాత్రుడై, యుద్ధభూమిని వదిలి ఒక సరోవరంలో దాక్కున్నాడు. అతనికి జలస్తంభన విద్యవచ్చు. అందులోనే అడుగున హాయిగా విశ్రాంతి తీసుకుంటున్నాడు.

ఆ విషయం భిల్లులవలన యుధిష్ఠురునికి తెలిసింది. అతడు తమ్ముళ్ళను, కృష్ణుడ్ని వెంటపెట్టుకొని ఆ మడుగు వద్దకు వెళ్ళాడు. దుర్యోధనుణ్ణి బయటికొచ్చి యుద్ధం చేయమని ఆహ్వానించాడు. 'మాలో ఏ ఒక్కరిని సంహరించినా ఓటమిని అంగీకరిస్తా' మన్నాడు. దుర్యోధనుడు – తనకు గదాయుద్ధమంటే ఇష్టమని, భీమునితో పోరాడుతానని ప్రకటించి సరోవరం నుండి వెలుపలికి వచ్చాడు.

భీమ దుర్యోధనులు అతిభీకరంగా తలపడ్డారు. ఆ యుద్ధంలో భీముడు అంతకు మునుపుచేసిన ప్రతిజ్ఞ ప్రకారం తన బలమైన గదతో దుర్యోధనుని తొడలు నుజ్జు నుజ్జుచేశాడు.

శ్రీకృష్ణుడు హస్తినాపురానికి వెళ్ళి, ఘోరయుద్ధంతో కొడుకుల మరణం అత్యంత విషాదంలో మునిగి ఉన్న గాంధారీ ధృతరాష్ట్రులను ఓదార్చాడు. అదే సమయంలో అశ్వత్థామ దుర్యోధనుని దుస్థితికి చింతిస్తూ, అతణ్ణి సాంత్వనపరిచే ప్రయత్నం చేశాడు. దుర్యోధనుడు ఆ స్థితిలోనూ అశ్వత్థామను సైన్యాధ్యక్షుణ్ణి చేసి, పాండవులను చంపి, తనకు చిత్తశాంతిని కలిగించమన్నాడు.

## 10. సౌప్తికపర్వం

అశ్వత్థామ మిగతా ఇద్దరు యోధులతో సంప్రదించి పాండవులను కపటంతో చంపాలని యోచన చేశాడు. కృపాచార్యుడు యుద్ధనీతిని తెలిపి వారింపజూశాడు. కాని ప్రతీకారజ్వాలతో రగిలిపోతున్న అశ్వత్థామ తన ప్రయత్నాన్ని సమర్థించుకున్నాడు.



సైన్యాధ్యక్షుని మాట కాదనలేక కృపాచార్యుడు అతణ్ణి అనుసరించాడు. రాత్రిపూట అందరూ నిద్రిస్తూన్న సమయంలో పాండవ శిబిరం చేరుకున్నారు. బయట కృతవర్మ, కృపాచార్యులు కాపలా కాస్తూండగా అశ్వత్థామ లోపలికి వెళ్ళబోయాడు కాని ద్వారం వద్ద ఒక మహాకాయుడు అనేక హస్తాలతో, మండుతున్న అగ్ని జ్వాలలా కాపలా కాస్తూ అశ్వత్థామను లోనికి వెళ్లకుండా అడ్డుకున్నాడు. అతనితో పోరాడలేక, మహాదేవుడని గుర్తించి, ఆత్మత్యాగం చేసుకోబోయాడు. శివుడతణ్ణి వారించి, ఖడ్గాన్నిచ్చాడు. ఆ ఖడ్గంతో శిబిరంలోకి ప్రవేశించి, నిద్రిస్తున్న ద్రుష్టద్యుమ్నుణ్ణి, పాండవుల కొడుకులను ఐదుగురినీ హతమార్చాడు. అంతటితో ఆగక శిబిరంలోని గుఱ్ఱాలను, ఏనుగులను, వేలాదిమంది సైనికులనూ కత్తికి ఎరగావించాడు. నిద్రమత్తులో బయటపడి పారిపోజూచిన వాళ్ళనూ పట్టి హతమార్చారు కృతవర్మ కృపాచార్యులు. ఆ తర్వాత ముగ్గురూ కలిసి దుర్యోధనునికి జరిగిన సంగతి అంతా వివరించారు. ఆ వార్త విన్న తర్వాత తృప్తిగా కన్నుమూశాడు దుర్యోధనుడు.

కొడుకులందరూ అశ్వత్థామ అకృత్యానికి బలికాగా తీవ్రశోకంలో మునిగిపోయింది ద్రౌపది. యుధిష్ఠిరుడూ శోకవ్యాకులుడైనాడు. భీమార్జునులు అశ్వత్థామను సంహరించడానికి సిద్ధమైనారు. అశ్వత్థామార్జునుల మధ్య ఘోర యుద్ధం జరిగింది. పరస్పరం బ్రహ్మాస్త్రాలు ప్రయోగించుకున్నారు. ఎక్కడ రెండు బ్రహ్మాస్త్రాలు తలపడతాయో అక్కడ పన్నెండేళ్ళు వర్షాలు పడవని మహర్షులు హితబోధ చేయడంతో అర్జునుడు తన బ్రహ్మాస్త్రాన్ని ఉపసంహరించాడు. ఆ శక్తి లేని అశ్వత్థామ దానిని ఉత్తర గర్భంలోని శిశువుమీదికి మళ్ళించాడు. తన తలమీదున్న విలువైన మణిని పాండవులకిచ్చాడు. నిర్లిప్తమైన మనస్సుతో అక్కడి నుండి అడవుల్లోకి వెళ్ళిపోయాడు.

## 11. స్త్రీపర్వం

కొడుకులు, బంధువులు, కురుశ్రేష్ఠుల మరణవార్తల వలన ధృతరాష్ట్రుడు, గాంధారి శోక సముద్రంలో మునిగిపోయారు. వాళ్ళను సంజయుడు, విదురుడు ఓదార్చారు. పాండవులు గాంధారీ ధృతరాష్ట్రులను కలుసుకోగా, గాంధారి భీమునిపై కోపించింది. ఇంతటి ఉపద్రవానికి కారణం భీముడేనని, భీముణ్ణి దూషించింది. వ్యాసుడు, భీముడు ఆమెను శాంత పరచారు.

స్త్రీలందరూ తమ భర్తలకు, పుత్రులకు తిలాంజలులు సమర్పించారు. అప్పుడు కుంతి కర్ణుని జన్మ రహస్యం పాండవులకు చెప్పింది. పాండవులెంతగానో దుఃఖించారు.

## 12. శాంతిపర్వం

తనవాళ్ళనందరినీ చంపుకొని ఈ నెత్తురు కూడు తినలేనని, తనకు రాజ్యం అక్కరలేదని వనవాసానికి వెళ్ళడానికి సిద్ధపడ్డ ధర్మరాజును అర్జునుడు శాంతింపజేశాడు. వ్యాసుడు, శ్రీకృష్ణుడు ధర్మరాజును ఓదార్చి, హస్తినాపుర ప్రవేశానికి ఒప్పించారు. ధర్మరాజు శ్రీకృష్ణుని పూజించి, యుద్ధంలో చనిపోయిన వీరుల కుటుంబాలను ఘనంగా సత్కరించాడు. ఆ తర్వాత కృష్ణుని అనుమతితో భీష్ముని దర్శించుకున్నాడు. భీష్ముడు ధర్మబోధ చేశాడు. సత్యం, ధర్మం, శీలం, శాంతి, ధైర్యం, స్వచ్ఛత కాపాడుకుంటూ క్షత్రియధర్మాన్ని నిర్వర్తించమని, న్యాయపాలన చేసి సత్కీర్తిగడించమని సాధించుకున్న అధికారాన్ని బాధ్యతగా నిర్వహించమని చెప్పాడు. ధర్మపాలకుల కథలను చెప్పాడు.

## 13. అనుశాసనపర్వం

రాజధర్మానికి, పరిపాలనకు, న్యాయానికి, కర్తవ్యనిర్వహణకు సంబంధించిన అనేక ప్రశ్నలు అడిగాడు ధర్మరాజు. ఓపికగా వాటన్నిటికీ సమాధానాలు చెప్పాడు భీష్ముడు. దానం; స్వర్గనరకాలను కలిగించే కర్మలు; బ్రహ్మహత్యతో సమానమైన పాపాలు; గంగా మాహాత్మ్యం; పూజ్యపురుషలక్షణాలు; కన్యావివాహ విషయాలు; గో మహాత్మ్యం; శుభకర్మలు – వాటి ఫలితాలు; బ్రాహ్మణ ప్రశంస – ఆరాధన; యజ్ఞదాన విశేషాలు; ఉత్తములను రక్షించడం, భూదాన మహిమ, అన్న, సువర్ణ, జలదానాల మహిమ;



వ్రత, నియమ, దయాది సద్గుణాల ప్రశంసను బోధిస్తాడు. దేవతలు, ఋషులు మొదలైన వారి స్మరణ గొప్పతనాన్ని వివరించాడు. విష్ణుసహస్రనామాన్ని కూడా పాండవులకు చెప్పాడు. చివరగా శ్రీకృష్ణుని అనుమతితో దేహయాత్ర చాలించాడు భీష్ముడు. ధర్మరాజు శాస్త్రయుక్తంగా ఆ మహనీయునికి అంత్యేష్టి సంస్కారం నిర్వహించాడు.

## 14. అశ్వమేధపర్వం

శ్రీకృష్ణుడు ధర్మరాజుకు జీవుని మరణం, అతని త్రివిధ గతులను గురించిన (జీవనం, నరకం, స్వర్గం) జ్ఞానబోధ చేసి, దుఃఖాన్ని ఉపశమింపజేశాడు. తర్వాత శ్రీకృష్ణుడు ద్వారకకువెళ్ళి, తనవారి నందరినీ కలిసి, కురుక్షేత్రయుద్ధ విశేషాలను వివరించాడు. ఉత్తర మృతశిశువుకు జన్మనిచ్చింది. అందరూ దుఃఖించారు. శ్రీకృష్ణుని కృపతో ఆ బాలుడు బతికాడు. అతనికి 'పరీక్షిత్తు' అని పేరు పెట్టారు. వ్యాసుడు, శ్రీకృష్ణుల ఆజ్ఞతో ధర్మరాజు అశ్వమేధయాగాన్ని ఆరంభించాడు. యాగాశ్వాన్ని రక్షించడానికి అర్జునుడు వెళ్ళాడు. రాజులందర్నీ జయిస్తూ వెళ్తున్న అర్జునుణ్ణి బభ్రువాహనుడు అడ్డగించి, యుద్ధంలో వధించాడు. ఉలూచి నాగులకు ఆధారభూతమైన సంజీవ మణిని స్మరించి, దాంతో అర్జునుడ్ని పునర్జీవితుడ్ని చేసింది. బభ్రువాహనుడు తన కుమారుడేనని తెలుసుకొని అర్జునుడు సంతోషిస్తాడు. ధర్మరాజు అశ్వమేధయాగం పూర్తిచేస్తాడు.

## 15. ఆశ్రమవాసికపర్వం

గాంధారితోపాటు ధృతరాష్ట్రుడు ప్రజాపాలన బాధ్యతలను ధర్మరాజుకు అప్పగించి వానప్రస్థానికి బయలుదేరాడు. కుంతి కూడా వారివెంట అడవులకు వెళ్ళింది. అడ్డుకో జూచిన పాండవులను, ద్రౌపదిని ఓదార్చింది. వాళ్ళు గంగా తీరంలో కొంతకాలం విశ్రమించి, తర్వాత కురుక్షేత్రానికి చేరుకొని ఘోరమైన తపస్సుచేశారు. పాండవులు తర్వాత కొంతకాలానికి వాళ్ళను దర్శించుకొని, వారి సందేశాన్ని విన్నారు. వనవాసంలో ఉండగానే స్వర్గారోహణం చేసిన కుంతి, గాంధారి, ధృతరాష్ట్రులకు అంత్యేష్టిని నిర్వహించారు పాండవులు.

## 16. మౌసలపర్వం

దైవోపహతులైన యాదవులు ఒకరోజు కృష్ణుని కుమారుడైన సాంబునికి స్త్రీవేషం వేసి, గర్భవతిలా అలంకరించి, మహా తపోధనులైన విశ్వామిత్ర, కణ్వ, నారద మహర్షుల వద్దకు వెళ్ళి, "ఈ స్త్రీ బభ్రుని భార్య. ఈమెకు కలిగే సంతానం గురించి చెప్పండి!" అని అడిగాడు.

వాళ్ళు తమ తపశ్శక్తిని, దివ్యశక్తులనూ అపహసించడం చూసి, ఆగ్రహావేశులై, "ఇతని గర్భంలో ఇనుపముసలం (రోకలి) పుడుతుంది. అది యాదవులైన అంధక, వృష్టి వంశాలను నాశనం చేస్తుంది. బలరామ కృష్ణులు తప్ప అందరూ మా శాపానికి గురి అవుతారు" అని శపించారు.

ఈ విషయం ఉగ్రసేన మహారాజుకు తెలిసింది. సాంబునికి ముసలం పుట్టింది నిజంగానే. కాని వెంటనే దాన్ని చూర్ణంగా మార్చి సముద్రంలో పారబోయించాడు రాజు.

యాదవులు తీర్థయాత్రలు చేయడానికి సకుటుంబ సపరివారంగా బయలుదేరారు. వాళ్ళు ప్రభాస క్షేత్రంలో సముద్రతీరాన విడిది చేసి సరదాగా మాట్లాడుకుంటూండగానే అభిప్రాయభేదాలు తలెత్తి, ఒకరినొకరు కొట్టుకోవడం మొదలెట్టారు. ఏ ఆయుధాలు లేని ఆ ప్రదేశంలో తీరంలోని గడ్డిపరకలు (తుండముస్తెలు) చేతుల్లోకి తీసుకోగానే అవి క్షణాల్లో ఇనుప రోకళ్ళుగా మారిపోయాయి. వాటితో అందరూ ఒకరినొకరు కొట్టుకొని హతులైపోయారు. బలరాముడు తపస్సు చేసుకోవడానికి వెళ్ళాడు. తపస్సు చేసుకుంటున్న బలరాముణ్ణి దర్శించుకొని, అడవిలో ఒకచోట నేలపై పడుకొని ఉండగా 'జర' అనే వేటగాని బాణం దెబ్బతో ప్రాణాలను త్యజించి, కృష్ణుడు అవతారాన్ని ఉపసంహరించాడు.



## 17. మహాప్రస్థానికపర్వం

వృష్టివంశ నాశనాన్ని గురించి తెలుసుకున్న ధర్మరాజు, ఆ వంశంలోని కృష్ణుని మనుమడు వజ్రుణ్ణి యాదవరాజ్యానికి రాజునుచేస్తాడు. ఇంద్రప్రస్థం రాజధానిగా వజ్రుణ్ణి పరిపాలన చేయడానికి నిర్ణయిస్తారు. తమ రాజ్యానికి కూడా పరీక్షిత్తును రాజుగా అభిషేకించి, వాళ్ళిద్దరినీ జాగ్రత్తగా చూసుకొమ్మని సుభద్రకు బాధ్యతనప్పగించి, భార్య ద్రౌపది, సోదరులు భీమార్జున నకుల సహదేవులు అనుసరిస్తుండగా ధర్మరాజు వానప్రస్థానికి బయలుదేరాడు. ఇదే మహాప్రస్థానం. బంధాలను తృణప్రాయంగా త్యజించి, బాధ్యతలనన్నీ సక్రమంగా అప్పగించి, దేహంమీద మోహం విడిచి, దైవ చింతనతో ఎక్కడా నిలువకుండా దైవంవైపే పయనించడం మహాప్రస్థానోద్దేశ్యం. అట్లా బయలుదేరిన పాండవులు నదులూ, పర్వతాలూ దాటుకుంటూ హిమాలయాన్ని చేరారు. అక్కడి నుండి సుమేరు పర్వతాన్ని దర్శించుకొని వెళ్తుండగా ద్రౌపది పడిపోయింది.

అది గమనించీ చలించకుండా ముందుకు సాగిపోయారు పాండవులు. తర్వాత కొంతదూరం పోయాక సహదేవుడు, ఆ తర్వాత నకులుడు, తదనంతరం అర్జునుడు, ఆపై భీమసేనుడూ వరుసగా పడిపోయారు. కాని మొదటి నుండీ అనుసరిస్తున్న ఒక నల్లకుక్క ధర్మరాజు వెంట ఇంకా వస్తూనే ఉన్నది. అప్పుడు ఇంద్రుడు దివ్యరథంతో ధర్మరాజు వద్దకు వచ్చి, స్వర్గానికి వెళ్దాం రమ్మన్నాడు.

ధర్మరాజు తనకంటె ముందు పడిపోయిన భార్యనూ, సోదరులనూ ముందు స్వర్గానికి చేర్చమని అడిగాడు. అందుకు దేవేంద్రుడు చిరునవ్వుతో, 'వాళ్ళు నీకంటే ముందే స్వర్గం చేరుకున్నారు' అన్నాడు. తనతో వస్తున్న కుక్కను కూడా స్వర్గానికి అనుమతించమని కోరాడు ధర్మరాజు. 'అది నీ పుణ్యాన్నంతా హరించివేస్తుంది, ఇక్కడే వదిలేయ' మన్నాడు ఇంద్రుడు. కాని భక్తి విశ్వాసాలతో తననను సరించే శ్వానాన్ని వదలడం మహాపాపం!' అన్నాడు. అప్పుడా శునక రూపంలో ఉన్న ధర్మదేవత నిజరూపంతో సాక్షాత్కరించి ధర్మరాజు సదాచార బుద్ధిని, సర్వభూతదయనూ ప్రశంసించి ఆశీర్వదించింది.

## 18. స్వర్గారోహణపర్వం

స్వర్గంలో ధర్మరాజు నారదుడ్ని దర్శించాడు. నారదుడు స్వర్గప్రాప్తి పొందిన కౌరవ పాండవాదులందరూ ఇక్కడ ఉన్నారని, మర్త్యలోకంలోని విభేదాలకు, వైషమ్యాలకూ ఇక్కడ తావులేదనీ వివరించాడు. ధర్మరాజు తన వాళ్ళనందరినీ చూడదలచుకుంటున్నా నన్నాడు. దేవేంద్రుడు అందుకు తగిన ఏర్పాట్లు చేశాడు. ఒక దేవదూత ధర్మరాజును తన వెంట తీసుకొని వెళ్ళాడు. ఇరుకైన దారిలో, దుర్గంధపూరితమైన వాతావరణంలో, శవాలు, ప్రేతాత్మల నడుమ, భయంకరమైన చీకటిలో, గుండెలవిసే ఆర్తనాదాల మధ్య కొద్ది దూరం నడిచిన తర్వాత ధర్మరాజు విసుగుచెంది, 'స్వర్గం ఇంత దుర్భరంగా ఉందేం? ఇది భరించలేకపోతున్నాను. ఇంకెంత దూరం వెళ్ళాలి?' అని అడిగాడు దేవదూతను.

"మహారాజా! మీకు ఓపికున్నంతవరకే ఈ దారిలో పయనిస్తాం. ఇక వెనక్కి వెళ్దాం పదండి!" అన్నాడు దేవదూత.

ధర్మరాజు వెనక్కి తిరగగానే, "మహారాజా! దయచేసి మీరు వెనక్కి వెళ్ళకండి. మీరున్నంతసేపు మేము బాధను మరచిపోయాం. కనీసం ఇంకొంచెంసేపు ఇక్కడే ఉండండి!" అని దీనమైన రోదనలు వినిపించాయి. ఆ పరిసరాల నుండి. ఆ ఆర్తనాదాలు తన తమ్ముళ్ళవి, భార్య ద్రౌపదివి, అగ్రజుడు కర్ణునివి, పుత్రులు ఉపపాండవులువి. అవి విన్న ధర్మరాజు దిగ్భ్రాంతికి లోనయ్యాడు.

"నావాళ్ళందరూ ఎందుకింత భయంకరమైన నరకయాతనను అనుభవిస్తున్నారు? వాళ్ళింత దీన స్థితిలో ఉండగా నాకు స్వర్గ సౌఖ్యమవసరం లేదు. ముందువాళ్ళకు స్వర్గసుఖాన్ని కల్పించండి!" అని ప్రార్థించాడు ధర్మరాజు.

అప్పుడు దేవేంద్రునితోపాటు ధర్మదేవత కూడా ప్రత్యక్షమయింది. నిజానికి అతని సోదరులు, భార్య అక్కడలేరని, అదంతా తాము కల్పించిన మాయ అని, ఈ పరీక్షలో ధర్మరాజు కృతకృత్యుడయ్యాడని ప్రకటించారు. స్వర్గంలో కూడా ఆత్మసుఖం కంటె






ధర్మజుని ఆశ్రిత పక్షపాతం వాళ్ళను ముగ్ధులను చేసింది. తన వాళ్ళందరితో పాటు స్వర్గసౌఖ్యాన్ననుభవించమని ఆశీర్వదించారు. సమస్తదేవతలను, వారితోపాటు విహరిస్తున్న తనవాళ్ళ నందరినీ చూసి మహదానందాన్ని అనుభవించాడు ధర్మరాజు.

వ్యాస మహర్షి రచించిన ఈ మహాభారత కథను జనమేజయ మహారాజుకు వైశంపాయన మహర్షి చెప్పాడు.

జనమేజయుడు పరీక్షిన్మహారాజుకొడుకు. పరీక్షిత్తు ఉత్తరాభిమన్యుల సంతానం. (విగత జీవుడుగా పుట్టిన పరీక్షిత్తును కృష్ణ భగవానుడే జీవింపజేసిన సంగతి అశ్వమేధిక పర్వంలో చదువుకున్నారు కదా!)

పరీక్షిన్మహారాజు ఒకరోజు వేటకై అడవికి వెళ్ళి, అలసిపోయి, దాహార్తియై తిరుగుతూండగా ఒక ముని కనిపించాడు. అతడ్ని దాహం తీర్చుమని అడిగితే తపోనిష్ఠలోఉన్న ఆ ముని సమాధానమివ్వలేదు. అందుకు ఆగ్రహించిన పరీక్షిత్తు, ఆ పరిసరాల్లో కనిపించిన చనిపోయిన పాము కళేబరాన్ని అతని మెడలో వేసి వెళ్ళాడు.

ఆ ముని పేరు శమీకుడు. శమీకుని కొడుకు శృంగి. తన తండ్రిని అవమానించినవాడు ఏడుదినముల లోపల తక్షకుడనే సర్పం కరచి చచ్చిపోతా'డని శపించాడు. ఈ విషయం తెలిసిన పరీక్షిన్మహారాజు పశ్చాత్తాపంతో విరక్తుడై మరణం తప్పించుకోలేక, భాగవత కథా శ్రవణం చేస్తూ, తక్షకుని కాటుకు గురి అయి ఏడవ రోజు మరణిస్తాడు. పరీక్షిత్తుకు భాగవత కథ చెప్పినవాడు శుకమహర్షి.

పరీక్షిత్తుని కొడుకు జనమేజయుడు తన తండ్రి చావుకు కారణమైన సర్పజాతి మొత్తం నశించాలని 'సర్పయాగం' చేశాడు. తక్షకుడు ఇంద్రాది దేవతలను ప్రార్థించగా, ఆస్తీకుడు వచ్చి సర్పయాగాన్ని మాన్పించి, పాములన్నీ నశించకుండా కాపాడాడుతాడు. అప్పుడు వైశంపాయనుడు వ్యాసుని సూచన మేరకు జనమేజయుని కోరికననుసరించి ఈ మహాభారత కథనంతా వినిపిస్తాడు.

'జయం' అనే పేరు గల్గిన ఈ మహాభారతం వినడం, చదవడం, జ్ఞానాన్ని, విజయాన్ని, సత్ఫలితాలను, సద్బుద్ధినీ అందజేస్తుందని, భారత కథను జనమేజయునికి వినిపించిన వైశంపాయనుడు పేర్కొన్నాడు.



# పదవిజ్ఞానం

## అర్థాలు

**అ**

అంగలార్చుట = చిందులు వేస్తూ అరవడం
అంబోధి = సముద్రం, కడలి
అఖిలం = అశేషం, నశించనిది
అగ్గించు = అతిశయించు
అచ్చో = ఆసమయాన, అక్కడ
అణా = రూపాయిలో పదహారోవంతు
అతిథి = తిథి, వార, నక్షత్రాలు చూసుకోకుండా ఇంటికి వచ్చేవాడు
అతిథేయులు = ఆతిథ్యం ఇచ్చేవారు
అధిగమించు = తెలియు, పొందు
అనయము = అత్యంతము, అవశ్యము, సతతము, మరిమరి
అనవుడు = అనగా, అన్నప్పుడు
అనృతము = అసత్యము, కృషి
అపభ్రంశము = అపశబ్దము, పదుట, భాషావిశేషము
అపూప = పిండివంట
అభిఘరించు = చల్లు, చిలకరించు
అభిరమ్యము = చాలా అందమైన
అభీప్సిత = కోరిన
అమాంతంగా = అకస్మాత్తుగా
అయుతము = పదివేలు
అటమటి = సంభ్రమం / కలత
అవసరంబు = సమయం
అవిరళము = విరళముకానిది / దట్టమైన
అహరహం = ప్రతిదినం
అర్థాంగలక్ష్మి = శరీరంలో సగభాగమైన లక్ష్మీ సమానురాలు (భార్య)
అర్థి = వేడువాడు, వాది, కొలువుకాడు, కోరిన
అర్ఘ్యపాద్యములు = చేతులు, కాళ్ళు కడుక్కోవడానికి నీళ్ళివ్వడం
అల్పము = సూక్ష్మము
అస్తధృస్తులై = ఉనికి కోల్పోయినవారై (సర్వం చెదరగొట్టుకొన్నవారై)
అస్మచ్చమూధవులు = సైన్యాధిపతులు
అస్థిర = స్థిరముకానిది

**ఆ**

ఆ కంఠం = గొంతుదాకా
ఆచూకీ = జాడ
ఆయతి = ప్రభావం
ఆయత్తం = సిద్ధం
ఆయువు = ప్రాణం
ఆవరణ = ఆచ్ఛాదనం, మూత
ఆవేశపరులు = తొందరపాటుతో మాట్లాడువారు
ఆగ్రహము = కోపం
ఆప్యాయత = ఆదరణ
ఆస్పందద = అదిరే

**ఇ**

ఇందుబింబ + అస్య = చంద్రబింబము వంటి ముఖం కలది / చంద్రముఖి
ఇనాం = బహుమతి, మాన్యము

**ఈ**

ఈప్సితము = కోరిక

**ఉ**

ఉపస్పర్శ = స్నాన, ఆచమనాదికములు
ఉపార్జితం = సంపాదన
ఉలియు = చలించు
ఉల్లాసకరమైన = సంతోషకరమైన, ప్రకాశము
ఉద్యమం = ప్రయత్నం
ఉద్వృత్తి = ఉద్ధతి

**ఎ**

ఎలిమి = కొలువుకాడు, కోరిన



ఎల్లి = రేపు

ఏ

ఏమరుపాటు = అజాగ్రత్త

ఓ

ఓర్పు = సహనం

ఓష్ఠం = పెదవి

ఔ

ఔద్ధత్యము = ఉద్ధతత్వం

క

కంకణములు = వర్తులాకారా ఆభరణాలు

కందభోజులు = కందములు తినేవారు

కటకట = అయ్యయ్యో

కటకటపడు = బాధపడు

కఠారము = ఖడ్గము

కన్నుగవ = కన్నులజంట

కడ = చివర

కథాగమనం = కథనడిచే తీరు

కరంబులు = చేతులు

కరవటంబు = భరిణె / గిన్నె

కలభాష = మధురభాష

కలమధాన్యం = వరిపంట

కలహకంఠి = గొడవలు పెట్టుకొనే స్త్రీ, గయ్యాళి

కళవళం = తొట్రుపాటు

కాడు = అడవి

కాణాచి = చిరకాల వాసస్థానం

కుందాడు = బాధపెట్టినట్లు మాట్లాడడం

కుంభి = ఏనుగు

కుదుస్తున్న = త్రాగుతున్న, భుజించుచున్న

కుసుమస్తభకము = పూలగుత్తి, పూలగుచ్ఛం

కూడలి = నాలుగురోడ్లు కలిసే చోటు

కృశించు = బక్కచిల్లు, సన్నగిల్లు

కేసరములు = పూవులోని పుప్పొడిగల భాగాలు

కేళిక = ఒక విధమైన నృత్యం

కైరవషండము = తెల్లకలువల సమూహము

కొండాడి = పొగడి, స్తుతించి

కొనసాగించడం = నడపడం

కొడిగట్టిన దీపాలు = ఆరిపోవడానికి సిద్ధంగా ఉన్న దీపాలు.

కల్పనము = ఊహ

కమ్రకరములు = ఇంపైన చేతులు

ఖ

ఖలుడు =

ఖేదము = శోకము

గ

గరిమ = శ్రేష్ఠమైన

గగుర్పాటు = భయహర్షాదుల చేత మేని వెంట్రుకలు నిక్కబొడుచుట

గాదిలిసుత = ప్రియమైన కూతురు

గురి = లక్ష్యం

గుద్దలి = వేర్లు మొదలగునవి పెళ్ళగించెడి సాధనం

గొండ్లి = కుండలాకార నృత్యము

గొడుగు పాదలు = గొడుగులు గల పావుకోళ్ళు, కర్రచెప్పులు

గోమయము = ఆవుపేడ

గోముఖము = అలుకుట (ఆవుపేడతో అలుకుట)

గోరంతదీపం = చిన్నగా వెలిగేదీపం

ఘ

ఘన వనజాతలోచన = విశాలమైన తామరల వంటి కన్నులు గలది

ఘాతము = దెబ్బ

ఘూర్ణిల్లు = తిరుగుడుపడు, మ్రోగు

ఘోష = ఉరుము, ఆవులమంద, కంచు

చ

చట్టువము = గరిటె

చప్పటలు = చప్పట్లు

చమత్కారము = నేర్పు

చయము = సమూహము

చయ్యన = వెంటనే, త్వరగా

చరణద్వంద్వము = పాదములజంట

చాడ్పు = విధము

చిగురుబోడి = చిగురుటాకు వంటి శరీరం గల స్త్రీ

చిరంతనుడు = శాశ్వతుడు

చీఱు + ఎండ = అధికమైన ఎండ

చెక్కర్లు = అదేపనిగా చుట్టుతిరగడం

చౌకబారు = తక్కువ విలువ గలిగిన



## ఛ

ఛిన్నాభిన్నం =
ఛాత్రులు = శిష్యులు

## జ

జానపదులు = మనుష్యులు
జేవురు = ఎఱ్రనగు
జోక = యుక్తము, ఉత్సాహము, బాగు
జోటి = దుప్పటి
జ్వలనము = మంట

## త

తంత్రం = ఉపాయం
తడవు = ఆలస్యము
తమలపాకు తిమ్మలు =
తాండవం = ఉద్ధతనృత్యం
తాపసులు = తపస్సుచేసుకునేవారు
తారక = చుక్క
తారాడడం = తిరుగులాడడం, జీరాడడం
తిమిరం = చీకటి
తీరుబడి = తీరిక
తుచ్ఛము = దుఃఖము, శూన్యము
తేట = నిర్మలము, స్పష్టము, విశదము
తొంటి = తొల్లి
తొఱగుట = విడుచుట, తప్పించుకొనుట
తోయధి = సముద్రం
తన్మయులు = తత్స్వరూపమైనది
తర్కం = ఊహ, కారణం, కోరిక, ఒకశాస్త్రం
తాల్మి = క్షమ
తుల్యం = సమము, సరి

## ద

దమము = దండోపాయము, క్లేశము, ఇంద్రియము
దమ్మిడీ = ఐదుకాసులనాణెం
దిక్కృతి = దిక్పాలుడు
దీధితి = కిరణం, వెలుగు
దుష్ + చరిత + ఆలోచన = చెడుతలపు
దేవుళ్ళాట = వెదుకులాట
ద్వారికవాటము = ద్వారబంధము

## న

నగారా = పెద్దఢంకా
నలిరేగి = విజృంభించి
నిక్కము = నిజము
నిఖిల = సమస్త
నిచయము = సమూహము
నిదానము = మూలకారణము, నెమ్మదిగా
నిదాఘము = వేసవి, ఎండాకాలము
నీవార ముష్టింపచుల్= సహజంగా పండే వడ్లను పిడికెడు ఉంచుకొని కడుపునింపుకొనేవాడు
నెఱపూత = నిండుగా పూసినది
నెఱి = పూర్తి
నెట్టుకొను = పెరుగుతున్న
నొసలు = నుదురు
నొక్కి = అదిమిపట్టి
నిర్జనము = జనములేని
నిష్ణాతుడు = నేర్పరి

## ప

పంచజనుడు = పాంచభౌతిక శరీరం కలవాడు (మనిషి)
పగిది = విధము
పనిచి = నియమించి, పంపి
పరహితార్థం = ఇతరుల మేలుకోరుట
పరామర్శ = చక్కగా విచారించు
పరివ్రాజకుడు = సన్యాసి
పారాశర్యుడు = పరాశరుని కుమారుడు (వ్యాసుడు)
పాత్ర = ఒకవిధమైన కళ
పుట్టుకురుపు = క్యాన్సర్ వ్రణం
పుయిలోడు = వెనుదీయు, సంకోచించు
పూరము = జలప్రవాహము
పురంధ్రి = కుటుంబస్త్రీ
పులస్త్యబ్రహ్మ = బ్రహ్మమానస పుత్రుడు
పేరిణి = వీరనాట్యం
పేర్మి = అధికం, గొప్ప
పొదలు = వృద్ధిచెందు, పెరుగు
పోలుపు = ఒప్పు, విధము
పౌరాణికాలు = పురాణ సంబంధమైనవి



ప్రకంపనుడు = మిక్కిలి బలం కలవాడు
ప్రణమిల్లడం = నమస్కరించడం
ప్రవిమల = చాలాస్వచ్ఛమైన
ప్రజ్ఞానం = విశేషప్రతిభతోకూడిన జ్ఞానం
ప్రక్షాళితంబు = కడిగినది

### బ

బంతి = వరస, పంక్తి, సామూహిక భోజనానికి వరుసలో కూర్చోవడం
బస్తీజనం = పట్టణవాసులు
బుధులు = పండితులు, విద్వాంసులు
బృహత్తర = గొప్పదైన

### భ

భసితము = భస్మము
భక్షణము = తిండి
భక్షింపన్ = తినగా
భాసిల్లు = ప్రకాశించు
భుక్తిశాల = భోజనశాల
భూరుహం = భూమి నుండి పుట్టినది (చెట్టు)
భత్యాలు =

### మ

మందకొడి = మెల్లగా నడచువాడు
మందులు = చొరవలేనివారు, అల్పుడు, నిర్భాగ్యుడు, మూర్ఖుడు, మందమతి
మంద్రంగా = గంభీరంగా
మతిహీనులు = మతిలేనివారు
మధుకరభిక్ష = తుమ్మెదలా ఇల్లిల్లు తిరిగి అడుక్కోవడం
మననం = చింతన, గమనం
మనోహరం = ఇంపైనది, బంగారం
మచ్చకంటి = మీనాక్షి, చేపకనులు గల స్త్రీ
మహాప్రస్తానం = దీర్ఘప్రయాణం
ముక్కంటి = మూడు కనులు కలవాడు (శివుడు)
ములుకర్ర = ఎడ్లను పొడిచెడి మునికోల
ములుకు = మొనదేలిన భాగం
ముప్పిరిగొను = మూడుతాళ్ళు పెనవేసుకున్నట్లు
మూర్ధము = నడితల
మెండు = అధికము
మోడు = ఆకురాలిన వృక్షం
మోహము = అజ్ఞానము
మోక్షలక్ష్మి = మోక్షమనెడు లక్ష్మి (ముక్తి)
మౌళి = సిగ

### య

యాతన = తీవ్రమైన వేదన

### ర

రవళి = ధ్వని
రుగ్మత = జబ్బు
రేగి = ఎగసి, విజృంభించి
రోదసి = అంతరిక్షం

### ల

లలామ = శ్రేష్ఠ
లాతి =

### వ

వనజనేత్ర = కమలముల వంటి కన్నులు గలది
వర్ధంతి = మరణించిన రోజు
వాసము = ఇల్లు
వాచస్పతి = బృహస్పతి
విభూతివీధ్యము =
వీడు = పట్టణం
వెఱపు = భయం
వేదోక్తం = వేదంలో చెప్పడిన
వక్త్రంబు = నోరు
వర్ణభరితం = రంగులమయం
వార్తాహరి = వృత్తాంతం తెలిసికొనిపోయి చెప్పునది
విప్రభవనవాటికలు = బ్రాహ్మణ గృహాలున్న వీథి
వ్యోమము = ఆకాశం

### శ

శతాబ్దం = నూరు సంవత్సరాల కాలం
శాంతుడు = శాంతిగలవాడు
శిలోంఛప్రక్రములు = శిలప్రకములు (పొలాల్లో రాలిన కంకులను ఏరుకొని బ్రతికేవారు) ఉంఛప్రక్రములు (రోళ్ళవద్ద మిగిలిన బియ్యంతో జీవనం సాగించేవారు)

### స

సంకేతాలు = గుర్తులు, పేరు, ఏర్పాటు



| | | |
|---|---|---|
| సంత్రాసం | = | మిక్కిలి భయం |
| సంక్షిప్తం | = | కుదింపు |
| సద్దు | = | శబ్దము |
| సరభతోత్సాహం | = | అధికమైన ఉత్సాహం |
| సర్వము | = | మొత్తము |
| సహస్రాబ్దం | = | వేయి సంవత్సరాల కాలం |
| సత్త్వము | = | దేహబలం |
| సత్కృతులు | = | సత్కారాలు |
| సాంధ్య | = | సంధ్యా సమయం |
| సాతి | = | దుకూలము, వస్త్రము |
| సాధ్వి | = | పతివ్రత |
| సాన్నిధ్యము | = | సామీప్యము, సమీపము |
| సారము | = | చేప, బలము, శ్రేష్ఠం, ధనము, బలము |
| సింధూరిత | = | ఎర్రని |
| సుంత | = | ఇంచుక, ఇసుమంత |
| సూడిగములు | = | గాజులు |
| సేసలు | = | తలంబ్రాలు, అక్షతలు |
| సౌంజ్ఞ | = | సైగ |
| సౌజన్యం | = | మంచితనం |
| సౌదామిని | = | మెరుపు |
| సౌరభం | = | సువాసన |
| స్మరణ | = | తలపు |
| స్మితకాంతి | = | చిరునవ్వుల కాంతి |
| స్నిగ్ధ | = | సుకుమారమైన |

**హ**

| | | |
|---|---|---|
| హంగులు | = | |
| హితైషులు | = | మేలుకోరేవారు |
| హోరు | = | తీవ్రతను సూచించే ధ్వని విశేషం |

**క్ష**

| | | |
|---|---|---|
| క్షుత్పిపాసలు | = | క్షుత్తు (ఆకలి), పిపాస (దప్పిక), ఆకలిదప్పులు |

## నానార్థములు

| | | |
|---|---|---|
| అర్థి | = | వేడువాడు, వాది, కొలువుకాడు |
| కంకణము | = | తోరము, నీటిబిందువు, స్త్రీలు చేతికి ధరించేది |
| కదురు | = | కండె, సన్ననికమ్మ, అతిశయించు |
| కళ | = | చదువు, అవ్యక్తమధురధ్వని, శిల్పం, చంద్రునిలో పదహారోవంతు |
| కాలము | = | సమయం, నలుపు, చావు |
| కుండలి | = | పాము, నెమలి, వరుణుడు |
| కులము | = | వంశము, జాతి, ఇల్లు |
| గడ | = | స్తంభము, సమూహము |
| గుణము | = | స్వభావం, వింటినారి |
| గుడి | = | దేవాలయం, గుండ్రనిగీత, డేరా |
| గురువు | = | ఉపాధ్యాయుడు, తండ్రి, పురోహితుడు |
| గ్రహణము | = | బుద్ధి, నేత్రము, ఆదరించుట |
| ఘూర్ణిల్లు | = | మ్రోగు, తిరుగుడుబడు |
| నిట్టవొడుచు | = | ఉప్పొంగు, విజృంభించు, రోమాంచితమగు |
| ఫలము | = | పండు, ప్రయోజనం, సుఖం |
| ముద్ర | = | గుర్తు, అచ్చువేయడం, నాట్యవిశేషం |
| వనము | = | తోట, అడవి, జలము |
| వాసం | = | ఇల్లు, వస్త్రం |
| వెల్లి | = | ప్రవాహము, పరంపర |



# పర్యాయపదాలు

అగ్గించు = అతిశయించు, అధికమగు, ఎక్కువగు

అనలం = అగ్ని, మంట, నిప్పుజ్వలనం

అరణ్యం = విపినం, అడవి

అనృతము = అసత్యం, అబద్ధం బొంకు

అన్నం = బువ్వ, కూడు, బోనం

అర్ధాంగి = భార్య, పత్ని, ఇల్లాలు

అహిమకరుడు = సూర్యుడు, భానుడు, రవి

ఆగ్రహం = కోపము, క్రోధము, అలుక

ఆజ్ఞ = ఆదేశము, ఆన, ఉత్తరువు, నిర్దేశము

ఆస్యము = ముఖము, ఆననము, మోము

ఎలుక = మూషికము, ఖనకము, ఎలికము

కఠారము = ఖడ్గము, కత్తి, అసి

కన్ను = అక్షి, చక్షువు, నేత్రము, నయనం

కప్ప = భేకము, దర్దురం, మండూరం, మండూకం

కొండాడి = పొగడి, స్తుతించి, నుతించి

కోరిక = వాంఛ, తృష్ణ

కైరవం = కలువ, కల్హారం, కుముదం, ఇందీవరం

కౌముది = వెన్నెల, చంద్రిక, జ్యోత్స్న

గృహము = ఇల్లు, గేహము, నికేతము

చంద్రుడు = ఇందుడు, శశాంకుడు, నిశాకరుడు

చాడ్పు = విధం, భంగి, రీతి, తీరు

తమస్సు / తమము = చీకటి, ఆంధ్యం, అంధకారం, ఇరులు

తాండవం = ఉద్ధతనృత్యం, నాట్యవిశేషం

దయ = కృప, కనికరము, కరణ

దేహము = శరీరం, తనువు, కాయము

నరుడు = మానవుడు, మనిషి

నలిరేగు = విజృంభించు, మసలు

నితతి = సమూహం, గుంపు, బృందం

నిక్కము = నిజము, సత్యము

పల్లె = ఊరు, గ్రామం

పసిడి = బంగారం, కాంచనం, పుత్తడి

పారాశర్యుడు = వ్యాసుడు, బాదరాయణుడు

పూవు = కుసుమం, పుష్పం, విరి

బ్రాహ్మణులు = ద్విజులు, విప్రులు, భూసురులు

భాగీరథి = గంగానది, జాహ్నవి, పావని

మరణం = మృత్యువు, చావు

మిన్ను = ఆకాశం, గగనం, నింగి

మైత్రి = స్నేహం, నెయ్యం, సాంగత్యం

మౌళి = సిగ, శిఖ, కొప్పు

రాత్రి = నిశ, రజని, యామిని

రుగ్మత = జబ్బు, వ్యాధి, రోగం

వనిత = మహిళ, స్త్రీ, పడతి

వస్త్రం = వలువ, పుట్టము, చేలం

వివరము = రంధ్రం, బిలం, కలుగు

వృక్షము = తరువు, చెట్టు, భూరుహం

వెల్లి = ప్రవాహము, సరిత, నది, ఏరు

శివుడు = శంకరుడు, రుద్రుడు, భవుడు

సంఘం = సమూహం, బృందం, గుంపు

సాతి = వస్త్రం, దుకూలం, అంబరం

సుంత = ఇంచుక, ఇసుమంత, కొంచెం

స్మరణ = తలపు, జ్ఞప్తి

# వ్యుత్పత్త్యర్థములు

అమృతము = మరణం పొందింపనిది (సుధ)

అతిథి = తిథ్యాది కాలనియమాలు లేక ఇంటికి భోజనానికి వచ్చేవాడు (అతిథి)

ఈశ్వరుడు = స్వభావం చేతనే ఐశ్వర్యం కలవాడు (శివుడు)

గురువు = అంధకారమనెడి అజ్ఞానమును పోగొట్టువాడు (ఉపాధ్యాయుడు)

తాపసుడు = తపము చేయువాడు (ముని)

దేహుడు = దేహమును ధరించినవాడు (మనిషి)



పార్వతి = హిమవంతుడను పర్వతరాజు కూతురు (పార్వతి)
పుత్రుడు = పున్నామనరకము నుండి రక్షించువాడు (కుమారుడు)
పురంధ్రి = గృహమును ధరించునది (ఇల్లాలు)
భవాని = భవుని (శివుని) భార్య (పార్వతి)
మిత్రుడు = సర్వ భూతములయందు స్నేహయుక్తుడు (సూర్యుడు)
ముని = మౌనముదాల్చి యుండువాడు (ఋషి)
మూషకము = అన్నాదులను దొంగిలించునది (ఎలుక, పందికొక్కు)
మోక్షము = జీవుడిని పాశము నుండి విడిపించునది (ముక్తి)
వనజము = వనము (నీరు) నందు పుట్టినది (పద్మము)
విశ్వనాథుడు = ప్రపంచానికి నాథుడు (శివుడు)
శివుడు = శుభములనిచ్చువాడు (ఈశ్వరుడు)
శ్రియఃపతి = లక్ష్మీదేవికి భర్త (విష్ణువు)

## ప్రకృతి - వికృతి

అమ్మ – అంబ
ఆజ్ఞ – ఆన
ఆర్య – అయ్య
ఆసక్తి – ఆసత్తి
ఆహారము – ఓగిరము
ఈశ్వరుడు – ఈసరుడు
కష్టము – కస్తి
కలమ – కలము
కవి – కయి
కవిత – కైత
కాగితం – కాయితం
కావ్యము – కబ్బము
కుడ్యం – గోడ
కులము – కొలము
గుణము – గొనము
గుహ – గొబ
గృహము – గీము
గౌరవము – గారవము
చిత్రము – చిత్తరువు
ఛాయ – చాయ
జ్యోతి – జోతి
దోషం – దోసం
ధర్మము – దమ్మము
నిద్ర – నిదుర
పక్షం – పక్క
పంక్తి – బంతి
పట్టణము – పట్టము
పుణ్యం – పున్నెం
పుత్రుడు – బొట్టెడు
పుష్పము – పూవు
ప్రాణము – పానము
బంధువు – బందుగు
భాష – బాస
భిక్షము – బిచ్చము
భక్తి – బత్తి
భాగ్యం – బాగ్గెం
బ్రహ్మ – బొమ్మ, బమ్మ
ముక్తము – ముత్తెము
మత్స్యము – మచ్చెము
యాత్ర – జాతర
లక్ష్మి – లచ్చి
లేఖ – లేక
రత్నము – రతనము
రాట్ – ఱేడు

